# శివలింగ ప్రభేదములు

గ్రంథకర్త :
విద్వాన్
ఆసూరి శ్రీనివాస అయ్యంగారు

ప్రతులకు
శ్రీ పెదపాటి నాగేశ్వరరావు ఎం.ఏ.
వైస్ ప్రిన్సిపాల్

శిల్పకళాశాల
దేవాదాయశాఖ : తిలక్ రోడ్
హైద్రాబాద్ - 500 001 ఆం.ప్ర.
లేక
జ్యోతిక్లినిక్
బాకారం ముషీరాబాద్, హైద్రాబాదు

వెల. రు 10-00

# శివలింగ ప్రభేదములు

గ్రంథకర్త

విద్వాన్ ఆసూరి శ్రీనివాస అయ్యంగారు

పీఠిక

ప్రొ : పెదపాటి నాగేశ్వరరావు, ఎం.ఏ.,
వైస్ ప్రిన్స్‌పాల్, శిల్ప కళాశాల
దేవాదాయ ధర్మాదాయ శాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము
తిలక్ రోడ్, హైద్రాబాద్ 500001.

1981 Rs. 10/-

SIVALINGA PRABHEDAMULU (Varieties in Sivalingams)
research work on Saiva Agamas dealing with rules and regulations on preparation of Sivalinga)
By VIDWAN ASURI SRINIVASA IYENGAR

Price Rs. 10/-

Copies can be had from
Prof. P. NAGESWARA RAO, M.A;
Vice-Principal, Silpa Kalasala,
Endowment Department,
Government of Andhra Pradesh
Tilak Road, Hyderabad-500 001, A. P.

Printed at
Gayatri Printers, Tilak Road,
Hyderabad, Ph. No. 224313

# PREFACE

All major religions of the world have their own method of using letters, lines, diagrams, and icons to enjoy the bliss supreme through esoteric practices. Erotics too have played their own part in enhancing their values. Congregation is another aid to attract the common man and the Hindu congragation is carried through the temple worship all over the country.

This book deals with the Sivalingam, the iconographic representation of Siva, a member of Hindu Trinity in the linga form. It is an interesting problem for the students of Religion and Art. This linga is to be built according to the rules and regulations of Silpa Sastra and to be worshipped according to the rules of Agama sastra/Tantrasastra. South Indians claim their attachment with Agamasastra, and Bengalis and Assamis with Tantras. Legendary heroes like Rama and Krishna are also attached with the worship and propagation of this cult. There are 12 Jyotirlingas and 5 Mahabhuta lingas and a number of Swayambhu Lingas worshipped throughout the country. But there are some peculiar lingas like-Linga at Gudimallam, to riddle the Agama Students.

We have a nice account of various Siva lingams to be wrought and conscreted in Temples, according to the technical works of the tradition surveyed in this book. Vidwan Asuri Srinivasa Iyengar, the author of this book is known for his researches in this field and contribution to Agamakosa, at Tirupathi, and Silpasastra translation at Hyderabad. This book is an example of his erudite scholarship in the field of Agama, Silpa and tantra Sastras, and a great boon to the students of these deciplines in Telugu media. I commend the services of Sri A. Srinivasa Iyengar and T.T.D. authorities for bringing out this unique work.

Prof : P. Nageswara Rao
Vice-Principal
Silpakalasala : Endowments Department
Government of Andhra Pradesh : Hyderabad

శ్రీ ర స్తు

# ఉ పో ద్ఘా త ము

పరబ్రహ్మ స్వరూపము పంచేంద్రియములకు అతిరిక్తమైయుంటున్నది. కాని అగోచరమై ఉన్నదని ధ్యానించి పూజించుట ఎట్లు ?

"దృశ్యాభావే కథం జపం" ?
"నచరూపం వినాధ్యాతుం కేనాపి శక్యతే ।
శ్రీ విష్ణునం 29 [55]

"ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా ।

రూపములేని వస్తువును ఎట్లు మనస్సులో పెట్టి ధ్యానించుట ? గనుక పరబ్రహ్మ స్వరూపము ధ్యాన గోచర నిమిత్తమై సకలత్వమును పొందవలసి వచ్చినది. ఆ రీతిగా సకలత్వమును పొందిన తరువాత ప్రతిమ, లేక విగ్రహము లేక మూర్తులు ఇవి అనంత సంఖ్యలో పెరుగుతూ ఉంటున్నవి.

సర్వావయవ దృశ్యత్వాత్ ప్రతిమాత్వితి చోచ్యతే ।
సుప్రభేదము

సర్వావయవము దృష్టికి గోచరించుచున్నది గనుక దానిని ప్రతిమ లేక విగ్రహమని పిలవబడును

ఆ రీతి ఏర్పడిన ప్రతిమ అథవా విగ్రహమునకు సకళత్వము అని పిలుచుటకు మూల కారణమైన సకలత్వము మూడు విధములుగా విభాగించటమైనది. వీటి అర్థమును అయా ప్రకరణములందు వివరముగా వివరించబడియున్నది.

1 నిష్కళము 2 సకల నిష్కళము 3 సకలము అని మూడు విధములు.

1 నిష్కళమనగా రూపులేనిది అని అర్థము కాదు. లింగము ఒక విగ్రహమే మూన లక్షణ రూపములతో కూడియున్నది కాని దానిలో కరచరణాది అవయవములు, పంచేంద్రియములు, శిరస్సు ఏదియును కనిపించుటలేదు. కారణము పరబ్రహ్మ స్వరూపము పంచేంద్రియములకు అతిరిక్తమై ఉన్నది అని చూపించుటయే భావము. దీనికి లింగము అని సంజ్ఞ. [అగ్నిస్తంభ రూపము]

2 సకల నిష్కళము ఇది పంచేంద్రియములకు తెలిపే విధముగా ఉండినను కర చరణాది పూర్ణ శరీరమును చూపించక కేవల పంచేంద్రియములకు స్థానమైన శిరస్సును కంఠ భుజము వరకు చూపించుటము. దీనికి ముఖలింగమని పేరు.

3 సకలము కరచరణాది పూర్ణ శరీరమును అనగా ఆగమ, శిల్ప శాస్త్రము, పురాణములలో వర్ణించియున్న ఈశ్వరునియొక్క నానావిధములైన సోమస్కందాది రూపములు కూడ ఈశ్వరుని యొక్క ప్రతికృతులైయున్నవి గనుక వాటికి లింగములనే పేరు. వ్యత్యాసమేమనగా నిష్కళ లింగము సౌమ్యమనియు సకల లింగము రౌద్రమనియు పిలువ బడుతున్నది.

యద్యద్రూపం భవేతత్ సర్వం రౌద్రాంశ మేవహి ।

అజితా గమము 36

ఇపుడు సౌమ్య రూపమైన లింగ లక్షణమును గురించి ఈ గ్రంథమును వ్రాయుటకు అరంభించియున్నాను

ప్రతిమారాధనం ముఖ్యం సాకారాభిధీయతే ।
స్థండిలేచ జలేచైవ హృదయే సూర్యమండలే ।
ఆరాధనం నిరాకార మితి............

క్రియాధికారము [వైఖానసము]

దర్భము [మండలము] జలము, [కుంభము] హృదయము, సూర్యమండలమున చూచ

టయు, అగ్నిలో హెూమము చేయుట ఇత్యాదులతో పూజించి ధ్యానించుట నిరాకారమని చెప్పబడుచున్నది కాని లింగము ద్రవ్య, మాన చతురస్రాది నిర్దిష్ట ఆకారముతో కూడి యున్నది. పైన చెప్పిన కుంభము, మండలము అగ్నికిని భిన్నరూపమైయున్నది. దానిచే లింగముకూడ విగ్రహారాధనలో చేరియున్నది.

## ప్రమాణ గ్రంథములు

ఈ గ్రంథమును వ్రాయుటకు ఆగమ సంహితలు, శిల్ప శాస్త్రములు, పురాణము లను ప్రమాణ గ్రంథములుగా ఉపయోగించియున్నను వీటిలో ఆగమ మరియు శిల్ప శాస్త్రములలో లింగ లక్షణము, మానము, స్వరూపాదులు వివరించబడినవి. పురాణ ములలో కేవలము లింగము యొక్క సామాన్య లక్షణమును తెలిపి లింగ పూజాఫలము మరియు వ్రత కథలను మాత్రమే చెప్పబడియున్నవి.

లింగ విచారమై వ్రాయునపుడు మానము, శిరోవర్తనము, అంశ విభాగము, లక్ష ణాదులు వ్యత్యాసమై ఒక గ్రంథమందు చెప్పబడినది ఇంకొక గ్రంథమందు ఉండు దానికి సరిపడని సందర్భము. విరోధముగానున్న సందర్భము కలుగుచున్నది. ఆగమ శాస్త్రమునకు శిల్ప శాస్త్రమునకు సరిపడని సందర్భములును ఉన్నవి కాని

"తిమిరాచ్ఛిన్నం రాకాయాంచక్షు హీనగతిర్యథా
వినాశాస్త్రాను సారేణ వృథా భాగాది నిర్ణయః"

అనునట్లు ఆగమ మరియు శిల్ప శాస్త్రములు సరిగా తెలియకఉన్న యెడల ఏ విషయమును సరిగా ప్రతిపాదించుటకు సాధ్యపడదు. తదనుసారముగా లక్షణము పొందుట [కలవటము]లేదు. ధ్యాన పూజాదులకు సహాయము అగుటలేదు. దానిచేత గ్రంథము వ్రాయుటకు శాస్త్ర జ్ఞానము చాలా అవశ్యకము.

శాస్త్రానుసారతః కర్మ యదిస్యాత్ సర్వసమ్మతం ।
వినాప్రత్యక్ష జ్ఞానేన జటిలా జాయతేక్రియా ।

శాస్త్ర జ్ఞానమును ఎంతో సంపాదించినను ప్రత్యక్షానుభవము మరియు పరంపరా జ్ఞానము లేనియెడల లింగముయొక్క శరీర రచనా విషయములో సమన్వయముచేయుట సాధ్యమగుటలేదు.

భక్తాశ్చ బహుధా శాస్త్రం ప్రశన్యంన్తిధ మేవహి ।
తదుక్తం దైవవిధినా కల్పయే దాలయాదికం ।
యథా మానాది కరణేమయాప్రోక్త స్సవిస్తరః ।
యత్రవాదృశ్యతే భేదా భగవచ్ఛాస్త్ర శిల్పయోః ।
శిల్పశాస్త్రం పరిత్యజ్య భగవచ్ఛాస్త్ర వచ్చరేత్ ।
ప్రధానమేత చ్ఛాస్త్రం సా భగవత్ గేహకల్పనే ।
నతచ్ఛాస్త్ర మనాదృత్య కార్యం కించిత్ సమాచరేత్ ।

ప్రకీర్ణాధికార 34

శిల్ప శాస్త్రములు, అగమ సంహితలు అనేకముగా వున్నవి. ఏది ఏ విషయమును వివరించినను అధిక గ్రంథములను చూడని యెడల సందిగ్ధ స్థితి చేత పదార్థ వస్తువు యొక్క రూపగుణ మానములు సరిగా సిద్ధించుటలేదు. శిల్పము మరియు ఆగమ శాస్త్రము అను రెంటిని పరిశీలించవలయును. జతలో ప్రత్యక్ష జ్ఞానము అవశ్యకము. వజ్ర వైడూర్యాది నవరత్నములు ప్రకాశముగా వుండినను సువర్ణ సహాయము లేనిదే శోభాయమానమగుటలేదు. అదేరీతిలో శిల్పశాస్త్రముమరియు అగమశాస్త్రము ఈరెండును పరిశీలించుటచే విషయము సమంజసమైతెలియును. ఒకవేళ శిల్పశాస్త్ర, ఆగమశాస్త్ర విషయములు ఒకటికొకటి విరోధమయిన యెడల అగమశాస్త్ర[భగవత్‌శాస్త్రము]మును ప్రధానముగ అంగీకరించి నడవవలయును. ఇపుడు మనము సాధ్యమైనంతవరకు శిల్పశాస్త్రము మరియు అగమ సంహితల పరస్పరఅవలోకనముచేత విషయమును సంగ్రహించి భేదము కనిపించిన స్థలములో సమన్వయముచేసి ఈ గ్రంథము వ్రాయబడియున్నది సంహిత సంహితా భేదము వుండి శిల్ప శాస్త్రము వివరించక వున్న స్థలములో అజితాగమమును ప్రధానముగ ఉపయోగించియున్నాను. అన్ని విషయములందు ఈ గ్రంథము సమంజనముగా ఉండి విషయము స్పష్టముగా వివరించబడియున్నది.

ఏకేన శాస్త్రేణ గుణాధికేన ।
వినాద్వితీయేన పదార్థ సిద్ధిః ।
తస్మాత్ ప్రకారాంత రతో విలోక్య ।
మణింగుణాఢ్యోఽపి సహాయకాంక్షీ ।

రూపమండనము ప్రాసాదమండనము 8 [115]

V

## శైవ, పాశుపత, భైరవాది లింగ భేదములు

లోకములో అనేక మతములున్నవి. ఆయా మతములు వారి వారి ఉపాసన దేవతను ధ్యానించి పూజించుటకు ఆయా దేవతల స్వరూపమును విగ్రహ రూపమున నిర్మించి దేవాలయములో ప్రతిష్ఠించి పూజించుచున్నారు. అదే రీతిగా పరమ శివుని ప్రధాన దేవతగా నిర్ణయించి వాని స్వరూపమైన లింగమును [సంజ్ఞ] విగ్రహరూపములో నిర్మించి ఆలయములో ప్రతిష్టించి వస్తూన్న మతములు అనేకములు ఉంటున్నవి.

శైవం పాశుపతంచైవ కాలాముఖ మహావ్రతే ।
వామంచ భైరవం చైవనామ లింగస్య షడ్విధం ।
మానసారము 52
శుకప్రశ్న సంహిత 36 [256-257]

ఉపాసకుని భేదము చేతను, ఉపాస్య దేవత యొక్క లక్షణము చేతను, పూజా విధిని అనుసరించియు లింగములు 6 విధములని విభజింపబడినవి. 1 శివ లింగము 2 పాశుపత లింగము 3 కాలాముఖ లింగము 4 [మహావ్రత] మహీవ్రత లేక మహీ పాల లింగము 6 భైరవ లింగము అని ఈ ఆరు మతములు పరమ శివుని పరబ్రహ్మ ముగా భావించి వానియొక్క ప్రతీకమైన లింగమును పూజించుచున్నారు. కాని పైన చెప్పిన ఆరుగురుజనులు మత తత్వము, సంప్రదాయము, ఆచారము, వ్యవహారములలో ప్రతిఒక్కరు భిన్నభిన్నమై వుంటున్నారు. ఆ లింగము అందరిచేతను పూజింపపడుట కైనను ఆ లింగమునకు ఆయా నామములు చెప్పబడుటకు కారణముగా ఆయా మతము యొక్క లక్షణ గురుతులు ఆ లింగమందు వుండినట్లయితే పాశుపత లింగము, శివ లింగము, భైరవ లింగము, మొదలయిన నామములచే పిలువబడుతున్నవి. కొన్ని అంశములు అనగా లింగము యొక్క ప్రతిష్ఠా స్థానము, పూజా విధానము, అధికారియు ఇత్యాదుల ననుసరించి ఒకరు ఇంకొకరి లింగమును అంగీకరించుటలేదు. ఆ రీతిలో 6 విధములుగా భేదములున్నవి. వీనినన్నిటిని విశదముగా వ్రాయుటకు గ్రంథ విస్తర భయముచే వ్రాయుటలేదు.

1 మహావ్రత లేక మహీపాల లింగము— ఈ లింగమునకు అయిదు ముఖములు లేక రెండు ముఖములు. ఈ లింగమును ఆలయమందు ప్రతిష్ఠించుటలేదు. శత్రు నిరసన

రాజ రాష్ట్ర క్షేమము కోరి అరణ్య, పర్వత లేక దేశము యొక్క సరిహద్దు ప్రదేశమందు ప్రతిష్ఠించి దానికి ఏర్పడిన విధి నియమములచేత పూజింపబడును.

2 వామ లింగము– సప్తమాతృ ప్రధానమైన ఈ లింగము తంత్రశాస్త్ర మరియు స్వచ్ఛంద శాస్త్ర రీతిగా పూజింపబడును. వామసంప్రదాయమందు అవాంతర భేదముగా దక్షిణమిశ్ర మరియు యామళి అను భేదములున్నవి. ఈ వామలింగమును ఆచార్య, సాధక, సమయ, పుత్రక, చిత్రఖేటక అనువారు దానికి ఏర్పడిన విధి నియమ ప్రయోగ పూజావిధి ప్రకారముగా పూజించుచున్నారు. ఆ లింగముపైన త్రికోణాకారము లేక యోన్యాకారము యొక్క గురుతులు ఉండవచ్చునని ఊహించబడినది. ఈ వామ సంప్రదాయము శుద్ధ సంప్రదాయము యొక్క అంతర్గతమై యుండినను శైవసిద్ధాంతము వారు దీనిని అంగీకరించుటలేదు·

3 భైరవ లింగము– శైవ మతములో నిరీశ్వర, సేశ్వర. కాపాల, భైరవ, అని నాలుగు అవాంతర భేదములున్నవి. పైశాచ మతములో అవాంతరమతముగా చెప్పబడు భైరవ మతమునకు కాపాల మతము యొక్క భైరవ మతమునకు ఎట్టి సంబంధము వుండదు. కాపాలిక మరియు యామళ మతమందు భైరవుడే పరాత్పర దేవత. ఈ లింగము, లింగము లేక త్రిశూలము, లేక అడ్డంగా పెట్టిన కత్తియు. లేక పరచిన కత్తులు [తీసితే వెడల్పు అవుతవి] ఈగురుతులు లింగము పైన ఉండవచ్చునని ఊహించుటయైనది. ఈ శివలింగమందు సాధనవిద్య యనగా శిరచ్ఛేదన ప్రకారమును తెలిపించుచున్నది. ఈ ప్రక్రియ కాంభోజ దేశమందుఉండినను ఆచరణలో ఉండినది. సాధనవిద్యలో శిరచ్ఛేదన ప్రకారమును రావణుడు అనుష్ఠించిన విషయము రామాయణ గ్రంథములో కనపించుచున్నది.

4 పాశుపత లింగము — ఇప్పుడు వివరములు దొరుకుటలేదు.

5 కాలాముఖ లింగము లేక ప్రాప్త లింగము— ఇప్పుడు వివరములు దొరుకుటలేదు·

6 శివలింగము– ఇది శుద్ధ శైవమతమునకు చేరినది. దీనికి అగమోక్త లింగమని పేరు. చతురస్ర, అష్టాస్ర, వృత్తరూపములో బ్రహ్మ విష్ణు రుద్ర త్రిమూర్తి స్వరూపమై

యుండి మానలక్షణముతో కూడి యుంటున్నది. ఈలింగ విషయమై ఈ గ్రంధమందు వివరముగా చెప్పబడియున్నది.

## ప్రతిష్టిత లింగనామ కరణము

పూర్వమందు దివ్యక్షేత్రముల నుండియు, నర్మదా తీరము నుండియు, లింగ రూపమైన శిలనుతెచ్చి బ్రహ్మ నిష్ఠులచేతను, సిద్ధ పురుషుల చేతను ప్రతిష్ఠింపబడి ఆయా క్షేత్రాధిపతియొక్క నామము లేక పురాణమందు చెప్పబడిన నామము లేక తమకు ఇష్ట మయిన నామముతో పిలుచుచున్నారు. మానుష లింగము అనగా చతురస్ర, అష్టాశ్ర, వృత్త రూపములందు బ్రహ్మ విష్ణు రుద్రాంశములతో కూడిన లేక ద్రవ్య, మాన, శిరో వర్తన భేదములను అనుసరించి వివిధ నామములతో చేయుటను ఆయా ప్రకరణము లందు వివరముగా చెప్పబడియున్నది. దాని ననుసరించి ప్రతిష్ఠ అధికారి మరియు క్షేత్రవాసులకు ఇష్టమువచ్చిన నామమును లింగమునకు ప్రతిష్ఠా కాలమందు నామకరణ చేయవచ్చును.

## పుణ్య క్షేత్రమందు ప్రతిష్ఠితమైన లింగములు

కొన్ని ప్రసిద్ధపుణ్యక్షేత్రములందు ప్రతిష్ఠితమైయున్న లింగములు ఈగ్రంధమందు చెప్పబడిన అగమ శాస్త్రాను రీతిగా మాన, లక్షణోద్ధారములతో సరిపొందక వుండ వచ్చును. లేక కొన్ని అంశములు పొందవచ్చును. అ లింగములు ఆయా క్షేత్ర మహాత్మ్యమును, చరిత్రను అనుసరించిన లక్షణములతో కూడియుంటున్నవి వాటి విచా రమై మనకు విషయ వినిమయమును చేయుటకు ఎట్టి అధికారము వుండదు.

## బ్రహ్మ–విష్ణు–రుద్ర త్రిమూర్తి స్వరూపము

వహ్నే రుష్ణత్వ శక్తి వీనా భావీతే వీభో
అమూర్తిశ్చే దమూర్తాఖ్య స్సమూర్తిశ్చేత్ నమూర్తకం
నదాశివః శివరుద్రౌ విష్ణుబ్రహ్మేతి బోధితః ॥ సుప్రభేదము ।

అగ్నినుంచి ఉష్ణత్వమును వేరుచేయ సాధ్యపడదు. ఏ రీతిగా రెండు ఒకటియై చేరియుంటున్నవో అదే రీతిగా అ నదాశివుడు, శివరుద్ర, విష్ణు, బ్రహ్మాదుల భేదముతో

వుండినను అమూర్తమైన లింగములో కాని సమూర్తమైన సోమస్కందాది విగ్రముల కాని వీరందరు [బ్రహ్మ విష్ణు రుద్రులు] చేరి ఒకే రూపముతో వుంటున్నారు. సృష్టి, స్థితి, లయములతోకూడిన సదాశివుని ఏకకాలమందు లింగమందో లేక విగ్రహముల చూపినట్లగును. ద్రవ్య, మాన, స్వరూప, వైవిధ్యాదులను అయా ప్రకరణములందు వివరించబడినది.

నిష్కళ [అవయవాది రూపరహితమైనది] రూపమందుండినను త్రిమూర్తి స్వరూపముతో కూడియున్న లింగమునుకాని శివుని సకలరూపమైన సోమధారి విగ్రహములను శైవులే పూజించి ఆరాధించవలననే నియమము కనబడుటలేదు. శ్రీ వైష్ణవులలో ఒక భాగమైన వైఖానస అగమ సంప్రదాయము కలిగినవారు నిష్కళ లింగమునేకాని, సకల రూపమైన సోమస్కంధాది మూర్తులను బ్రహ్మ, విష్ణు, విగ్రహముల జతలో ప్రతిష్ఠించి "త్రిమూర్తి ప్రతిష్ఠ" అని పిలుచుచున్నారు. ఈమూడు మూర్తులు పూర్ణమై ఒకే విగ్రహ మందు ఉండుట సాధ్యముకాదు కావున ప్రత్యేక ప్రత్యేకమై వారి వారి చిహ్నములతో ఒకే ఆవరణమందు వేరువేరు గర్భగృహములలో ప్రతిష్ఠించి పూజించుచున్నారు.

శైవాగమందు బహులింగ వ్యవస్థలో[పంచలింగ, నవలింగ]బ్రహ్మ భాగముండుట లేదు. అదే రీతిలో వైఖానసు సంప్రదాయస్థులు బ్రహ్మను విడిచిపెట్టి విష్ణు రుద్రులను ప్రతిష్ఠించి పూజించుచున్నారు. దీనికి ద్విమూర్తి ప్రతిష్ట అని అందురు. శైవాగమము యొక్క ఏకలింగ ప్రతిష్ఠ రీతిగా గర్భగృహమందు లింగమును ప్రతిష్ఠించి దానిముందు శంఖచక్రదారియైన విష్ణు విగ్రహ ఉత్సవమూర్తియును ప్రతిష్ఠించి విష్ణు లింగమని పిలుచున్నారు. ఈశ్వరుని స్థానమందు సోమధారి విగ్రహమునేకాని, లింగమునే కాని చూడవచ్చును. కాని పాంచరాత్ర అగమ ప్రక్రియలో యీ రీతిగా కనిపించుటలేదు. అచట ద్విమూర్తి యనగా నారాయణ వాసుదేవననియు త్రిమూర్తి యనగా నారాయణ వాసుదేవ, విష్ణు అనియు చెప్పుదురు. [పాద్మసంహిత] కాని వైఖానస/పాంచరాత్ర గ్రంధమందు లింగప్రతిష్ఠ, ఉత్సవాది ప్రకరణములు విశదముగా చెప్పబడియున్నది.

విమానార్చనకల్పము పేజీ 204
క్రియాధికారము 17 [1-2]
పాద్మ సంహిత, క్రియ హయశీర్ష సంహిత లింగకాండము.

# IX

## ఆగమోక్త పూజారంభకాలము

హిమవత్ పర్వత రాజు యొక్క కుమార్తె పార్వతియు తదనంతర కాలమందు లంకాధిపతియైన రావణుడు, తదనంతర కాలమందు రాజులు, ఋషులు' సిద్ధపురుషులు లింగపూజను ఆచరించి యుండుట మనకు ఇతిహాసమూలముగా తెలిసివచ్చియున్నది. పురాణములందు అనేక స్థలములందు లింగపూజా ఫలమును విశేషముగా ప్రతిపాదింప బడియున్నది.

ఆగతం శివవక్త్రేభ్యోగతంచ గిరిజాననే
మతంచ వాసుదేవస్య తస్మాత్ ఆగమముచ్యతే

మేము వ్రాసియున్న ఆగమ ప్రకాశ గ్రంథములో శైవాగమ కాలమును వివరించి యున్నాము. శ్రీ కృష్ణ పరమాత్మని యొక్క ఆజ్ఞలను పొంది పాంచరాత్ర వైఖానస శాస్త్రములు వ్రాయబడినవి. వాటి జతలోనే శైవాగమ గ్రంథములు వ్రాయబడినవి. ఆకాలమునుంచి ఆగమోక్త రీతిగా లింగ ప్రతిష్ఠ పూజ ఉత్సవాదులు ఆరంభమైనవి.

కాల నిర్ణయము రెండు విధముగా వుంటున్నవి 1 ఆగమ శాస్త్ర పూర్వకాలము 2 ఆగమశాస్త్ర అనంతర కాలము అని మాన లక్షణములేని లింగము మరియు విగ్రహ ములు భూగర్భ శోధనలలో దొరికిన యెడల అవి ఆగమశాస్త్ర ప్రచారమునకు పూర్వ మనియు ఇపుడు ఉన్న ఆగమ గ్రంథములకు అనుసారముగ మాన లక్షణములతో కూడి యున్నచో అవి ఆగమోక్త విగ్రహములనియు స్థూలమైన కాలమును నిర్ణయించవలెను.

సిద్ధక్షేత్రేతు బింబాది పూర్వం లక్షణ వర్జితం
శ్రీ విష్ణు తిలక సంహిత 6
"పూరాప్రమాదా ద్ధామాది ప్రమాణ రహితం కృతమ్"

కొన్ని సిద్ధములుగను మరియు పుణ్యక్షేత్రములందు మానలక్షణములులేని లింగ ములను చూడవచ్చును. ఆలయాదులందు కూడ మాన ఆయ వ్యయములులేని గర్భ గృహాదులు కట్టబడియున్నవి. అవి ఆగమశాస్త్ర ప్రచారమునకు పూర్వమని తెలియ వలెను. ఎందుకనగా మనోభావము, ధ్యానము ముఖ్యమని తెలిసి రూపములేని ఒక శిలను దేవుడని ప్రతిష్ఠించినను అచట దేవతా సాన్నిధ్యము ఉంటున్నది. ఆగమశాస్త్ర

ప్రచారమునకు వచ్చిన తరువాత అన్నియు సువ్యస్థగా నడచివచ్చుటచేత జీర్ణోద్దరణ కాల మందు ఆగమశాస్త్రము ననుసరించి మానలక్షణములతో విగ్రహ మరియు ఆలయమును నిర్మించుటకు అవకాశమున్నది. దీనిచేత ఆగమశాస్త్ర ప్రచారమునకు పూర్వమందే లింగము యొక్క పూజా పద్ధతియు వుండినదని తెలియవస్తున్నది.

ఆగమశాస్త్రము అనాది అయినది. ఒక్కొక్క శాస్త్రముయొక్క పేరులో పిలువబడి ప్రమాణముగా అంగీకరించి దాని రీతిగా పూజావిధానము చేయబడుతున్నది.

కృతేశ్రుత్యుక్త మార్గంస్యాత్ త్రేతాయాం స్మృతిసంభవః
ద్వాపరే పురాణోక్తః కలౌ ఆగమసమ్మతః

కృతయుగమందు వైదికారాధనము, త్రేతాయుగమందు స్మృతి శాస్త్రమును అనుసరించియు, ద్వాపరయుగమందు పురాణోక్తముగాను కలియుగమందుఆగమశాస్త్రము ననుసరించియు పూజావిధానము చేయబడును. అనగా అన్నిటికి ఆగమశాస్త్రమనే పేరు. ఆయా భాగములు ప్రయోగ ప్రకరణములు. కలియుగమందు ఆగమశాస్త్ర ప్రకారము అనగా సంహితల ప్రకారము అని అర్థము.

ప్రకృత కాలమందు భూగర్భ శోధనచే ఏకలింగము, ముఖలింగము, శివుని చిహ్నములు కలిగిన నాణ్యములు ఇత్యాదులు దొరికి ఉన్నవి. నాణ్యముపైన గురుముఖ అక్షరములున్నవి ఇవన్నిటిని క్రీ॥ పూర్వమని చెప్పుదురు

## శైవాగమ మోక్ష స్వరూపము [శివసాయుజ్యము]

లింగమును పూజించుటచేత ఏ దేవుని పూజించినట్లు అవుతున్నది. లింగము ఏ పరాత్పర వస్తువు యొక్క చిహ్నము? ఈ విషయమును లింగముయొక్క ఆవిర్భావ ప్రకరణములో విశదముగ చెప్పబడినది.

లింగము మహేశ్వరుని యొక్క చిహ్నము. పరాత్పరుడు, మంగళస్వరూపుడు, జ్ఞానసంపన్నుడు అయి వున్నవాడు గనుక వాని చిహ్నమైన జ్యోతిస్థంభ రూపమైన లింగ మును అర్చా విగ్రహముగ నిర్మించి ప్రతిష్ఠించి పూజించుటచేత పరమశివుడు ఈచేతనుని భక్తికి ప్రీతుడై ఫలమును అనుగ్రహించును.

సర్వేషాం జ్ఞానినాంచైవ పతిజ్ఞాని వరిష్టకః
ముక్తిమార్గం తదాచైవ సాలోక్యంచ సామీప్యకం
సారూప్యంచైవ సాయుజ్యం చతుర్భేద మితిస్మృతమ్
సుప్రభేదము యోగ 3 [95-100]

పునరావృత్తి రహితమైన శివలోకమందు శివపరమాత్మని సానిధ్యమందు శివపర మాత్మని రీతిగా తేజోరూపమునుపొంది సదాబ్రహ్మానందముచే శివపరమాత్మని కైంకర్య మందు నిరతులై యుండవచ్చునని శాస్త్రమందు చెప్పబడుతున్నది

## క్షేత్ర లింగము

క్షేత్ర లింగమనునది బ్రహ్మనిష్ఠుడైన లేక సిద్ధ పురుషుని యొక్క జ్ఞాపకార్థమై వాని సమాధి స్థలమందు లేక నదీతటాక తీరములలో లింగప్రతిష్ఠితమైన ఆలయమును నిర్మించుట. ఈ క్షేత్ర లింగము శత్రు జయము, రోగము ఉపద్రవము ఇత్యాదుల శాంతి కోరి ఆలయము యొక్క తృతీయావరణమందు స్థాపింపబడును.

రౌరవాగమము క్రియాపాదము [1-8]

## గ్రంథ కర్తల యొక్క కష్టము

శివలింగముల నిర్మాణ విషయమ దు అగమ మరియు శిల్పశాస్త్రములలో వివిధ రీతిగా మాన, లక్షణ స్వరూపములను వివరించియున్నారు. అనేక స్థలములందు వాక్య ములు అనన్వయముగా యుంటున్నవి. కొన్నిస్థలములందు వాక్యములు అర్థమగుటలేదు కొన్ని స్థలములందు సందిగ్ధముగాఉండి విపరీతార్థమును ఇస్తున్నవి. కొన్ని స్థలములందు పూర్వాపర విరోధముగా వుంటున్నవి. వీటినంతా సరిదిద్ది ఒకనిర్ణయమునకు వచ్చుటకు కష్టసాధ్యమై యుంటున్నది.

ఉదాహరణముగా త్రైరాశిక లింగము మరియు అర్ధలింగముల విచారములో వివరించియున్న దానిని పరిశీలించిన యెడల సంస్కృతము యొక్క సాహిత్య భాషకు

ఆగమ శాస్త్రము యొక్క పారిభాషిక పదమునకు అర్ధము కల్పించుటలో భాషా ప్రధానమైన యెడల గణితము సరిపొందుటలేదు. గణిత ప్రధానమైన యెడల స్వరూప లక్షణములు సరిపొందుటలేదు దీని కొరకై ఇవి రెండును అనుసరించి– "అలంకారాసనం కుర్యాత్ సప్రమాణం విచారయేత్" అని చెప్పిన వాక్యమును ఇచట ఉపయోగించవలసినది. "శాస్త్రమార్గేనయోరమ్యో నరమ్యోనాన్య యేవహి" అను వాక్యమును ఈ స్థలమందు విడిచిపెట్టవలెను. ఏది ఎచ్చట ప్రధానముగ ఉపయోగించవలసినదో దానిని తీర్మానించుట చాలాకష్టకరమైయున్నది.

ఈ విషయమందు పరంపరాగతులైన ఆగమిక భట్టాచార్యులను విచారించినచో వారు కేవల కర్షణాది ప్రతిష్టాంతము, ప్రతిష్టాది ప్రాయశ్చిత్తాన్తము చేయవలసిన ఆగమ ప్రయోగశాస్త్రము యొక్క పూజ ఉత్సవాదులను నడపించుటలో నిష్ణాతులై యుంటున్నారు గనుక ఆలయము, విగ్రహము, లింగము వీటి శరీర లక్షణము నిర్మాణాదులను గమనించుటలేదు. ఇక లింగము యొక్క శరీరమును నిర్మించు పరంపరాగతుడైన శిల్పాచార్య మరియు స్థపతులను విచారించిన యెడల వారు తమకు అనూచానముగ వచ్చిన విగ్రహ నిర్మాణము ఆలయ నిర్మాణ విషయములో నిష్ణాతులై యుంటున్నారు ఒకవేళ శిల్పశాస్త్రమును చదివి యుండినను ఆగమ శాస్త్రముతో సమన్వయపరచి చూచి వుండరు. తమకు అభ్యాసముగా వచ్చిన మార్గమందే నడచువారే గనుక శాస్త్రదృష్ట్యా ఆగమ, శిల్ప పురాణముల వాక్యములను సమన్వయపరచి పరిశీలన చేయవలసినది అను విచారమును ఆలోచించుటలేదు.

ఒకవేళ ప్రాచీన దేవాలయములలో ప్రతిష్ఠితమైయున్న లింగమును చూచి దాని రీతిగా నిర్మించవచ్చును. కాని ఆ దేవాలయములో ప్రతిష్ఠితమైయున్న లింగము యొక్క శరీర నిర్మాణము కనబడుటలేదు. మానము, అంశము ఏదియు అర్ధమగుటలేదు. ఏలననగా బ్రహ్మభాగము భూమిలోను, విష్ణు భాగము పీఠములోను, అంతర్గతమై యుంటున్నది. మీదికి చూచుటకు కేవల రుద్ర భాగము మాత్రమే కనబడుచున్నది దీనినంతా ఆలోచించి ఈ గ్రంధమును అందరి ఉపయోగమునకై విషయమును అన్ని గ్రంధముల నుంచియు సంగ్రహించి భేదమువచ్చిన స్థలమందు విషయమును సమన్వయపరచి వ్రాయబడినది.

# శాస్త్ర ప్రమాణము

శివలింగ ప్రభేదములు అనే ఈ గ్రంధమును వ్రాయుటకు ఈ క్రింద కనపరిచిన గ్రంధములనుంచి విషయములను సంగ్రహించి వ్రాయుటయైనది.

| శైవాగమము | పాంచరాత్రము | వైఖానసము |
|---|---|---|
| 1 సుప్రభేదము | హయశీర్ష సంహిత | ప్రకీర్ణాధికారము |
| 2 అజితాగమము | విష్ణు సంహిత | విమానార్చనాకల్పము |
| 3 కామికాగమము | శ్రీప్రశ్న సంహిత | క్రియాధికారము |
| 4 పూర్వకారణము | విష్ణు తిలకము | **శిల్ప గ్రంధములు** |
| 5 ఉత్తరకారణము | పురుషోత్తమ సంహిత | అపరాజితపృచ్ఛ |
| 6 కిరణాగమము | పాద్మ సంహిత | దీపార్ణవము |
| 7 రౌరవాగమము | పౌష్కర సంహిత | శిల్ప రత్నము |
| 8 ఈశానశివగురుదేవపద్ధతి | | కాశ్యప శిల్పము |
| 9 సిద్ధాంత సారావళి | **పురాణము** | మానసారము |
| 10 చంద్రజ్ఞానము | మత్స్యపురాణము | మయమతము |
| 11 వీరాగమము | | రూపమండనము |
| 12 వాతూలాగమము | | ప్రసాదమండనము |

ఈ గ్రంధమందు యవ, అధవ ముద్గ, అంగుళ, హస్త, తాలము అని మానము యొక్క పదములు ఉపయోగించబడియున్నవి. ఆ పట్టిక వివరణ ఇచట ఇవ్వబడినది.

8 పరమాణువులు – 1 కేశాగ్రము
8 కేశాగ్రములు – 1 లిక్షా
8 లిక్షలు – 1 యూక
8 యూకలు – 1 యవోదరము [ముద్గమము]
8 యవోదరము – 1 అంగుళము
12 అంగుళములు – 1 తాలము
2 తాలము లేక 24అం–1 హస్తము
[ఒక తాలము అనగా 12 అంగుళములు ఇంగ్లీషు 9 అంగుళములు]

# ఉపసంహారము

ఈ గ్రంథమందు అనేక విషయములను వ్రాయవలసినదని ఉద్దేశ ముండినను గ్రంథ విస్తర భయముచే వ్రాయబడలేదు. శ్లోక ప్రమాణము యొక్క ఆకరము అచ్చటచ్చటనే ఇవ్వబడియున్నది. అన్ని ఆకరములను ఇచ్చుటకు సాధ్యము కానందున ఒక్కొక్క సంహిత గ్రంథముల నామములను ఇచ్చియున్నాను. ఇతర గ్రంథముల యొక్క ఆకరములను ఇవ్వబడక యుండినను ఆ విషయములు ఇతర గ్రంథములలో లేదని తెలియకూడదు.

పాఠకులు దీనిలో విడివిపోయిన మరియు న్యూనాతిరిక్తములను తెలిపించిన యెడల ముందు ముద్రించు పునఃముద్రణమందు సరిపరచ వచ్చును. లేక మనము ముందు ముద్రించు "ఆగమోక్త మూర్తులు" అనే గ్రంథమందు సరిపరచవచ్చును అని విజ్ఞాపించుచున్నాను. అఖరులో పాఠకుల సౌకర్యము కోరిక పై కొన్ని సంప్రదాయ విషయములను వ్రాసి ఈ గ్రంథమును పూర్తి చేయుచున్నాను.

గ్రంథకర్త –

విద్వాన్ ఆసూరి శ్రీనివాసయ్యంగార్యః

# విషయసూచిక

శ్రీరస్తు

# 1 శివజ్ఞానము - తత్వభేదము

ఏకో దేవ స్సృజయతి శివః కేవలం జ్ఞావమూర్తిః ।
దేవిసాచ త్రిభువన మిదం యద్వి భూతే ప్రపంచః ।
యత్ కూటస్థం మిధునమవినాభావ సంబంధ యోగాత్ ।
మిశ్రీ భూతం తదఖిల జగజ్జన్మ బీజం నమామి ।

శివలింగములు అనే ప్రకరణమును శాస్త్రోక్త ప్రమాణములతో వ్రాయుటకు అరంభించబడినది. ఈ విషయములో శైవాగమ గ్రంధములు, పురాణ మరియు శిల్ప గ్రంధములు ఆధారమైయున్నవి లింగముల యొక్క పూజా విధానము ఏ రీతిగా ఏర్పడినది? దీనికి కారణము ఏమి? ఇత్యాది విషయములను తెలియుటకు లింగము యొక్క ఉత్పత్తి విధానములును దానికి మొదట శైవాగమ రీత్యా సృష్టి క్రమములను తెలియుట అవశ్యకము. శైవాగములలో కామి కాగమము మొదలైన 28 అగమములున్నవి. వాతూలాగమము దీనిలో ఒకటి. దానిలో ఈ సృష్టి క్రమము లన్నియు చాల చక్కగా వివరింపబడియున్నవి గనుక దాని ప్రకారమును సంక్షేపముగా ఈ ముందు వివరించబడియున్నది.

ఒక కాలమందు కైలాస శిఖరముపై సింహాసనాసీనుండైన శ్రీకంఠని నమస్కరించి స్కందుడు [షణ్ముఖుడు] "మన్నించి ఈ మొదటే సర్వలోక హితమైయు యోగుల యొక్క రక్షణార్థమైయు అనేక మంత్ర తంత్రములు చెప్పబడినవి." ఇపుడు

'పుంసా మనుగ్రహార్థాయ జ్ఞానినాం ముక్తి కారణం ।
శివ జ్ఞానం పరం గృహ్యం సంక్షేపాద్వదమే ప్రభో ।

"మానవులను అనుగ్రహించుటకును జ్ఞానులకు మోక్షము దొరుకుటకును శివజ్ఞానమును అనుగ్రహించవలసినది" అని ప్రార్థించుట చేత పరమ శివుడు వానికి ఈ రీతిగ చెప్పినాడు.

తత్త్వంతు త్రివిధం జ్ఞేయం తస్య భేదం శ్రుణుష్వహ ।
శివ స్సదాశివ శ్చైవ మహేశశ్చ త్రిధాస్మృతః ।

తత్వము మూడు విధములు. 1 శివ తత్వము 2 సదాశివ తత్వము 3 మహేశ తత్వము అని శివ తత్వము నిష్కళముగానూ [రూప రహితము] సదాశివ తత్వము సకల నిష్కళముగానూ [వ్యక్తా వ్యక్తము] మహేశ తత్వము సకళముగానూ [అకార యుతము] గను వుంటున్నది. ఇవి ఒకటి నుంచి ఒకటి ఉత్పన్నమై యున్నవి. శివ తత్వము నుంచి సదాశివ తత్వము, దాని నుంచి మహేశ తత్వము ఉద్భవించి యున్నవి. సంక్షేప ముగా దీని యొక్క స్వరూపములను పరిశీలించుదము.

"శివం పరాత్పరం సూక్ష్మం నిత్యం సర్వగం అవ్యయం ।
అనిందితం అనౌ పమ్యం అప్రమేయం అనామయం"

శుద్ధమై యున్నది కనుక శివ మనియు, పరస్థానమునకు పైనున్నది కనుక పరా త్పర మనియు, ఆకాశమునకన్న పెద్ద శరీరము ఉన్నది గనుక సూక్ష్మ మనియు, అన్ని టికి కారణమై యున్నది గనుక నిత్య మనియు, అన్ని స్థలము లందు వ్యాపించి యున్నది గనుక సర్వగత మనియు, నాశ రహితమై యున్నది గనుక అవ్యయ మనియు, నిర్మలమై నందున అనిందిత మనియు. సాదృశ్య రహితమై నందున అనౌపమ్య మనియు, కొలతకు సాధ్యములే నందున అప్రమేయ మనియు, నిర్ఘృణమై నందున అనామయ మనియు ఈ శివ తత్వము పిలువబడు చున్నది.

శివుడు సర్వతత్వములను సృష్టించు నిమిత్తమై లోకోత్పత్తి చేయు కొరకును ఆలోచించుటచేత వాని నుంచి పరాశక్తి, ఆదిశక్తి, ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి మరియు క్రియాశక్తులు ఉత్పన్నమైనవి. దీనికి శివసృష్టి అని పేరు. ఈ ఒక్కొక్క శక్తి జతలో శివ తత్వము కలిసి ఉత్పన్నమగు తత్వమే సదాశివ తత్వము దీనిలో ఐదు విధములు ఉన్నవి. దీనికి పంచ సాదములు అని పేరు. సదస్య ఇదం సాదం అని రూప నిష్పత్తి సాధ అనగా సదాశివుని యొక్క అని అర్థము అగుచున్నది. శివ తత్వము పరాశక్తితో కలసి నపుడు శివ సాదమనియు, ఆది శక్తితో కలసి నపుడు అమూర్త సాదమనియు, ఇచ్ఛాశక్తితో కలసి నపుడు మూర్త సాదమనియు, జ్ఞానశక్తితో కలసి నపుడు కర్త సాదమనియు చివరికి క్రియాశక్తితో కలసినపుడు కర్మ సాధమనియు ఐదు భావ ములు ఉన్నవి. ఇద్దే రెండవ సదాశివ తత్వము.

ఈ సదాశివ తత్వమైన ఐదు సాధములలో ఈశ్వరుని స్వరూపము సకళ నిష్కళమై యుంటున్నది. అనగా ధ్యాన గోచరమై యుంటున్నది. జ్యోతి స్తంభ రూపమైనదియు. లింగ రూపమైయున్నదియు అనగా ధ్యానించుటకు ఒక రూపము కలిగినదై యుంటున్నది. ఈ ఐదు సాదములు ఒకటి నుంచి ఇంకొకటి ఉత్పన్నమయి ఆఖరులో నున్న కర్మ సాదములో పైన చెప్పిన అన్ని సాదములు ఉంటున్నవి. మొదట చెప్పిన నాలుగు సాదములూ స్వయం వ్యక్తములు మరియు స్వప్రకాశములు. ఐదవ కర్మ సాదములో ఆ నామమే తెలియ వరుచు రీతిగా కర్మము [క్రియము] చేరి యున్నది గనుకను, దీనికో నాద బిందువులు ఉత్పన్న మగుట చేతను, ముందు మహేశ తత్వము యొక్క సృష్టికి ఇదే కారణము ఈ మహేశ తత్వము సకళము అనగా రూప, ఆకారముచేత కూడి యుంటున్నది పైన చెప్పిన నాదము లింగమనియు బిందువు పీఠమనియు పిలువబడు చున్నది లింగమునకు శివము అనియు. పీఠమునకు శక్తి అనియు పేరు. ఈ కర్మ సాదములో శివ శక్తులు జగత్ సృష్టికి కారణమయి యుంటున్నవి. ఈ రీతిగా—

బిందు మధ్యగతో నాదః నాదమధ్యేతు మూర్తయః ।
మూర్తి మధ్యగతం తత్వం తత్వ మధ్యగతం శివః ।
ఏతచ్ఛివ మయం లింగం సర్వ తత్వాలయం విదుః ।
లింగేతు జాయతే సర్వం జగత్స్థావర జంగమః ।
తస్మాల్లింగం విశేషేణ కర్మరూప ముదాహృతం ।

బిందు [పీఠము] మధ్యములో నాద [లింగము] మూ, నాద మధ్యములో మూర్తులు, మూర్తి మధ్యములో తత్వమూ, తత్వ మధ్యములో శివుడు ఉన్నందున ఈ లింగము శివమయమై అన్ని తత్వములకు ఆశ్రయమైయు, సకల చరాచర ప్రపంచమునకు జనకమైయు ఉంటున్నది. దీని చేత లింగము కర్మ రూపమై యుంటున్నది.

పంచమూర్తి మయం దేవం పంచ తత్వాత్మకం భవేత్ ।
మూర్తినాం దేహ భేదైస్తు గుణైః పంచాననం విదుః ।

లింగ మధ్యములో చెప్పబడిన మూర్తులు ఐదు తత్వములతో కూడియున్నవనియు, ఐదు విధదేహములతో చేరి ఆ భేద గుణములకు అను గుణమయి సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన అను పంచానన యుక్తమై యుంటున్నవి.

ఇంక మూడవ మహేశ తత్వము చెప్పబడుచున్నది.

కర్మే శస్య సహస్రాంశా న్మహే శస్య సముద్భవః ।
మహేశం సకళం విద్యాత్ సృష్టి స్థితి లయాత్మకం ।
పంచ వింశతి భేదైస్తు తద్ మూర్తి ర్ద్వివిధా భవేత్ ।

కర్మ సాదముచే పుట్టిన సకళమనే మహేశ తత్వము ఇరువదిఐదు భేధములచే గూడి యుంటున్నది. ఇవి మూర్తి రూపములు. ఈ మూర్తులకు రూపము, అకారము, అలంకారము మొదలైనవి యుంటున్నవి సోమధారి మొదలైన యీ ఇరువదిఐదు మూర్తులు చెప్పబడి యున్నవి.

ఈ మహేశ తత్వ సహస్రాంశముచే రుద్రుడు, రుద్రుని కోటి అంశముచే విష్ణువు. విష్ణు దేవుని కోటి అంశముచే బ్రహ్మ. సూర్య చంద్రాది సమస్త ప్రపంచములు ఉత్పన్న మయినవి

వెనుక చెప్పబడిన బిందు రూపమయిన శక్తిచే ఉమా, అంబిక, గణేశ, మనోన్మనీ, గౌరి, లక్ష్మి, సరస్వతీ, దుర్గా, మొదలయిన శక్తులు ఉత్పన్న ములయినవి.

* యీ రీతిలో శివ తత్వము ౧ సదాశివ తత్యము ౫ మహేశ తత్యము ౨౫

మొత్తము ౩౧ తత్వములు మూల తత్వములు అని చెప్పబడినవి.

మహేశ తత్వముచే ఉత్పన్నమైన రుద్ర, విష్ణు, బ్రహ్మాది రూపములు, గౌరి, లక్ష్మి, సరస్వత్యాది శక్తులు లోకములో పూజింప బడుచున్నవి.

శిల్ప గ్రంధములలో [కాశ్యప శిల్పము - శిల్ప రత్నము] సృష్టి క్రమమును ఇదే క్రమములో వర్ణించి యున్నారు. కాని అచ్చటచ్చట కొద్ది కొద్ది వ్యత్యాసములు కనబడు చున్నవి. ఆ వ్యత్యాసములు అంత గమనార్హ ములు కావు.

---

* శివ తత్వ విచారమై ఇదే గ్రంధ కర్త చేత వ్రాయబడియున్న అగమ ప్రకాశమనే గ్రంథమందు వివరముగా చూడవచ్చును.

# 2 లింగము యొక్క ఆవిర్భావము

అజితాగమము నందున్న అపరాజిత పృచ్ఛా అను గ్రంధము నందును శివుడు లింగాకారముగ బ్రహ్మ విష్ణువులకు గోచరమైనపుడు వారిరువురు శివుని యొక్క రూపము ను కొలత చేయుటకు అసమర్ధులైనారని వివరముగా వర్ణింపబడినది.

పూర్వము ప్రళయ కాలములో మహేశ్వరుని యొక్క మహత్వమును తెలియుటకు బ్రహ్మ విష్ణువులు తమ తమ శక్తి విషయమై దర్ప మోహములచే పరస్పర అసూయా పరులై ప్రవర్తించిరి. అపుడు

"తతస్తు యువయో ర్మోహం ఈ దృగ్భూతం సురేశయోః ।
సంవీక్ష్య సర్వ దేవాదిః శబ్ద బ్రహ్మ తనుశ్శివః । 6
బోధార్ధం యువయో శ్చాపి జ్వలన స్తంభ రూపధృత్ ।
యోతిష్ఠత్పరమే శానో మధ్యేత్వాశ్చర్య సంయుతః । 7

వారిద్దరు యీ రీతిగా మోహ [అజ్ఞాన] మున ఉండుట చూచి శబ్ద బ్రహ్మ శరీరి అయిన శివుడు వారికి తెలివి కలుగుటకు వారిరువురి మధ్యే ఆశ్చర్య కరమైన ఒక అగ్ని స్తంభ రూపములో అవతరించెను.

యువాం తేన పరంగత్వా విస్మయం సురపుంగవౌ ।
కిమిదం త్వితి సంచింత్య తత్పరీక్షా సముద్యతౌ । 8
గతా వూర్ధ్వ మధస్తాత్తు లింగ రూపస్య తన్మహ ।
హంసక్రోధ శరీరేణ తత్పర్యంత దిదృక్షయా । 9
సర్వలోకేశ్వరా దేవా నివృత్తావ కృతార్ధకౌ ।
నత్వాస్తుత్వాధ దేవేశం యువాం తత్పార్శ్వకౌ స్థితౌ । 10

ఈ రీతిలో నిలిచిన ఆ అగ్ని స్తంభమును చూచిన బ్రహ్మ విష్ణువులు విస్మితులై దానిని పరీక్షించుటకు ప్రయత్నించిరి. బ్రహ్మ హంసరూపమై ఊర్ధ్వాభి ముఖముగాను విష్ణువు వరాహ రూపముతో అధో ముఖముగాను పయినించిరి. ఎంత దూరము పోయి

నను అంత్యములను చూడలేక అకృతార్థులై వెను దిరిగి వచ్చి పరమ శివుని నమస్క రించి స్తోత్రము చేసి ఆ అగ్ని స్తంభము ప్రక్కన నిలిచినారు.

యువాం నవేత్తదేవేశం సర్వ కారణ మవ్యయం । 12
సదాశివం మహాదేవ మీశానం సురనాయకం ।
అహం రుద్రోయువాం చైవ సర్వే తస్య ప్రసాదతః ।
తస్య లింగ మిదం తావదహం రుద్రశ్చ సర్వదా ।
యువాం చేద్రశ ముత్పాద్య నానాద్ర వ్యైర్యథేచ్ఛయా ।
పూజ యామ్యోథ దేవేశం పూజితో లింగమూర్ధని ।
జ్ఞానం దాస్యతి సర్వజ్ఞం సదా మోహాప శాంతయే । 15
అస్మత్ పూజా విధిం దృష్ట్వా చతుర్దశ విధం జగత్ ।
పూజయిష్యతి లింగం తత్పూజా శ్రీయోది దాస్యతి ।

పరమేశ్వరుడు చెప్పినాడు :- మీకు సర్వమునకు కారణ భూతుడు, నాశరహితుడు, సర్వేశ్వరుడు సురనాయకుడు, మహాదేవుడు అయి ఉన్న సదాశివునిని తెలియుట సాధ్యము కాదు. నేను [రుద్ర] మరియు నీవు మరియు ఈ సమస్తమూ ఆ సదాశివుని యొక్క అనుగ్రహముచే ఉత్పన్నమై యున్నాము. వాని యొక్క స్వరూపమే ఈ అగ్ని స్తంభాకారమయిన లింగము. నేను మరియు మీరు నానా ద్రవ్యములచే ఈ లింగాకృతిని నిర్మించి పూజించవలెను.

యీ రీతిగా పూజించుటచేత సర్వజ్ఞుడైన పరమ శివుడు అజ్ఞాన నాశనము చేసి జ్ఞానమును ప్రసాదించును మనము యీ రీతిగా పూజించుట చూచి చతుర్దశ లోకములు లింగమును పూజించి శ్రేయస్సును బడయుదురు.

లయం గచ్ఛంతి భూతాని సంహారే నిఖిలానిచ । ౧౬
నిర్గచ్ఛంతి యతశ్చాపి లింగోక్తి స్తేన హేతునా ।
తస్మిన్ సమర్చితే లింగే సర్వేదేవా స్సమర్చితాః ౧౮

ప్రళయ కాలములో సర్వ భూతములు దీనిలో లయమును పొంది పునః సృష్టింపబడుచున్నవి. గనుక దీనికి లింగమని పేరు వచ్చినది. దీనిని పూజించిన యెడల సమస్త దేవతలను పూజించి నట్లగును.

# 3 లింగశబ్దార్థము

పూజాంశే వ్యోమ రూపం ఋగను సృతం యజుర్ గోముఖం వాయు రూపం ।
మధ్యే సామాగ్ని [వగ్ని] రూపం పుసరమృత మయం పీఠ మూలం త్వధర్వా ।
ఆధారం భూమి రూపం సురగణమునిభి స్సేవితం కామ్య రూపం ।
బ్రహ్మో విష్ణుంచ రుద్రస్త్రితయ యుత మిదం లింగ రూపం నమామి ।

.... .... .... .... చిహ్నం లక్ష్మంచ లక్షణం ।
"పాళిః కేతుర్ ధ్వజో లింగం" [అమర కోశము]

లింగ మనగా చిహ్నమని అర్థము ఉదాహరణ :— "నవర్ణలింగీ"
[భారవి. కిరాతార్జునీయ] 4-1] బ్రహ్మచారియొక్క చిహ్నం కలిగిన అని అర్థము.

నానార్థ వర్గములో.... .... "లింగం చిహ్న శోఫసోః ।"

అనగా లింగ శబ్దము గురుతు [చిహ్నము] మరియు పురుషజన నాంగమునకు పేరు అని చెపబడియున్నది. లింగ శబ్దము "లిగిగతౌ" అనే ధాతువు నుంచి పుట్టి యున్నది. "సర్వేగత్యర్థాః జ్ఞానార్థాః" అనే నియమముచే "లింగ్యతే-జ్ఞాయతే-అనేనేపి లింగం" అనగా దీని నుంచి వస్తువు తెలియబడును. గనుక దీనికి చిహ్నమునకు లింగ మని పేరు.

పదార్థములను గుర్తించుటకు కొన్ని లక్షణములు ఉన్నవి గదా ! ఏ లక్షణము చేత పదార్థము యొక్క జ్ఞానమగునో అ లక్షణమును లింగమని పిలువ బడును.

నానార్థము కలిగిన ఒక శబ్దమును ప్రయోగము చేసినపుడు ప్రసంగమునకు తగిన అర్థమును గ్రహింపవలసినదేగాని విపరీతార్థమును చెప్పుట యుక్తము గాదు.

ఇపుడు శివలింగముయొక్క ప్రస్తావన చేయుచున్నాము ఈ మొదట తెలియపరచిన రీతిగా శివుని అచింత్యము, అద్భుతము, అప్రమేయము కలగిన రూపమును తెలియుట

బ్రహ్మ విష్ణువులు ప్రయత్నించి నపుడు శివుడు తనయొక్క స్వరూపమును జ్యోతి స్తంభ రూపమై చూపించినాడనియు "నా యొక్క ఈ రూపమునే నీవు పూజించిన యెడల మిమ్ములను చూచి పదునాల్గు లోకములు ఈ నా యొక్క రూపమునే పూజించనిండు" అని శివుడు ఆజ్ఞ చేసినాడనియు వెనుక తెలియపరచి యున్నది. ఈ రీతిగా ఊర్ధ్వ ముఖ ముగా జ్వలించుచున్న జ్యోతి యొక్క ఆకారము శివుని లింగం "అనగా చిహ్నము" అని అర్థమైనది

కొన్ని స్థలములందు "యోని లింగ ప్రకారేణ జగత్ సృష్టిర్ద కారణం" అను వాక్యము ఉన్నది యోని అనగా పీఠమని అదే సందర్భములో చెప్పబడినది "లింగం శివమతి జ్ఞేయం పీఠం యోని రుదాహృతః" అని లింగము శివుడనియు పీఠము యోని అనియు దీని యొక్క అర్థము ఈ స్తంభ మయమైన లింగము దృఢముగా నిల్చుటకు పీఠము ఆధారమై యున్నది యా రీతిలో యోని శబ్దమునకు ఆధార మనియు కారణ మనియు అర్థము యా రీతిగా శివునకు లింగమనియు, పీఠమునకు యోని అనియు చెప్ప బడుటకు కారణము యా శబ్దమునకున్న హేయమైన జననాంగముల అర్థమును కల్పిం చుట యుక్తము గాదు.

ఉదాహరణకు "వాసుదేవం జగద్యోనిం నౌమి" అని ఒక స్తోత్రములో నున్నది. ఇచ్చట వాసుదేవుడు జగద్యోని అని చెప్పబడి యున్నది. అనగా వాడు జగత్తుకు స్త్రీ జననాంగ ప్రాయుడు అను అర్థమును కల్పించుట యుక్తమా ? నిజమైన అర్థము వాడు జగత్తుకు కారణ భూతుడు. ఆధార భూతుడు అని గదా అర్థము చేయవలెను ?

ఇదిగాక పూర్వము శివసృష్టి అను ప్రకరణములో చెప్పబడిన రీతిగా శివునిచే రుద్రుడు, వాని నుంచి విష్ణువు, వాని నుంచి, బ్రహ్మ ఉత్పన్నమైరి అను విషయమును తెలిసికొనినాము. ఈ ప్రకరణములో ఆలయములో ప్రతిష్ఠించుటకు లింగ నిర్మాణ క్రమమును వివరించినపుడు లింగములో మూడు భాగములు ఉంచి వాటికి బ్రహ్మ విష్ణు రుద్ర భాగములని పేరు పెట్టడము. చెప్పబడును. శివుని అంశములయిన రుద్ర విష్ణు బ్రహ్మాదులకు శివుడు సంహార, స్థితి సృష్టి కార్యములను వహించినాడని చెప్పినాము. ఈ రీతిగా ఒక లింగములో ఈ మూడు దేవతల భాగములను కల్పించుట సమస్త ప్రపంచ మును ఒక స్థానమందు చూచినట్లగును. ఈ మూడు దేవతల ప్రత్యేక మూర్తులను మనము చూచినపుడు వాటిలో ఆయా దేవత యొక్క ఒకే రూపము మాత్రమే గోచర మగును. ఈ శివలింగములో పైన చెప్పబడిన మూడు దేవతాంశములను పెట్టి సృష్టి

స్థితి సంహార ఈ మూడు కార్యముల ప్రతీకమనే జ్ఞానము వచ్చినట్లు నిర్మింపబడుట ఎంత అద్భుత జ్ఞానముగా ఉన్నది. !

స్త్రీ పురుష జననాంగమునకు చెప్పబడు లింగ శబ్దార్థము యొక్క కల్పన అభిప్రాయము ప్రాయః పాశుపత, కాపాలిక, కౌల, మొదలయిన వామా చారులు యొక్క ప్రక్రియ కారణములచే వచ్చి యుండవచ్చును.

శవము యొక్క పూజ, రుండమాల. రక్త తర్పణము, కపాల పాత్రభోజనము. నగ్నత, నరబలి, ఇత్యాదులకు ప్రాశస్త్యము, శివశక్తి యైన దుర్గాదేవికి, భయంకర రూప కల్పనము చేయుట వామా చారుల యొక్క ప్రభావములు ఈ విధమైన అర్ధములకు కారణ ముండవచ్చును

ఆగమ శాస్త్ర గ్రంధములలో ఈ కపాలాది మార్గము లన్ని త్యజించి శుద్ధశైవ దీక్షయును విధించి. దాని మూలంకంగా సాత్వికమైన పూజా ఉత్సవ ప్రతిష్టాదులు చెప్పబడినవి.

ఇంత వివరించిన తరువాత సహృదయులైన పాఠక మహాశయులను ప్రార్థించుట మేమనగా పరాత్పర వస్తువైన శివుని జ్యోతిర్మయ రూపము లింగమనియు దానికి ఆధారమైన శక్తి రూపము పీఠ మనియు గ్రహించవలసినది. శబ్దముచే కనబడు హీనమైన అర్ధమును సర్వదా మనస్సు నుంచి తొలగించి శ్రేయస్సును ప్రార్థించవలసినది అని విజ్ఞాపించుచున్నాను.

జ్యోతిషే తంత్ర శాస్త్రేచ వివాదే వైద్య శిల్పకే ।
అర్ద మాత్రంతు గృహ్ణీయా నాత్ర శబ్దం విచారయేత్

భృగుసంహిత – 6

జ్యోతిష శాస్త్రము, తంత్ర శాస్త్రము, [ఆగమ శాస్త్రము] అర్ధశాస్త్రము, వైద్య శాస్త్రము, శిల్పశాస్త్రము దీనిలో చెప్పబడు విషయములున్ను పరిశీలించునపుడు శాస్త్రపంక్తి యొక్క అభిప్రాయమును గ్రహించవలసినదేగాని వ్యాకరణ ప్రకారము శబ్దము వున్నదని వాదించ గూడదు.

# 4 లింగ వైవిధ్యము

త్రివిధం లింగ మాఖ్యాతం సకళం నిష్కళం కళం। ౨
సుప్రభేదాగమము 33

శైవాగమ రీత్యా ఆలయములో పూజింపబడు దేవుడు శివుడు. ఆతని లింగ రూప ముతో ప్రతిష్ఠించి పూజించు చున్నారు శివునకు లింగ రూపము వచ్చిన ప్రకారములన్ని యును, ఆ రూపమే పూజించ వలసిన ఏనియు పూర్వమే వివరించి యున్నది ఆ లింగ ములలోన భేదములను ఇపుడు ప్రస్తావించబడును

సుప్రభేద ఆగమపై శ్లోకము రీతిగాను ఇంక అనేక గ్రంథములలో వివరించబడినట్లు లింగములను నిష్కళ లింగము, సకళ లింగము సకళ నిష్కళ లింగము లనియు మూడు విధములుగా విభజించి యున్నారు. వెనుక శివ సృష్టిని వివరించి నపుడు శివుడు నిష్కళుడ నియు, సదాశివ తత్వము సకళ నిష్కళ మనియు,మహేశ తత్వము సకళ మనియు వివరించి నాము. లింగము మరియు మూర్తులు ఆఖరిలో నున్న సకళమైన మహేశ తత్వములో చేరును. ఈ లింగములలో పునః సకళ నిష్కళాది భేదములను చెప్పబడినది గనుక తత్వము యొక్క సకళాదులకు ఈ లింగము యొక్క సకలాది భేదములకు ఏ సంబంధ ముండదు ఇచట కళ మనగా రూపము ఆకారము. నిష్కళమనగా అవయువాదులులేని శుద్ధ జ్యోతి స్తంభ రూపమైన లింగము అవయువములతో కూడిన లింగము అనగా మూర్తులు వాటికి సకళము లని పేరు. రూపముండయు పూర్ణమైన శరీరములేక లింగము ఉండి, దానితో పంచేంద్రియములకు స్థానమైన ముఖమును మాత్రము నిర్మించి పూజించు ముఖ లింగము సకళ నిష్కళము. శైవాగమములో శివుని అన్ని మూర్తులకు లింగమనే పేరు వెనుక ప్రకరణములో చర్చించిన లింగ శబ్దమునకు "చిహ్నము" అనే అర్థమునే ఉపయోగించి అన్నిట్లను లింగ శబ్దమునే వ్యవహరించుచున్నారు.

సకళ, నిష్కళ, ఉభయాత్మక, లింగములకు అజితాగమ గ్రంథములో వ్యక్త, అవ్యక్త, ఉభయాత్మకమను పేర్లు ఇవ్వబడినవి.

లింగంతు త్రివిధం ప్రోక్తం వ్యక్తావ్యక్తో భయాత్మకం ।
వ్యక్తం యత్ప్రతిమా వ్యక్తం శివలింగమితి స్మృతం । ౨
ముఖలింగం భవేదన్య త్తృతీయ ముభయాత్మకం ।
సదాశివం తదుద్దిష్టం అవ్యక్తం లింగ ముత్తమం ।
ఐశ్వరం ముఖలింగం స్యాత్ రౌద్రం వ్యక్తమితి స్మృతం ।
ఎదీయమితి తద్విద్ధి వ్యక్త లింగం జనార్దన । ౪

ముఖ లింగము ఈశ్వర లింగమనియు, వ్యక్త లింగము [మూర్తి] రుద్ర లింగము అనియు, అవ్యక్తము శివ లింగమనియు పిలువబడుచున్నది.

నిష్కళంతు కళాహీనం సకళంతు కళాస్వితం ।
సకళం నిష్కళోపేతం తస్మాత్సకళ నిష్కళం । ౨
మునిదేవ మనుష్యైశ్చ పూజితం లింగమాదరాత్ ।
నిష్కళం లింగ మిత్యాహుః సకళంతు కళాన్వితం ।
ద్విధాభావ గతో యోన్యోబిందు నాదోద్భవం .... ।
సకళం నిష్కళేలింగే పూజయేత్తు సదాశివం ।

సుప్రభేదము 33

ఇచట నిష్కళ మరియు సకళ నిష్కళముల వర్ణనమున్నది. నిష్కళ మనగా రూపము లేనిది. కేవల లింగాకారము సకళ మనగా రూపయుక్తమైన మూర్తులు. యీ రెండు చేరినది సకళ నిష్కళము మునులు, దేవతలు మనుష్యుల చేత పూజింపబడు చున్నది నిష్కళ రూపమైన లింగము, భావ్య రూపమైన సకళము యీ రెండు భాగముల చేత బిందు [పీఠము] నాద [లింగము] రూపమైనది అనగా ముఖ లింగము సకళ నిష్కళము అని అర్థము

ఇపుడు ఆలయములోని లింగములకో రెండు విధములను చూడవచ్చును. పీఠములో అధిష్ఠితములైయుండి అవయ వాదులు లేని లింగములు ఒక విధము. అదే లింగముల పూజా భాగమందు ముఖములను నిర్మించబడిన లింగములు మరొక విధము ఈ రెండవ విధమైన లింగములు అపురూపముగా దొరుకు చున్నవి. మొదటి విధమైన నిష్కళ లింగములలో నానా విధమైన మూర్తులను వానియొక్క ప్రమాణములు, శిరోవర్తనము, బ్రహ్మ సూత్రము, ఆకారము, వైవిధ్యముల ననుసరించి అనేక పేరులతో

పిలచి పూజించుచున్నాము. ఈ రీతిగా లింగములను నిర్మించ నపుడు శక్తి [పీఠము] సహితమైయే నిర్మించుచున్నాము. లింగము శివ మనియు, పీఠము శక్తి అనియు వ్యవహరించబడి యున్నది.

సకళ లింగములలో [మూర్తులు] చిత్రము, చిత్రార్ధము, మరియు చిత్రా భాసము అని మూడు విధములు చెప్పబడి యున్నవి. చిత్రమనగా పటకుడ్యాదులపైన వర్ణచిత్రము వ్రాయుటము. దీని వివరణలు ఇచ్చట ప్రసక్తిలేని కారణమువేత వ్రాయబడుటలేదు. మనము వ్రాసియున్న "అగమోక్త మూర్తులు" అనే గ్రంధమందు వివరము కానవచ్చును.

పైన వివరించియున్న సకళాది భేదముల లింగములలో చల, అచలమను భేదము లున్నవి.

పీఠికోపరి సంస్థాప్య పూజితం చలమేవహి ।
నిధికుంభ ప్రతిష్ఠాది సర్వముక్తాను సారతః ।
కృత్వాప్రతిష్ఠితం బింబ మచలం పరికీర్తితం ।
ధాతు వర్ణాదిభి ర్లేఖ్య పటాదౌ తచ్చలాచలం ।

శిల్ప రత్నము 2 [6]

పీఠముపైన ఇష్టము వచ్చినపుడు పెట్టి పూజించు లింగము చల మనియు, నిధికుంభ ప్రతిష్ఠాది శాస్త్రోక్త విధములచే ప్రతిష్ఠింపబడి ఆలయములలో పూజించుటను అచలమనియు, పటకుడ్యాదులలో వ్రాయు చిత్రములు చలాచలమునియు పిలువబడుచున్నవి.

ముందు మనము వివరించు అనేక ద్రవ్యములచేత నిర్మింపబడు లింగములకు కొన్ని కనిష్ఠ గరిష్ఠ మానములున్నవి. ఆ మానములలో పరిమిత మానమునకు లోబడినవి చల లింగములు. ఆ మానమునకు పైబడినవి అచల లింగములు. వాటిని ఆయా ప్రకరణములో వివరించబడును.

స్థావరం 'జంగమం చైవ ద్వివిధం లింగముచ్యతే ।
శిలామయంతు యద్రూపం బ్రహ్మ విష్ణు హరైర్యుతం ।
త్రిసూత్ర ముకుళ సంయుక్తం స్థావరం లింగముచ్యతే ।
సౌవర్ణై రాజతై ర్వాపి స్ఫాటి .... .... .... .... .... ।
కుర్వంతి మణిరత్నాద్యైః జంగమం లింగముచ్యతే ।
జ గమా స్థావరం శ్రేష్ఠంతస్మా .... .... .... .... .... ।
ద్వివిధం తత్సమాఖ్యాతం చలంచైవాచలం తథా ।
స్థిరం ప్రాసాద లింగంతు చలం సర్వత్ర పూజ్యతే

పూర్వ కారణము 9 [177]

బ్రహ్మ విష్ణు రుద్రాంశములచేతను, బ్రహ్మ సూత్రము పద్మము ముకుళాది లక్షణముచేత [లక్షణోద్ధారము] కూడి శిలామయమైన శివుని రూపము స్థావరము. సువర్ణము రజితము మొదలైన ద్రవ్యములచేత నిర్మించబడినవి జంగమ లింగములు జంగమ లింగములకంటె స్థావర లింగములు శ్రేష్ఠము. అచల లింగము ఆలయములోను, చల లింగములు ఇష్టము వచ్చిన స్థలములలోను పూజింపబడుచున్నవి.



# 5 లింగ ద్రవ్యములు

లింగములను ఏఏ ద్రవ్యములతో నిర్మించవచ్చును ? వాని యొక్క మానము లేమి ? ఇత్యాదులు ప్రస్తావించ బడుచున్నవి.

శైలజం రత్నజం చైవ లోహజం దారుజం తథా ।
మృణ్మయం క్షణికం చైవ షడ్విధం లింగము చ్యతే ।
సుప్రభేదము 33 [21]

క్షణికం చైవ మృల్లోహం రత్నజందారుజం తథా ।
శైలజం చైవ విఘ్నేశ షడంగం లింగ ముచ్యతే ।
సుప్రభేదము 33

రత్నం శిలాధాతు మహీరుహాశ్చ
శస్తాహ్యమీ మృత్తికయాపి పంచ ॥ లింగార్థం
అజితాగమము 4 [11]

శిలయు, రత్నము. లోహము, దారువు, మృత్ వీటిచే లింగము నిర్మింపబడు చున్నది.

ఇష్టేన లింగం కుర్వంతి ద్రవ్యేష్వే తేషు పంచసు ।
చలంచాచల నంజ్ఞంచ చలంశైవాంశమే వహి ।
తాలాదంగుల పర్యంతం త్తల్లింగం చలము త్తమం ।
అచలంయి త్తల్లింగం ప్రాసాద స్థాపనే హితం ।
అజితాగమము 4 [21, 22]

పైన చెప్పిన అయిదు ద్రవ్యములలో ఇష్టం వచ్చిన ద్రవ్యముచే చలము, అచలము ఈ రెండు విధములైన లింగములను నిర్మించవచ్చును. చలలింగము కూడ శివాంశసంభూతమే. ఒక అంగళము నుండి ఒక తాళము వరకు [తాళమనగా 12 అంగుళములు] [ఇంగ్లీషు లెక్క ప్రకారము 9 అంగుళములు] 1 తాళము వరకు చల లింగములని చెప్పబడుచున్నది దానికిపైన కొలత ఉన్న అచల లింగములైన ప్రాసాదములో స్థాపించుట యోగ్యమని చెప్పబడినది.

ఈ ఆగమ రీత్యా అయిదు ద్రవ్యములచేత చల అచల లింగములను నిర్మించ వచ్చును. ఎత్తు యొక్క వ్యత్యాసముచే చలాచల భేదములగును అని చెప్పబడినది కాని సుప్రభేదాగమములో [33-24]

రత్నజం లోహజంచైవ బాణ లింగం చలం స్మృతం ।
శైలం చలాచలం ప్రోక్తం మృణ్మయం దారవం తథా ।

అనగా రత్నము లోహముంచేత చేయబడినది చల లింగములనియు, శిలా, మృత్, దారువులచే నిర్మితమైన చలమును అచలమును అగును అని చెప్పియున్నారు. అనగా రత్నను మరియు లోహములలో అచల లింగ నిర్మాణము బహుద్రవ్య సాధ్య మైనవని అభిప్రాయముచే వాటిలో చల లింగములను మాత్రమే చేయవచ్చునన వ్రాసి యుండుట కనిపించును.

తదపి ద్వివిధం ప్రోక్తం ఆత్మార్థంచ పరార్థకం ।
క్షణికే చలలింగేచ స్థండిలే మండలేపిచ ।
కౌతుకే భక్తి చిత్రేహ ఆత్మార్థార్చన మారభేత్ ।
గ్రామే దృష్ట్వాధవా న్యేషు శివధామని అర్చితే ।
తేషు స్థావర లింగేషు పరార్థం యజనం స్మృతం ।

సుప్రభేదం 8 [2, 4]

పూజయనునది ఆత్మార్థమనియు, పదార్థమనియు రెండు విధములు. వెనుక చెప్ప బడిన క్షణిక లింగములు ఇతర ద్రవ్యములలో చెప్పబడిన [మాన పరిమితిలో ఉన్న] చలా లింగములు స్థండిలము. మండలము, చిత్రములు వీటిలో ఆత్మార్థయజనమును చేయవలసినది. గ్రామాదులో నిర్మితమైన ఆలయమందు స్థావర లింగమును ప్రతిష్ఠించి పూజించుట పరార్థయజనమని చెప్పబడును. ఇకపైన చెప్పిన షడ్విధ లింగముల అవాం తర బేదములు చెప్పబడుచున్నవి.

క్షణికా ద్వాదశధా ప్రోక్తః మృణ్మయీ ద్వివిధం పునః ।
దారుజం చాష్టధా ప్రోక్తం అష్టధా లోహజం స్మృతం ।
సప్తధా రత్నజం చైవ శైలజంతు చతుర్విధం ।

సుప్రభేదము 4 [21, 22] అజితాగమము 4 [9,19]

క్షణిక లింగము 12 విధములు, మణ్మయము 2 విధములు, దారువు 8 విధములు లోహజము 8 విధములు, రత్నజము 7 విధములు, శైలజం 4 విధములు, ఈ రీతిగా సామాన్యమైన భేదములు కొన్ని కొన్ని ఆగమ సంహితా గ్రంధముల రీత్యా ఈ భేదములలో వ్యత్యాసములున్నవి. ప్రసంగము వచ్చినపుడు ఆయా భేదములను వివరించుచున్నాను.

# 6 క్షణిక లింగములు

ఇవి ఇష్టదేశ కాలములో ముందు చెప్పబడిన ద్రవ్యములచే నిర్మితమై పూజానంతరము విసర్జింపబడు లింగములు. ఈ ద్రవ్య భేదములకు ప్రత్యేకమయిన ఫలములు చెప్పబడి యున్నవి.

| క్షణిక లింగము నిర్మించు ద్రవ్యములు అజితాగమము 4 [60-62] సుప్రభేదము 8 [5-6] | ఫలము అజితము 4 [62-63] | ఫలము సుప్రభేదము 33 [25-28] |
|---|---|---|
| 1 సికతము (ఇసుక) | ప్రాధాన్యత | మోక్షప్రదము |
| 2 తండులము (బియ్యం) | — | వైభవము |
| 3 అన్నము | ఆయుర్ వృద్ధికరము | అన్నప్రదము |
| 4 నదీ మృత్తికా | — | భూమి లాభము |
| 5 గోమయము | రోగనాశనము | రోగనాశనము |
| 6 చందనము | — | సౌభాగ్యము |
| 7 కూర్చము (దర్భము) | — | ముక్తి సాధకము |
| 8 పుష్పము | — | అయుర్వృద్ధికరము |
| 9 గుడము (బెల్లము) | ప్రీతిప్రదము | ఇష్టార్దసిద్ధి ప్రదము |
| 10 పిష్టము (బియ్యపు పిండి) | పుష్టిప్రదము | పుష్టి ప్రదము |
| 11 నవనీతము | సుఖప్రదము | మనస్సుకు అహ్లాదకరం |
| 12 రుద్రాక్షము | — | జ్ఞానవృద్ధి |
| 13 ఫలము | అభీష్ట సిద్ధికరము | — |
| 14 పల్లవము | సద్గుణ ప్రదము | — |

యేతేషాం చైవ లింగానాం న ప్రమాణం నచస్థితిః ।
పూజాంతే క్షణికా త్యాజ్యా స్త్యజే దన్యానిచల్లయే ।
సుప్రభేదము 33 (58)

క్షణికానాంతు లింగానా పీఠం నైవా స్తి లక్షణం
పూజావ సానే చోద్ధారః యేతేషాంపరికీ ర్తితః ।
అజితాగమము 4 (62)

ఈ క్షణిక లింగములకు మాన, రూపముల నియమములు లేవు పీఠ నిర్మాణము యొక్క ఆవశ్యకత ఉండదు పూజా పీఠికపై ఆయా ద్రవ్యములలో లింగాకారమును చేసి వాటియొక్క పూజానంతరము విసర్జింపబడును. ఇతర లింగములు వాటిలో భిన్నమో, నాశమో అయినపుడు త్యజించవలసినది.



# 7 రత్నజ లింగములు

ఈ క్రింద చెప్పబడు రత్నములచే నిర్మింపబడు లింగములు రత్నజ లింగములని చెప్పబడుచున్నవి దీనిలో చల లింగములును, అచల లింగములును నిర్మించవచ్చును. వెనక సుప్రభేదాగమము నందు రత్నజ లింగము కేవలం చలా చలమని చెప్పబడినది. వజ్రము, మాణిక్యము, మొదలైన కొన్ని రత్నములు బృహదాకారములో దొరుకుట సాధ్యము కాదు గనుక రత్నభేదములయిన స్పటికము ప్రవాళము మొదలయిన కొన్ని రత్నములు దొరుకుట సంభవము ఉన్నది గనుక అజితాగమములో తెలియపరచిన చలా చల లింగములు రెండున్ను నిర్మించవచ్చును. అధికారి యొక్క వైభవానుసారముగా అవి నిర్మితమగును.

నానా గ్రంధములలో రత్నప్రభేదములకు ప్రత్యేక ఫలములను వివరించియున్నారు వాటి పట్టియు ఈ వెనుక పేజిలో ఇవ్వటము అయినది.

| రత్నములు | ఫలము | | | | | వీటి దేవతలు |
|---|---|---|---|---|---|---|
| | అజితాగమము 4 | కిరణా గమము 21 [51-52] | కారణాగమము 9 | సుప్రభేదము 33 | శిల్పరత్నము II - 1 | |
| మాణిక్యము | శ్రీప్రదము | — | సర్వసిద్ధి | — | — | సూర్యుడు |
| ముత్యము | దోషముక్తి | దోషముక్తి | — | ఇష్టసిద్ధి | — | చంద్రుడు |
| ప్రవాళము | వశీకరము | వంశవృద్ధి | దృష్టవశ్యము | ఇష్టసిద్ధి | జయము | కుజుడు |
| మరకతము | — | — | పుష్టిదము | — | — | బుధుడు |
| పుష్యరాగము | సౌభాగ్యము | సౌభాగ్యము | స్తంభనము | — | సుఖము | గురువు |
| వజ్రము | రాజ్యప్రదం | వజ్రమయము | — | — | కామము | శుక్రుడు |
| నీలము | యశస్సు | యశస్సు | మోక్షప్రాప్తియు | — | ఆరోగ్యము | శని |
| హరిదశ్మ | ఫల ప్రదము | ధన లాభము | — | — | వృద్ధి | రాహువు |
| వైడూర్యము | వైరినాశనము | వైరినాశనము | ఆయుర్వృద్ధి | — | పుత్రప్రదము | కేతువు |
| పద్మరాగము | — | శ్రీ పదము | ధనము | — | శ్రీపదము | — |
| శంఖము | — | సౌఖ్య పదము | — | — | — | — |
| స్ఫటికము | సర్వకామప్రదం | సర్వకామప్రదం | పుత్ర వర్ధనము | భక్తిముక్తిప్రదం | సర్వకామప్రదం | — |
| సూర్యకాంతము | — | — | — | — | మోక్షప్రదము | — |
| చంద్రకాంతము | — | — | — | — | అర్థప్రదము | — |

ఆయా ఫలాపేక్షకులు ముందు చెప్పబడు మానములలో చల లింగములను కాని అచల లింగములను కాని నిర్మించవచ్చును వీటి యొక్క పీఠ విషయములో

ఉత్తమం స్వస్వ యోనిః స్యాన్మధ్యమం స్వర్ణయోనికం ।
అధమం కాంస్యయోనిః స్యాత్ తదభావేతు తామ్రకం ।
తస్యా భావే శైలం స్యాద్రత్న లింగస్య పీఠకం ।

అజితాగమము 4 [56]

రత్నజ లింగము చలముగాని, అచలముగాని దాని పీఠము అదే రత్నముచే నిర్మింపబడుట ఉత్తమము పీఠము యొక్క మానమునకు సరిపోవు అదే రత్నము దొరకని యెడల స్వర్ణములో నిర్మించుట మధ్యమ పక్షము. రజితములో నిర్మించుట అధమ పక్షము రజితము దొరకని యెడల తామ్రము, తామ్రము దొరకని యెడల శిలలో నిర్మించవచ్చును. చల లింగము యొక్క [రత్నజ] పీఠ విషయములో

చలలింగే విశేషోయం కథ్యతే సురసత్తమ ।
ఆయామ సదృశం నాహః తత్సమం పీఠ విస్తృతం । ౫౮
విస్తార సమముత్సేధం పీఠస్యాపి విశేషతః ।
శిరసో వర్తనం కుర్యా త్పూర్వ వచ్చాన్త్ర చింతకః ।
చతురం శేతు తల్లింగే త్రిభాగం దృశ్య ముచ్యతే ।
భాగమేకం స్థితం పీఠే నిశ్చలం తత్ప్రకారయేత్ । ౫౯

అజితాగమము 4

లింగము యొక్క ఎత్తుకు సమమై లింగము యొక్క చుట్టు కొలత యుండవలెను మొత్తము లింగము యొక్క ఎత్తు ఎంతో అంత పీఠము యొక్క వెడల్పు పీఠము యొక్క ఎత్తు అంత ఉండవలెను లింగము మూడు వంతులు కనబడుటయు ఒక వంతు భాగము పీఠములోపలను ఉంటున్నది. అదే రత్నముచే పీఠము చేసినయెడల ప్రత్యేక లింగమున్ను పీఠమున్ను వేరు వేరుగా చేయనక్కరలేదు. కొలత ప్రకారము లింగము మరియు పీఠమును ఒకే రత్నముచే నిర్మించవచ్చును. పీఠము యొక్క ద్రవ్యము వేరు అయిన యెడల ప్రత్యేకమైన లింగ పీఠములను నిర్మించి పీఠములో లింగము యొక్క నాల్గవ భాగము ఉండు రీతిగా ఒక పళ్ళేముచేసి దానిలో లింగము కదలకుండ భద్రపరచవలెను. ఉదాహరణము. లింగముయొక్క ఎత్తు మూడు అంగుళములని భావించిన అవుడు

లింగము యొక్క చుట్టు కొలతయు [పరిధి] మూడు అంగుళములుండవలెను. అపుడు లింగము యొక్క వ్యాసము సుమారు ముప్పావు అంగుళమగును. 2¼ అంగుళము ఎత్తు కనబడుచుండును. మిగతా ¾ అంగుళము పీఠములో అంతర్గతమై యుంటున్నది. మరియు పీఠము యొక్క వెడల్పు ఎత్తు అంగుళము ఉండవలయునని తాత్పర్యము వీటికిముందు శిరోవర్తన ప్రకరణములో వివరించి యున్న రీతిగా అధికారులకు చెప్పబడిన శిరోవర్తన ముద్ర మానమునకు అనుసారముగా నిర్మించవలెను.

రత్నజ లింగముల మానము :— అధికారి దక్షిణ హస్తము యొక్క మధ్యమాంగుళీయ మధ్యమ పర్వము యొక్క వెడల్పు [కుడిచేయి మధ్య వేలు యొక్క మధ్య కనుపు వెడల్పు] ఒక అంగుళమని వ్యవహరించబడుతున్నది. దీని యొక్క ఎనిమిదవ భాగమునకు ఒక యవమని పేరు ఎనిమిది యవల యొక్క ఉదరము వెడల్పుకు ఒక అంగుళం అనిపేరు 12 అంగుళములకు ఒక వితస్తి [తాళము] 2 వితస్తిలకు ఒక హస్తము. ఇది సామాన్యమైన కొలత

మొదట చల లింగమానములు చెప్పబడుచున్నవి.

ఏకాంగుళాది ద్వియవ వర్ధనేనన వాంగుళాత్ । ౨౬
కనిష్ఠ నవలింగాని తథా వేదాంగుళాదితః ।
మధ్యాని నవలింగాని తథైవాంగాంగుళాంతతః ।
సప్తాంగుళాది ద్వియవ వర్ధనేన నవాంగుళాత్ ।
శ్రేష్ఠాని నవ లింగాని రత్నజాని విశేషతః ।
కనిష్ఠ మధ్య లింగాని రత్నజాతాని సర్వతః ।
చలానిగేహే పూజ్యాని స్థిరాణ్యే వోత్తమానిహ । ౨౯

శిల్పరత్నము 2

మానము ననుసరించి రత్నజ లింగములు కనిష్ఠ, మధ్యమ, ఉత్తమములని మూడు విధములు దీని యొక్క మానములు ఈ క్రింద ఇవ్వబడినవి. వీటిలో కనిష్ఠ మరియు మధ్యమ లింగములు చల లింగములనియు గృహములలో పూజింప బడుననియు, ఉత్తమ వర్గమునకు చేరినది స్థిర లింగములనియు ఆలయములో స్థాపించి పూజింపబడుననియు చెప్పబడుచున్నది

| | కనిష్ఠ ౯ లింగములు | | | | మధ్యమ ౯ లింగములు చల లింగములు | | | | ఉత్తమ ౯ లింగములు స్థిర లింగములు | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ౧ | అం | ౦ | యవము | ౪ | అం. | ౦ | యవము | ౭ | అం. | ౦ | యవము |
| 2 | ౧ | " | ౨ | " | ౪ | " | ౨ | " | ౭ | " | ౨ | " |
| 3 | ౧ | " | ౪ | " | ౪ | " | ౪ | " | ౭ | " | ౭ | " |
| 4 | ౧ | " | ౬ | " | ౪ | " | ౬ | " | ౭ | " | ౯ | " |
| 5 | ౨ | " | ౦ | " | ౫ | " | ౦ | " | ౮ | " | ౦ | " |
| 6 | ౨ | " | ౨ | " | ౫ | " | ౨ | " | ౮ | " | ౨ | " |
| 7 | ౨ | " | ౪ | " | ౫ | " | ౪ | " | ౮ | " | ౪ | " |
| 8 | ౨ | " | ౬ | " | ౫ | " | ౬ | " | ౮ | " | ౩ | " |
| 9 | ౩ | " | ౦ | " | ౬ | " | ౦ | " | ౯ | " | ౦ | " |

ఏకాంగుళాత్ ద్విహస్తాంతం రత్నజం నవరం తతః ।

అపరాజితము

ఒక అంగుళముచే ప్రారంభించి రెండు హస్తముల వరకు మాత్రమే రత్నజ లింగములను నిర్మింప బడుటయును, రెండు హస్తములకు పైన రత్నజ లింగములు నిర్మింపబడ కూడదు అని నిషేధము కనబడుచున్నది. కాని రెండు హస్తముల రత్నము ప్రాయః ఎచ్చటను దొరకదు. అయినను శాస్త్రములో ఈ విధి నిషేధ వాక్యములు కనబడుచున్నవి. దీపార్ణవ మనే శిల్పగ్రంధములో అంగుళాంగుల వృద్ధిచే రత్నజ లింగములు తొమ్మిది విధములు మాత్రమే చెప్పబడియున్నది.

రత్నమే కాంగుళం లింగం అంగుళాంగుల వృద్ధితః ।
నవాంతం నవ లింగాని వృద్ధిర్వా ముద్గమానతః ।

ముద్గ [యువము] మానములో అంతరాంతరవృద్ధిచే వికల్పమై నిర్మింపవచ్చునని చెప్పబడియున్నది. అపరాజిత పృచ్ఛా అనే శిల్ప గ్రంధములోను ఇదే అభిప్రాయము

రీతిగా ఒకటి నుంచి తొమ్మిది అంగుళముల వరకు యవవృద్ధి క్రమములో [9×8=72] 72 విధ మానములను చెప్పి వాటికి నామ నిర్దేశమును చేసియున్నారు. వివరములు క్రింద పట్టిలో చూడవచ్చును. .... .... .... ఇంకొక విశేషము [ అపరాజితము 198 (1-10) ]

8 అంగుళముల లింగమును చక్రవర్తులు, 7 అంగుళ లింగమును మహరాజులు, 6 అంగుళ లింగమును మహా మండలేశ్వరులు, 5 అంగుళ లింగమును ముముక్షువులు, 4 అంగుళ లింగమును మహా సామంతులు, 3 అంగుళ లింగమును అందరునుపూజింప వచ్చును. [అపరాజితము 199-18-24]

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| మనోహర | ౦–౧ | ౧–౧ | ౨–౧ | ౩–౧ | ౪–౧ | ౫ ౧ | ౬–౧ | ౭–౧ | ౮–౧ |
| శ్రీముఖ | ౦–౨ | ౧–౨ | ౨–౨ | ౩–౨ | ౪–౨ | ౫–౨ | ౬–౨ | ౭–౨ | ౮–౨ |
| రుద్రతేజ | ౦–౩ | ౧–౩ | ౨–౩ | ౩–౩ | ౪–౩ | ౫–౩ | ౬–౩ | ౭–౩ | ౮–౩ |
| మహోత్సవ | ౦–౪ | ౧–౪ | ౨–౪ | ౩–౪ | ౪–౪ | ౫–౪ | ౬–౪ | ౭–౪ | ౮–౪ |
| ఆనంద | ౦–౫ | ౧–౫ | ౨–౫ | ౩–౫ | ౪–౫ | ౫–౫ | ౬–౫ | ౭–౫ | ౮–౫ |
| సువక్త్ర | ౦–౬ | ౧–౬ | ౨–౬ | ౩–౬ | ౪–౬ | ౫-౬ | ౬–౬ | ౭–౬ | ౮–౬ |
| శ్రీపుంజ | ౦–౭ | ౧–౭ | ౨–౭ | ౩–౭ | ౪–౭ | ౫–౭ | ౬–౭ | ౭–౭ | ౮–౭ |
| నంధివర్ధన | ౧–౦ | ౨–౦ | ౩–౦ | ౪–౦ | ౫–౦ | ౬–౨ | ౭–౦ | ౮–౦ | ౯–౦ |

అంగుళములకు శివాది నామములు, యవములకు మనోహరాది నామములు చెప్పబడియున్నవి. ప్రవక్త అంగుళ యవములు ప్రమాణమునకు అయా నామములను చేర్చి నామములు పిలువ వలెను.

స్ఫటిక లింగమును 18 అంగళముల వరకు నిర్మింప బడుననియు, అంగుళ వృద్ధి క్రమములో ఒక అంగుళముచే ఆరు అంగుళము వరకు ఉన్న లింగము అధమనియు, 8 అంగుళములచే 12 అంగుళము వరకు యున్న లింగము మధ్యమమనియు, 13 అంగుళముల నుంచి 18 అంగుళము వరకు యున్న లింగము ఉత్తమమనియు ఈశాన శివ గురుదేవ పద్ధతి గ్రంథము 40 వ అధ్యాయములో చెప్పబడి యున్నది.

ఏకాంగుళం సమారభ్య క్రమాంగుళ వివర్ధనాత్ । ౧౮
షడంగులాంతం స్ఫటిక లింగ షట్కం మిహాధమం ।
సప్తాంగుళాధికం లింగం మధ్యమం ద్వాదశాంగుళాత్ । ౧౮
త్రయోదశాంగుళాదీని లింగాన్యాష్టాదశాంగుళాత్ ।
ఉత్తమాని భవంత్యేషు మానం మాత్రంగుళేనహి ।



# 8 దారుజ లింగములు

## [కొయ్య లింగములు]

కొయ్యలో కూడ లింగములను నిర్మించి పూజించవచ్చును. కొందరు గ్రంధకర్తలు కొన్ని కొన్ని [కొయ్యలను] మాత్రమే నిర్దేశించియున్నారు. దాని పట్టికను ఈ ముందు ఇవ్వబడినది

"షోడశాంగులతో హీనం కుర్యాన్నదారుజం"

అని అపరాజిత పృచ్ఛా అను శిల్ప గ్రంధములో 16 అంగుళములకు తక్కువగా ధాను లింగమును నిర్మింప కూడదని చెప్పుటచేతను. 9 అంగుళము వరకు మాత్రమే చల లింగమనియు పరిగణితమై యున్నందున ఈ దారుజ లింగములలో చల లింగము లేదని అర్ధము అగుచున్నద కేవల స్థావర లింగములను మాత్రమే కాష్టములో నిర్మింప వచ్చును

దారు లింగమునకు కావలసిన వృక్షము యొక్క లక్షణము ఈ రీతిగా నున్నది.

.... .... నవాత్ర వృక్షాః ఖతితా స్ససారాః

అజితాగమము 4 [16]

లోపల ముదిరి గట్టిగావున్న వృక్షములై యుండవలెను. అనగా వృక్షము ముదిరనదై యుండవలెను.

అన్యేచ బహవో వృక్షాః మద్యవార స్సుశోభనాః ।
స్నిగ్ధ పత్రాః మహాకాయాః శుభదేశోత్థి తాస్తుయే ।

సుపభేదము 33

మంచి ప్రదేశములో పెరిగి పెద్దదైయుండి స్నిగ్ధమైన ఆకులతోకూడి మధ్యమందు గట్టిగా వున్న వృక్షములు శ్రేష్ఠములైనవి.

దృఢకాష్ఠ మయ లింగం కర్తవ్యం .... .... .... ....

దీపార్ణవము

దృఢమైన [బొండుగలేని పురుగు తినక ఉన్న] వృక్షములతో లింగమును నిర్మించ వచ్చును.

ఇక త్యాజ్య వృక్షములు :-

అగ్ని దగ్ధాశ్చ శుష్కాశ్చ పక్షిణాంతు నికేతనాః ।
లతా వల్మీక సంస్థాశ్చ వర్జయే త్సాధకో త్తమః ।

సుప్రభేదము 33

అగ్నిలో కాల్చినది, ఎండినది, పక్షులకు ఆవాసమై యుండినది, తీగకు ఆధారమైన వృక్షము, పుచ్చు పట్టిన వృక్షములు ఈ రీతిగా వున్న వృక్షములు త్యాజ్యములు.

లింగ నిర్మాణ యోగ్య వృక్షములు :- అజితాగమ క్రియా 4 [16] ప్రకారము చందన, దేవదారు, ఖదిర, బిల్వ, శమీ, [జమ్మిచెట్టు] అశ్వత్థ, అరిష్ట, [వేప] మధూక, [ఇప్ప] కరంజ [గానుగ] వృక్షములు.

కామికాగమ ప్రకారము :-

చందన, దేవదారు, రక్తచందన, అశోక, ఖదిర, అర్జున, బిల్వ, మధూక, శాల, సరళ, [దేవదారులో భేదము పసుపు రంగు] బదర, [రేగిచెట్టు] కదంబ శింశప, పనస, క్షీరిణః [మర్రి, రావి] స్నిగ్ధధారా ఈ వృక్షములలో లింగనిర్మాణమును చేయవచ్చును.

సుప్రభేదాగమము (33 [52-57] వ) ప్రకారము :-

అర్జున, శమీ, మధూక, కర్ణికార, తిందుక, పిప్పల, ఉదంబర, ఈ వృక్షములు శ్రేష్ఠము

అపరాజిత పృచ్ఛా 200 [1-8] ప్రకారము చందన, దేవదారు, రక్తచందన, సర్ప, శింశప, శిరీష, అశోక, కర్పూర అగరు, హింతాల, మధుపాద, ఖదిర, పారిజాత అర్జున, శ్రీఫల, [బిల్వము] లవంగాక్ష, రాంజనక, బీజక ఈ వృక్షములు యోగ్యమని చెప్పబడి యున్నవి.

—:o:—

# దారులింగ మానములు

దృఢకాష్ఠమయం లింగం కర్తవ్యం షోడశాంగులం ।
షోడశాంగులికా వృద్ధిః షట్కరాంతం నవైవతు ।

దీప్తార్ణవము 13 [10]

ఈశాన శివగురు 40 [35-37]

పదహారు అంగుళములతో ప్రారంభించి పదహారు, పదహారు అంగుళముల వృద్ధి క్రమములో ఆరు హస్తము వరకు 6×24=144 అంగుళముల వరకు మొత్తము 9 లింగములను నిర్మించవచ్చునని యు. వాటికి ఈ క్రింద వ్రాసిన నామములు చెప్పబడి యున్నవి ఈ రీతిగా దారుజ లింగములు 9 విధములు.

| | అంగుళము | హస్తమాన అంగుళము | లింగ నామము |
|---|---|---|---|
| ౧ | ౧౬ | [illegible] | మకర |
| ౨ | ౩౨ | ౧ ౮ | ఇందు |
| ౩ | ౪౮ | ౨·౦౮ | పుష్పాక్ష |
| ౪ | ౬౪ | ౨·౦౬ | సిద్ధార్ధక |
| ౫ | ౮౦ | ౩-౮ | దండ |
| ౬ | ౯౬ | ౪-౦ | పౌరుష |
| ౭ | ౧౧౨ | ౪ ౧౬ | కామ్య |
| ౮ | ౧౨౮ | ౫·౮ | పుష్పక |
| ౯ | ౧౪౪ | ౬-౦ | ఫలోద్భవ |

అపరాజిత పృచ్ఛా 200 వ అధ్యాయము నందు 10, 12 వ శ్లోకముల రీతిగా 16 అంగుళము నుంచి ఆరంభించి 144 అంగుళము వరకు 128 లింగములను నిర్మించవచ్చును. మరియు వెనుక రత్నజ లింగములో వివరించిన రీతిగా ముద్దవృద్ధి క్రమములో 128 అంగుళము వరకు 8 ముద్గ ప్రమాణ రీతిగా 128×8=1024 లింగములు, చివర ఆరు హస్తముల లింగముతోచేరి 1025 లింగములు అగును.

ఈశాన శివ గురుదేవ పద్ధతిలో దారుజ లింగమును 16 అంగుళముతో ఆరంభించి నాలుగు నాలుగు అంగుళవృద్ధి క్రమములో 144 అంగుళముల వరకు 33 లింగములు అగును అనిచెప్పబడి యున్నది. [II 40-35-36] పై లింగములన్నియు మానములోనే నిర్మించవలెను.

# 9 మృణ్మయ లింగములు

మృత్తిక (మన్ను) తోను లింగములను నిర్మించవచ్చును. ఇవి స్థావర లింగములే యగును. ప్రాయః చల లింగములు అగుటలేదు. కాని

తథా లింగం ప్రకర్తవ్యం శైలలింగ విధానతః ।
కిరణాగమము III 21 (60)

పార్థివస్యచ లింగస్య శైల వన్మాన మిష్యతే ।
పూర్వకారణము 10 (190)

ఈ వాక్యముల ప్రకారము శైలజ లింగము యొక్క లక్షణము మరియు మానములను అనుసరించ వలసినది అని చెప్పబడి ఉన్నందుసను, శైలజములో (శిలలో) చల లింగములను నిర్మింపవచ్చునని చెప్పబడి యున్నందునను ఈ మృణ్మయ లింగములలో చల లింగములను నిర్మింప వచ్చునని తెలియవస్తున్నది.

దీనిలో రెండు విధములు 1 పక్వ 2 అపక్వ అని

1. మృణ్మయం రాజ్య ఫలదం పక్వాపక్వ ప్రభేదకం । సుప్రభేదము 33 29
2. పార్థివం ద్వివిధం జ్ఞేయం పక్వాపక్వ విలక్షితం ।
తత్ర పక్వం భవేన్ముఖ్యం ... ... .... । కిరణాగమము III 21 (56)
3. అపక్వం చైవ పక్వంచ పార్థివం లింగముచ్యతే ।
పూర్వకారణము 10 (190)
4. యత్ పార్థివం తద్ద్వివిధం ప్రతిష్ఠం పక్వమభేదేన శివస్యలింగం ।
అజితాగమము 4 (17)

దీని యొక్క మానములు శైలజ లింగములు రీతిగానే ఉండవలెనని విధించి యున్నది గనుక ఇచట ఆ మానములను వివరించబడలేదు శిలా లింగ ప్రకరణములో వివరించు మానములను ఇచ్చుటను అన్వయించవలెను.

ఇపుడు మృణ్మయ లింగ నిర్మాణము చెప్పబడుచున్నది.

అజితాగమములో 4 [13-20] ప్రకారము :- శుద్ధమయిన ప్రదేశములో తెలుపు, ఎఱుపు, పసుపు, వర్ణములో ఒక వర్ణము మట్టిని సంగ్రహించి బాగుగా శోధించి త్రిఫల [1 2 3 ఉసిరికాయి] మిశ్రితమును నీళ్ళలో నాన బెట్టి క్షీర వృక్షముల బెరడు యొక్క చూర్ణము, గోధుమపిండి, మినుపపిండి, నెయ్యి, పాలు, పెరుగు అన్ని మిశ్రమముచేసి ఒక నెల కాలము నానపెట్టవలయును, అనంతరము ఆ రీతిగా అపక్వమై అథవాపక్వమై నదానితో లింగమును నిర్మించవలయును.

సుప్రభేదాగమము 33 [29-31] ప్రకారము :- శుద్ధ ప్రదేశమైన చోట నుండి మట్టిని తీసి దానిలో లింగమును నిర్మించి పక్వము చేయవలెను. అపక్వ లింగము అయినయెడల గోధుమపిండి, మినపపిండి, నెయ్యి, పాలు, కషాయములు, గుగ్గులము, సర్జర్యాసము, నూరేడుపండు గుజ్జు ఇవి అన్నియు చూర్ణించి మిశ్రమము చేసి ఒక నెల కాలము నాన పెట్టవలయును

కిరణాగమములో 21 [56-60] ప్రకారము :- పసుపు, ఎఱ్ఱ తెలుపు, ధూమ్ర వర్ణము కలిగిన మట్టి శ్రేష్ఠము ఈ మట్టిని సంగ్రహించి నెయ్యి, పాలు కలిపి దానిలో అవిసెనూనె. గోధుమపిండి మినపపిండి, క్షీర వృక్షముల బెరుడు చూర్ణమును, త్రిఫల కషాయములు, గుగ్గిలము, బిల్వ ఫలము యొక్క గుజ్జు, దేవదారు యొక్క బెండు పొడి వీటితో కలిపి మర్దించి ఒక నెల అథవా 15 రోజులు నానపెట్టవలయును. అనంతరము దానిలో లింగమును నిర్మించి పక్వముచేసి గాని, అపక్వముచేసి గాని ప్రతిష్ఠించవలెను. ఒక విశేషము [పక్వ లింగమును హర మంత్రము చేతను, అపక్వ లింగమును సద్య మంత్రము చేతను నిర్మించవలెను.]

పూర్వకారణాగమము 10 [190-200] ప్రకారము :- పర్వతాగ్రము, నదీతీరము, పుణ్య క్షేత్రములలో నున్న శ్వేత, రక్త, పీత, కృష్ణ మృత్తికలలో ఏదైనా ఒక మృత్తికను సంగ్రహించి పంచగవ్యముతో మర్దించవలెను. కపిల గోవు యొక్క పాలు, పెరుగు, నెయ్యి అథవాతిలనూనె చేర్చి గోధుమపిండి, మినపపిండి సమ ప్రమాణములో మిశ్రించవలెను, అన్నిటికి బాగుగా మర్దించి వల్ల అరగు. కుందురుష్కమనే గంధ ద్రవ్యము, దేవదారు యొక్క నిర్యాసము, గుగ్గుల, సాల వృక్షము యొక్క జిగురు, బిల్వ వృక్షము యొక్క రసముతోను, పంచక్షీరి వృక్షముల నిర్యాస (పాలు) వీటిని కలపి ఒక నెల

అథవా ఒక పక్షము నానపెట్టి ఉత్తమ, మధ్యమ, అధమ మానము కలిగిన లింగములను నిర్మించవలెను. వీటియొక్క పిండి (పీఠము) యు సహా మృణ్మయమై యుండవలెను.

ఆయుష్మాన్ బలవాన్ శ్రీమాన్ పుత్రవాన్ ధనవాన్ సుఖీ ।
వరమిష్టం లభే ల్లింగం పార్థివం యః సమర్చయేత్ ।
తస్మాత్తు పార్థివం ల్లింగం జ్ఞేయం సర్వార్థ సాధనః ।

నందిపురాణము

పార్థివ లింగము యొక్క పూజ చేయుటచే ఆయుస్సు, బలము, సంపత్తు పుత్ర, ధనప్రాప్తి, ఇష్టవర ప్రాప్తియు అగును ఇది సర్వార్థ సాధకము.

## 10 ధాతుజ లింగములు

సువర్ణ రౌప్య తామ్రాశ్మ హరి తాళం మనశ్శిలా ।
గైరికాంజన కాంస్యాది లోహ సీసా స్సహింగులాః ।
గంధకో భ్రక మిత్యాద్యా ధాతవో గిరి సంభవాః ।

గురుబాల ప్రబోధికా

సువర్ణము, రజితము, తామ్రము, శిలాజతు, హరి తాళము, మనశ్శిలయు గైరిక, అంజనము, కంచు, లోహము, సీసము, ఇంగిలీకము, గంధకము, అభ్రకము ఇవి పర్వతములలో జనించు ధాతువులు.

లింగ నిర్మాణము చేయుటకు వీటిలో కొన్ని లోహములు ప్రశస్తమని ఆగమ మరియు శిల్ప శాస్త్రములలో చెప్పబడినది.

.... .... .... .... అష్ట విధించ ధాతు ॥ ౧౨
కల్యాణ రూప్యే త్వథకాంస్య త్తామ్రే త్రపృ్వారకూటా యస సీసకాని ।
ధాతూని లింగస్య విధానమూని శుద్ధాని చాష్టౌ కథాతాని విష్ణో । ౫

అజితాగమము ౪

1 సువర్ణము, 2 రజితము, 3 కంచు, 4 తామ్రము, 5 తగరము 6 పిత్తళము. 7 ఇనుము, 8 సీసము, ఈ ఎనిమిది లోహములు ప్రశస్తము చెప్పబడినది సుప్రభేదాగమము కోను ఈ 8 లోహములనే ఉదహరించి వాని యొక్క ఫలమును ఈ రీతిగా తెలిపి యున్నారు.

సౌవర్ణం శ్రీప్రదం ప్రోక్తం రాజతం రాజ్య సిద్ధిదం ।
తామ్రం పుత్రప్రదం చైవ విద్వేషం కాంశ్యమేవచ ।
ఆరకూటం తథోచ్చాటే క్షయ కారక మాయసం ।
సీసకం రోగహరణం త్రపు రాయుష్య వర్ధనం ।
ఏవంతు లోహజం ప్రోక్తం .... .... .... .... । సుప్రభేదము 33

సువర్ణము సంపత్ప్రదము, రజితము రాజ్య ప్రదము, తామ్రము పుత్రప్రదము కాంస్య (కంచు) ద్వేషప్రదము, ఆరకూట (పిత్తళము) ఉచ్చాటన కరము, అయసము (ఇనుము) క్షయ కారము, సీసము, రోగ హారియు, త్రపు (తగరము) ఆయుష్య వర్ధనమై యుంటున్నది ఇచ్చట కాంస్య ద్వేషమును, పిత్తళము ఉచ్చాటనమున్ను, ఇనుముక్షయ మున్ను. చేయుచున్నవని చెప్పబడియున్నది. ప్రాయః రాజులు లోక కళ్యాణము కొరకై శత్రువుల పైన అభిచారిక ప్రగయోములను చేయుటకు ఏర్పడి యుండవచ్చును వాని యొక్క ఉపయోగము కొరకై ఈ లోహములు చెప్పబడినవి అని కనబడుచున్నది.

వీని యొక్క మానములు చెప్పబడుచున్నవి.

లోహజ లింగములలో చల లింగములు, అచల లింగములు నిర్మింపబడవచ్చును

రామాంగుళాదినా లోహం లింగమా షోడశాంగుళాత్ ।
చల లింగం స్మృతం తస్మాత్ స్థిరాణ్యూర్ధ్వం భవంతిహి ।
శిల్పరత్నము ॥ 2
ఈశాన శివగురు 41 [32]

మూడు అంగుళములచే ఆరంభించి పదహారు అంగుళముల వరకు ఉన్న లోహ లింగములు చలములు, దానికి పైన ఉన్న ఎడల స్థావర లింగములు అని పేరు.

లోహాది ధాతుజాతాని వచ్మి లింగాని సంప్రతి ।
అష్టాంగుళం భవేదాద్యం త్రిహస్తాంతంచ తద్భవేత్ । ౧
అష్టాంగుళా దయో లింగాః వృద్ధి రష్టాంగుళ క్రమాత్ ।
ఇత్థంతు నవలింగాని కనిష్ఠ త్రికరో చ్ఛ్రితం ।। ౨
నవలింగా భిధానాని కథయిష్యామ్యను క్రమాత్ ।
శ్రీయోద్భవం మహాకాంతం ప్రోద్యంతం సంభవమ్ తథా ।
సోమరాజం మహారాజం రాజలింగం, మహాంతకం ।
వృషధ్వజం తథాఖ్యాతం లింగంచ నవమం భవేత్ ।

అపరాజితము 199

ఈశాన శివగురు 41 [8]

దీపార్ణవము 13 [8]

లింగాష్టక నిభంధేతు ధాతు లింగాంగుళాంతరే ।
కుర్యాదాద్యం చాష్టకోర్ధ్వ తచ్చైకై కాంగులాంతరే ।
అష్టాభి రష్టకై రేవం చతుష్షష్టిశ్చ సంశయా ।
ఏకై కాంగుల మధ్యేతు లింగాష్టక ముదాహృతం ।
శివం శర్వం జయం చైవ సునాభంచ జయావహం ।
విజయం భాసురం మోక్ష మష్ట లింగాంగుళాంతరే ।
అష్టకోర్ధ్వే పునస్తేవం అభిదానా న్యాష్టవధీ ।
పునశ్చాంగుల మధ్యేష్టా లింగాని ముద్గ మానతః ।
మనోహరం శ్రీముఖాఖ్యం రుద్రతేజో మహోత్సవం ।
ఆనందంచ సువక్త్రాఖ్యం శ్రీపుంజం నంది వర్ధనం ।
ఇత్యుక్త్వా న్యష్టలింగాని ముద్గ తుల్యాని మానతః ।
అంగులాంగులతో వృద్ధిః లింగానాం కథితాక్రమాత్ ।
చతుషష్ఠిచ లింగాని భూయోఽ ష్టాంగుల మధ్యతః ।
ఇత్థం లింగాని ద్వాదశో త్తర పంచశతానిచ ।

అపరాజితము 199

లోహజ లింగములు అను మొదట తొమ్మిది మానములలో అనగా ఎనిమిది అంగుళములు మొదట ఆరంభించి ఎనిమిది అంగుళ వృద్ధిగా మూడు హస్తములనగా

[24×3=72] 72 అంగుళము వరకు తొమ్మిది లింగములను తెలిపి వాటికి నామ నిర్దేశనమును చేసియున్నారు.

| | హస్తము | అంగుళము | అంగుళము | నామ నిర్దేశనము |
|---|---|---|---|---|
| 1 | 0 | 8 | 8 | శ్రీయోద్భవము |
| 2 | 0 | 16 | 16 | మహాకాంతము |
| 3 | 1 | 0 | 24 | ప్రోద్యంతము |
| 4 | 1 | 8 | 32 | సంభవము |
| 5 | 1 | 16 | 40 | సోమరాజ |
| 6 | 2 | 0 | 48 | మహారాజ |
| 7 | 2 | 8 | 56 | రాజలింగము |
| 8 | 2 | 16 | 04 | మహాంతకము |
| 9 | 3 | 0 | 72 | వృషధ్వజము |

ఈ తొమ్మిది లింగములలో చివరిది అయిన 72 అంగుళ లింగము కనిష్ఠమని చెప్పబడి 64 వరకు ఉన్న ఎనిమిదవ లింగము అని నిబంధన చేసిన యెడల వెనుక రత్నజ లింగముల మానమును చెప్పబడిన పట్టిలో కనవరచిన రీతిగా అంగుళాంగుల వృద్ధిచే 64 లింగములు. పునః వాటిలో ముద్గ వృద్ధిచే 64X8=512 లింగములు అగును మరియు అచ్చట కనవరచిన రీతిగా అంగుళ వృద్ధిమునకు ముద్గ వృద్ధిమునకు నామములు ఇవ్వబడినది ఈ ప్రక్క ప్రాయి పట్టిలో 8 అంగుళము వరకు నామ నిర్దేశనము వుంటున్నది. మొదటి శ్రీయోద్భవ లింగము 8 అంగుళము మాత్రము ఉన్నది గనుక దానికి పూర్ణమై ఈ పట్టియు అన్వయించును ముందు రెండవ మహాకాంతాదులకు దాని దానిలో ఎనిమిది ఎనిమిది అంగుళముల అంతరం ఉన్న యెడల వాటికి కూడ ఈ పట్టిలో అన్వయించవలసినది.

| అంగుళవృద్ధి<br>ముద్గవృద్ధి | శివ | శర్వ<br>అం. ము | జయ<br>అం. ము | సునాభ<br>అం. ము | జయావహ<br>అం. ము | విజయ<br>అం. ము | భాసుర<br>అం. ము | మోక్ష<br>అం. ము | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| మనోహర | ౦–౧ | ౧–౧ | ౨–౧ | ౩–౧ | ౪–౧ | ౫ ౧ | ౬–౧ | ౭–౧ | |
| శ్రీముఖ | ౦–౨ | ౧–౨ | ౨–౨ | ౩–౨ | ౪–౨ | ౫–౨ | ౬–౨ | ౭–౨ | |
| రుద్రతేజ | ౦–౩ | ౧–౩ | ౨–౩ | ౩–౩ | ౪–౩ | ౫–౩ | ౬–౩ | ౭–౩ | ఇదేరీతిగా పైన |
| మహోత్సవ | ౦–౪ | ౧–౪ | ౨–౪ | ౩–౪ | ౪–౪ | ౫–౪ | ౬–౪ | ౭–౪ | చెప్పిన ఎనిమిది |
| ఆనంద | ౦–౫ | ౧–౫ | ౨–౫ | ౩–౫ | ౪–౫ | ౫–౫ | ౬–౫ | ౭–౫ | లింగములకూ |
| సువక్త్ర | ౦–౬ | ౧–౬ | ౨–౬ | ౩–౬ | ౪–౬ | ౫·౬ | ౬–౬ | ౭–౬ | అన్వయించును. |
| శ్రీపుంజ | ౦–౭ | ౧–౭ | ౨–౭ | ౩–౭ | ౪–౭ | ౫–౭ | ౬–౭ | ౭–౭ | |
| నందివర్ధన | ౧–౦ | ౨–౦ | ౩–౦ | ౪–౦ | ౫–౦ | ౬–౦ | ౭–౦ | ౮–౦: | |

౮×౮ .. ౬౪×౮ = ౫౧౨

జ్యోతిషే తంత్ర శాస్త్రేచ వివాదే వైద్య శిల్పకే ।
అర్ధ మాత్రంతు గృహ్ణీయా న్నాత్ర శబ్దం విచారయేత్ ।

ఇచట ఇదివరకు లోహ లింగ విచారమై ద్రవ్య మాన లక్షణము అన్నిటిని చెప్ప బడినవి. ప్రకృతము శాస్త్ర వుక్తి యొక్క అంతరార్ధ మొకటిని చెప్పే తీరవలెను.

జ్యోతిష, తంత్ర శాస్త్ర [అగమశాస్త్రము] అర్ద శాస్త్రము అనగా వివాద కాలము యొక్క మాటలు వైద్యము, శిల్పము వీటిలోని భావార్ధమును మాత్రమే గ్రహించవలెను. శబ్దమున్నది యని చెప్పి ఆ రీతిగా నడుచుట సాధ్యము కాదు.

శిలేష్టిక సుదారు మృత్సా మృల్లోష్ట లోహకాః ।
ఏతాని శిల్ప ద్రవ్యాని ముఖ్యత్వేన నిరూపితాః ।

భృగుసంహిత

కాష్ఠ మృద్దిష్ఠకే చైవ ధాతు రత్నజే ।
ఉత్తరోత్తర దృఢద్రవ్యం లోహకర్మ వివర్జయేత్ ।

అగమము మరియు శిల్ప శాస్త్రములో చెప్పబడిన రీతిగా శిల, ఇష్టిక, దారు, మృత్‌శిలా, లోహము ఇవి శిల్ప శాస్త్ర విహితమైన వస్తువులు ముఖ్యమైనవి. లోహ మనగా సువర్ణ, రజిత తామ్రాదులచే లింగమును నిర్మించ వచ్చునని మొదట చెప్పి ఇవుడు "లోహ కర్మవివర్జయేత్ అనగా పైన చెప్పిన సువర్ణాది లోహ లింగములను నిర్మించకూడదు. అని నిషేధించి యున్నది. అర్ధమేమనగా సువర్ణాది శుద్ధ లోహముచే నిర్మించక పంచ లోహ మిశ్రితము చేసి లింగమును నిర్మించవలెనని తాత్పర్యము. మిశ్ర మము చేయునవుడు ఏ లోహము ఇతర లోహములకంటె అధికమై చేర్చ బడుతున్నదో అవుడు ఆ లోహము యొక్క లింగమని పిలువబడుచున్నది.



# 11 శైలజ లింగములు

శిలలో లింగమును నిర్మించవచ్చును. ఆ విషయ వివరణములను వర్ణించుటయైనది. లోకములో విశేషమై శిలామయ లింగములే అధిక సంఖ్యలో ఉంటున్నవి శిలలో చల లింగములున్ను, అచల లింగములున్ను నిర్మించవచ్చును. అపరాజిత పృచ్ఛా అను శిల్ప గ్రంధములో శిలా లింగములను వివరించినపుడు "హస్తాది నవ హస్తాంతం"అని ప్రారంభించి యున్నారు గనుక ఒక హస్తం [24 అంగుళము] మొదలు తొమ్మిది హస్తము అనగా [24X9] లింగము, వరకు లింగములను నిర్మించవచ్చును అని అర్ధము అగును. గనుక ఒక హస్తమునకు పైన ఎత్తువున్న లింగము స్థావరలింగమనియు, ఒక హస్తము క్రింద వున్న చల లింగమనియు భావించుటకు అవకాశమున్నది.

.... .... .... .... శైలంచతుర్ధా.... .... .... .... .... । ౧౨
శిలా సితా రక్తనిభాచ పీతా కృష్ణాచ విప్రాదిషు యోజనీయా । ౧౪

అజితాగమము 4

శ్వేత శిలా రక్తశిలా, పీతశిలా, కృష్ణశిలా. ఈ నాలుగు వర్ణములయొక్క శిలలు లింగ నిర్మాణమునకు ప్రశస్తము లనియు ఇవి క్రమముగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణములవారికి యుక్తమనియు చెప్పబడినది.

శిలయాపి సువిజ్ఞేయాజాతి భేద పరీక్షకైః । ౪౨
శ్వేతారక్తా తధా పీతా కృష్ణాచైవ చతుర్విధా ।
గోక్షీర శంఖ వర్ణాభా బ్రాహ్మణానాం ప్రశస్యతే ।
జపాబంధూక పుష్పాభా నృపాణాం ప్రోచ్యతే క్రమాత్ ।
రజనీ స్వర్ణ సదృశావై శ్యానాంతు ప్రశస్యతే ।
మాషగుగ్గుల సంకాశా శూద్రాణాంతు సమృద్ధికా ।
సర్వేషాంతు శిలాకృష్ణా సర్వ సంపత్కరీ శుభా ।

సుప్రభేదము 33

అజితాగమమందు చెప్పబడిన రీతిగా నాల్గు వర్ణముల వారికిని నాల్గు వర్ణముల శిలలను చెప్పి ఆఖరులో అందరుకు కృష్ణ శిలయే సర్వ సంపత్ప్రదమని చెప్పబడినది. అనగా కృష్ణ శిలయందు ఎవరు కావలసినను వారు లింగనిర్మాణమును చేయవచ్చును విశేషమేమనగా పై చెప్పిన వర్ణాంతర శిలలో లింగ నిర్మాణము చేయునపుడు దాని దాని అధికారి క్రమములో లింగమును నిర్మించ వలసినది అని తెలియవచ్చినది.

# శిలా లింగ మాన ములు

అపరాజిత పృఛ్ఛా 201 వ అధ్యాయమందు బహు విస్తారమైన శిలా లింగముల మానములు చెప్పబడియున్నవి బహు సూక్ష్మ వ్యత్యాసములను వివరించి యున్నారు ఎత్తు విషయములో కొద్దిగా వ్యత్యాసమైనను దానికి అనుసారముగా వెడల్పు మరియు శిరోవర్తనముల కొలతలో వ్యత్యాసమగును. శాస్త్రకారులు మానములలో ముద్గ ప్రమాణ వ్యత్యాసములను గమనించి యుండుటను చూచినయెడల వారు గణితములో ఎంత నిపుణులై యున్నారో కనబడుచున్నది గణితములో అశక్తి యున్నవారు ఈ వివరములను గమనించవచ్చుననే అభిప్రాయముతో అన్ని వివరముల మూల శ్లోకములను వ్రాసి ముఖ్యమైన కొన్ని మానములను మాత్రమే వ్రాసియున్నాము.

సూత్రహస్తా దధారభ్య పాదవృధ్యా త్రిహస్తకం ।
కనిష్ఠ నవలింగానాం పాదవృద్ధి రనుక్రమాత్ । ౧
మధ్యమానిచ లింగాని పాదవృద్ధ్యా నవక్రమాత్ ।
యుగహస్తాది తశ్చైవం తథా షడ్ఢస్త కావధి ।
ఆయామే సప్తహస్తాచ్చ నవ హస్తాంత మేవహి ।
ఉత్తమం లింగ నవకం పాదవృద్ధ్యా యథాక్రమమ్ ।
త్రిచతు చతుర్హస్తయోర్మధ్యో షట్ సప్తకరావధి ।
పాదవృద్ధ్యా త్రీణి త్రీణి షల్లింగానాం సముద్భవః । ౬
సంఖ్యాతాని త్రయస్త్రింశత్ లింగాని పాద వృద్ధితః ।

అపరాజితము 201

| | కనిష్ఠ లింగములు | మధ్యమ లింగములు | ఉత్తమ లింగములు |
|---|---|---|---|
| 1 | 1 హస్తము | 4 హస్తములు | 7 హస్తములు |
| 2 | 1¼ హస్తములు | 4¼ హస్తములు | 7¼ హస్తములు |
| 3 | 1½ „ | 4½ „ | 7½ „ |
| 4 | 1¾ „ | 4¾ „ | 7¾ „ |
| 5 | 2 „ | 5 „ | 8 „ |
| 6 | 2¼ „ | 5¼ „ | 8¼ „ |
| 7 | 2½ „ | 5½ „ | 8½ „ |
| 8 | 2¾ „ | 5¾ . | 8¾ „ |
| 9 | 3 „ | 6 „ | 9 „ |

ఈ రీతిగా ఉత్తమ మధ్యమ కనిష్ఠ భేదమందు 27 లింగములను వివరించి మూడునకు, నాల్గునకు మధ్యమున 3¼ 3½ 3¾ ఈ మూడు లింగములునూ, అరునను ఏడునకు మధ్యమున 7¼, 7½, 7¾ ఈ మూడు లింగములు ఇవి ఉత్తమాది భేదములకు చేరియుండదు. మాన సంఖ్యములో మాత్రమే చే మొత్తము 33 లింగములగును. ఇక ఈ 33 లింగముల నామ నిర్దేశములను చెప్పబడును.

హస్తాది నవ హస్తాంతం త్రయశ్త్రింశచ్చ నంఖ్యయా । ౯
అభిదాన క్రమం తేషాం కథయామ్య పరాజిత ।
అనుక్రమేణ ఖ్యాతాని త్రయత్త్రింశచ్చ సంఖ్యయా ।
5 భవం, భవోద్భవం, భావం, నంసారం భయనాశనం ।
4 పాశయుక్తం, మహాతేజః, మహదేవం, పరాత్పరం ।
5 ఈశ్వరం, శేఖరం, శివం, శాంతం, వై మనోహ్లాదకం ।
4 రుద్రతేజః నదాత్మకం వామదేవ మఘోరకం । ౧౦
4 తత్పురుషం తథేశానం మృత్యుంజయం చవిజయం ।
4 కిరణాక్ష మఘోరాస్త్రం శ్రీకంఠం పుణ్య వర్ధనం ।
4 పుండరీకం సువక్త్రాఖ్యం ఉమాతేజో విశ్వేశ్వరం ।
3 త్రినేత్రం త్ర్యంబకం నామ మహా కాలంచ నామతః । ౧౨
33 త్రయస్త్రింశ త్పాద వృద్ధ్యా హస్తాది నవాంతకం ।

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | హస్తము | భవ | 3¾ | హస్తము | శివం | 6½ | హస్తము | కిరణాక్ష |
| 1¼ | " | భవోద్భవ | 4 | " | శాంతం | 6¾ | " | అఘోరాస్త్ర |
| 1½ | " | భావ | 4¼ | " | మనోహ్లాదకం | 7 | " | శ్రీకంఠం |
| 1¾ | " | సంహార | 4½ | " | రుద్రతేజ | 7¼ | " | పుణ్యవర్ధన |
| 2 | " | భయనాశన | 4¾ | " | శధాత్మక | 7½ | " | పుండరీక |
| 2¼ | " | పాశయుక్త | 5 | " | వామదేవ | 7¾ | " | సువక్త్ర |
| 2½ | " | మహాతేజ | 5¼ | " | అఘోరక | 8 | " | ఉమాతేజ |
| 2¾ | " | మహాదేవ | 5½ | " | తత్పురుష | 8¼ | " | విశ్వేశ్వర |
| 3 | " | పరాత్పరం | 5¾ | " | ఈశాన | 8¼ | " | త్రినేత్ర |
| 3¼ | " | ఈశ్వరం | 6 | " | మృత్యుంజయ | 8¾ | " | త్ర్యంబక |
| 3½ | " | శేఖరం | 6¼ | " | విజయ | 9 | " | మహాకాల |

ఇదివరకు హస్తము [24 అంగుళము] 1¼ హస్తము [30 అంగుళము] ఇత్యాది రీతిగా ఆరు ఆరు అంగుళ వృద్ధి క్రమమందు లింగ మానములు చెప్పబడినవి. ఇక దీనిలో మూడు అంగుళవృద్ధి, రెండు అంగుళవృద్ధి, ఒక అంగుళవృద్ధి అనంతరము ముద్గ ప్రమాణ వృద్ధి [8 ముద్గము 1 అంగుళము] క్రమమందు ఎన్ని ఎన్ని లింగములు నిర్మించబడునో వివరించుచున్నారు. ఇన్ని సంఖ్యయు సూక్ష్మ భేదములను [మానములో] గమనించి యుండుటను చూచిన యెడల వారు ఎంత ఖచ్చితముగా లింగముల మానము నిర్ధారించుచుండిరి అనునదివ్యక్తమగుచున్నది పాఠకులకు తెలియటకొరకై సంక్షేపముగా ఆ వివరము ఇచట ఇవ్వబడినది.

పాదార్ధ వృద్ధ్యాచ పునః పంచ షష్టిశ్చ సంఖ్యయా ।
త్రికోన శతలింగాని తథాద్వ్యంగుల వృద్ధితః ।
తథైకాంగుల వృద్ధ్యాతు త్రినవత్యధికం శతం । ౧౪
ఏకార్ధాంగుల వృద్ధ్యాతు లింగ సంఖ్యా హ్యను క్రమాత్ ।
అంగుళ వేదాంశ యుక్త్యా క్రమశో వృద్ధిత స్తథా । ౧౫
ఏకోన సప్తత్యుత్తర సప్త శతాన్యను క్రమాత్ ।
తదా ముద్గ ప్రమాణేన పూర్వమాన వికల్పనాత్ ।
ద్విచత్వారింశ దుత్తర చతుర్దశ శతానిచ ।
ముద్గ ప్రమాళ లింగానాం ఏకైకే దశభేదతః ।
చతుర్దశ సహస్రాగ్రే సప్తవింశ చ్ఛతుః శతం । ౧౬
ఇతి శాస్త్రోక్తా లింగానాం మాన సంఖ్యా సమీరితా ।
యుక్త మంతర మానంచ .... .... .... .... .... .... ।

అపరాజితము 201

24 అంగుళములచే 216 అంగుళముల వరకు శిలా లింగముల అంతర మానములు చెప్పబడును పైన పాద వృదిచే [6 అంగుళము] 33 లింగములు చెప్పబడినవి

పాదార్ధ వృద్ధితో [3 అంగుళము] 8×8=64+1=65 లింగములు
ద్వ్యంగుల వృద్ధితో [2 అంగుళము] 24=12×8=96+1=97 లింగములు
ఏకాంగుళ వృద్ధితో 24×8=192+1+193 లింగములు
అర్ధాంగుల వృద్ధితో 24×2=48×8=384+1=385 „
పాదాంగుల వృద్ధితో [ 2 ముద్గము ] 24×4=96×8=768+1=769 „

ముద్గ వృద్ధితో 24×8=192×8=1536 లింగములు అవవలసినది కాని మూలగ్రంథము నా 1442 లింగములు అని చెప్పబడియున్నవి.

ఈ ముద్గమును 10 భాగముచేసి 1442×10=(14427 ?) 14420 ఇంత మానమును వర్ణించి యున్నారు ఇవి స్థావర లింగ భేదములు వీటి కనిష్ఠ మితి 24 అంగుళములు [ఒక హస్తము].

హస్తా ధధశ్చ నకర్తవ్యం లింగం శైల మయం తధా ।
తదూర్ధ్వంతు కర్తవ్యం ప్రస్తరాను క్రమేణచ । ౨

అపరాజితము 201

దీపార్ణవము 13 [13]

త్రిభాగ సహితం లింగం హస్తక్షీణం నకారయేత్ ।
హస్తానా క్షయం లింగం వృత్తాకార మశేషకం । ౭౫

కాశ్యపశిల్పము 49

ఒక హస్తముకంటె తక్కువ మానములో బ్రహ విష్ణు శివాత్మాకమైన శిలా లింగ ముస్ను [చతురస్ర, అష్టాస్రము] నిర్మించకూడదు హస్తముకంటె తక్కువ నిర్మించినచో అది [ఆ లింగము] ఆ ద్యంత వృత్తమై యుండవలయును అనగా సర్వతో భద్ర లింగము యొక్క ఆకారమై యుంటున్నది. [చత్రురస్ర అష్టాస్రరూపము ఉండదు] కాని ఈ విషయము బహులింగములో అన్వయించదు.

హస్తమానమునకంటె తక్కువ మానములో లింగమును నిర్మించిన యెడల అవి చల లింగములని పిలువబడుచున్నది. ఒక హస్తము తక్కువ మానమందు నిర్మించిన శిలా లింగములను ఆలయములో ప్రతిష్ఠించుటలేదు. శివ లింగములను నిర్మించినపుడు

త్రయోదశాంగులం లింగం శైలజంతు నకారయేత్ । ౨౫

కాశ్యపశిల్పము 49

పదమూడు అంగుళముల ఎత్తున శిలా లింగమును నిర్మించకూడదు అని నిషేధింప బడి యున్నది.

ఏకాది నవ హస్తాంతం లింగం ప్రాసాదే పూజితం ।
నవహస్తోర్ధ్వం లింగంతు ప్రాసాదేన వినార్చయేత్ । ౫

దీపార్ణవము 13

తధూర్ధ్వే నవ హస్తాంతం పూజనీయం సురాలయే ।
(నవ) దశహస్తాదితో బార్ధం ప్రాసాదేన వినార్చయేత్ । ౫

జ్ఞానరత్నకోశ

ఒక హస్తము నుంచి తొమ్మిది హస్తము వరకు శిలా లింగమున్ను ఆలయములో ప్రతిష్ఠించి పూజించవచ్చును. 9 హస్తమునకు పైన శిలా లింగమును ప్రస్తరములేని

ఆలయములో పూజించవలయును. అనగా 9 హస్తమునకు పైన శిలా లింగమును ప్రతిష్ఠ చేయునపుడు ఆ ఆలయము యొక్క గర్భ గృహమునకు పైన ప్రస్తరమును నిర్మించ కూడదు. దీనికి విమాన కలశాదులు ఉండవు. [లింగమును నిర్మించవలసిన ద్రవ్యము లను. వాటి యొక్క మాన నిర్ధారమును ఇది వరకు వివరించటమైనది. మనకు దృష్టి గోచరమగు లింగముల స్వరూపము ఒక పీఠముండి ఆ పీఠ మధ్యభాగమందు పీఠము పై భాగములో వృత్తాకారమై గుండ్రముగా శిరము [తల] ఉన్న లింగము మరియు పీఠములో అభిషేక తీర్థము ప్రవహించుట ఒక నాళము [జలధార] ఉంటున్నది. ఈ రీతిగా ఉన్న రచనలో లింగము పీఠం పైన కన్పించు వృత్తమైన భాగం మాత్రమేకాదు. అది అద్యంత లింగము యొక్క మూడు భాగములలో ఒక భాగము ఇక రెండు భాగములు మనకు కన్పించవు వాటిలో ఒక భాగము పీఠమందు ఇంకొక భాగము పీఠము కంటె క్రింద భూమిలో అధవా నంద్యా వర్తమని పిలువబడు ఒక కట్టడము [పీఠముచే క్రిందకు ఉన్న] లోనే ఉంటున్నది. ఈ మూడు భాగములు చేరి లింగమని పిలువబడుచున్నది. భూమి లోపల వున్న భాగమునకు బ్రహ్మ భాగమనియు, పీఠము లోపల ఉన్న భాగము నకు విష్ణు భాగమనియు. పైన కన్పించు వృత్త భాగమునకు రుద్ర భాగమనియు అధవా పూజ భాగమనియు చెప్పుదురు. ఇవి ఎంతంత ప్రమాణములో వుండవలెననుట ముందు సర్వ సమాధి లింగముల ప్రకరణములో చెప్పబడుచున్నది. ఇది వరకు చెప్పిన మాన ములు ఈ పీఠ రహితమైన లింగమునకు అన్వయించును.

యుక్త మానములో లింగమును నిర్మించి పీఠము మధ్యలో ఆ లింగము ఉండే రీతిగా రంధ్రముచేసి ప్రతిష్ఠా కాలములో వాటిని చేర్చుదురు. ఈ క్రమమును ముందు చెప్పబడు చున్నది. ఈ రీతిగా చేర్చిన అనంతరము ఆ రంధ్రములో ఉన్న అంతరాళ మును అష్ట బంధన అనే ఒక వస్తువు చేత బిగించుచున్నారు. ఇవి అన్నియు శిలా లింగ మునకు మాత్రమే అన్వయించును. దారుజ లింగ, మృణ్మయ లింగములలో లింగ పీఠము లను ప్రత్యేకమై నిర్మించి చేర్చడము సాధ్యమగుటలేదు. దానిచే ఆ మాన కొలతానుసారమై పీఠ లింగములను ఒకే వస్తుచేత నిర్మించవలెను. రత్నజ లింగములలోను కూడ [సాధారణ్యముగా ఇవి చల లింగములు] ప్రత్యేక ప్రత్యేకముగా నిర్మించి చేర్చుట సాధ్యము కాదు. లోహలింగములలో చల లింగములున్ను పీఠం సహితమై లింగమును ఒకటిగానే నిర్మించవచ్చును. స్థిర లింగములున్ను ప్రత్యేక ప్రత్యేకమైయు నిర్మించ వచ్చును. క్షణిక లింగములకు పీఠము యొక్క ఆవశ్యకత యుండదు.

# 12 లింగరక్షణ మరియు పరిణామములు

లింగ శరీర లక్షణ మరియు మాన స్వరూపములను ఆయా ప్రకరణములో పూర్ణమై వివరించి యున్నది. వివిధ మాన లక్షణములు అవశ్యకమా ?

ఒక వాక్యములో శులభముగా చెప్పకూడదా ? అని వేయప్రశ్న కూడ యున్నది. కారణమేమనగా

ముసయో మాన మిచ్ఛంతి అమానం నహిదృశ్యతే । ౨౦

రాజవల్లభము 4

బ్రహ్మ విష్ణులు మరియు సిద్ధ పురుషులు. ఋషులు. గ్రంధములను వ్రాసియున్నారు గనుక ఆలయ, విగ్రహము ఇత్యాదులు ప్రమాణ పురస్సరముగానే వుండవలెనని చెప్పుదురు. ఈ సృష్టి స్థితిలయ ప్రపంచమే మానానుగుణ్యమై యుంటున్నది.

మానం ధామస్తు సంపూర్ణం జగత్సం పూర్ణతా భవేత్ ।

మయ శిల్పము 22

ప్రమాణే స్థాపితా దేవాః పూజార్హా భవంతి శిలా ।

ఆలయ మరియు విగ్రహములు మానము ననుసరించి లక్షణమై యుండిన యెడల లోకము క్షేమముతో యుంటున్నది. మాన సహిత లక్షణమైయున్న విగ్రహములు పూజించుటకు అర్హతను పొంది యుంటున్నవి.

శాస్త్రమానేనయో రమ్యో సరమ్యో నాన్య యేవహి ।

నిర్దిష్ట శాస్త్ర మానము ను అనుసరించి నడవవలయును. శాస్త్ర ప్రకారముగా నడచుట దోషమగుటలేదు. శాస్త్ర మానమే ప్రధానము దాని చేత మాన, లక్షణము సౌందర్యము వీటిని మనస్సులో పుంచుకొని విధిగనుసారమై నిర్మించుట శ్రేయస్కరము.

మానాధికో నకర్తవ్యో మాన హీనం నకారయేత్ ।
శాస్త్రోక్త విధి మానేన శుభదం సర్వకర్మసు ।

అపరాజితము 112

మానం న్యూనాధికం వాపి స్వయం భూభాణ రత్నజే ।
ఘటితేషు విధాతవ్య మర్చాలింగేషు శాస్త్రతః । ౨

మానము అధికముగానే కాని మాన కొరతగానే కాని చేయకూడదు. శాస్త్రమందు చెప్పిన మానములననుసరించి నిర్మించవలెను. కాని స్వయం భూ భాణ, రత్న లింగములో

మాన లక్షణములు కదాచిత్ వ్యత్యాసమైనను దోషమని పరిగణించుటలేదు కాని ఇతరలింగములలో అనగా మానుష [మృత్, దారు, శిలా, లోహము] కృత శివలింగము లను శాస్త్ర రీతి అనుసరించి నిర్మించవలయును.

మానము వ్యత్యాసమైన యెడల

అప్రమాణే విమానే ప్రమాణ హీనం బేరం అజ్ఞానాత్ స్థాపితంచేత్
తత్తద్బేరంచ విధినా కృత్వా విధివత్ స్థాపయేత్ ।

విమానార్చనాకల్ప పేజి 66

శాస్త్రప్రమాణములేని ఆలయమును నిర్మించుటను ప్రమాణమునకు సరిగాలేని విగ్రహము లింగములను నిర్మించుట దోషకరము అజ్ఞానము చేతనో, బుద్ధిపూర్వకముగానో చేసిన యెడల దేశములో అశాంతి, క్షోభము. రాజు ప్రజలకు కష్టము అగును దానిచేత సశాస్త్రరీతిగా నిర్మించవలెను.

ఆలయస్యతు నిర్మాణం.... .... .... పూజా విధానతః ।
ఆగమోక్త విధానేన కారయేత్ ధర్మపాలకః ।

పురుషోత్తమ సంహిత

దానిచేత ఆగమ శాస్త్రరీతిగా ఆలయమును, ఆలయ విగ్రహ నిర్మాణమును, ప్రతిష్ఠా పూజాదులును చేయవలెను.

# మానములు

ఆలయమేకాని, విగ్రహమేకాని, లింగమేగాని, ఏదియు శాస్త్రోక్త మానములను సరించి నిర్మించ వలయును. ఇష్టము వచ్చిన రీతిగా నిర్మించుట దోష కరము.

ఆలయాదుల నిర్మాణమందు మూడు ప్రకారములను చూడవచ్చును. 1 ఆలయ మున్ను, దేవతా విగ్రహమున్ను క్రొత్తగా నిర్మించుట 2 ఆలయముండి మూర్తి లేని సమయమున క్రొత్త మూర్తిని నిర్మించుట 3 మూర్తి యుండి దానికి ఒక ఆలయమును నిర్మించుట.

ఒకటవ ప్రకారమందు నిర్మించు యజమాని యొక్క దేహము కొలత ప్రకారము, వానియొక్క శక్తి సౌకర్యముల ననుగుణమై ఆలయము మరియు మూర్తియొక్క కొలతలు పెట్ట వలయును. దీనికి కొన్ని మానములు చెప్పబడి యున్నవి.

రెండవ ప్రకారమందు ఆలయము యొక్క గర్భ గృహ మానము, అథవా ద్వార మానము ననుసరించి విగ్రహము అథవా లింగ మానము నిర్ధారించవలెను.

మూడవ ప్రకారమందు మూర్తి అథవా లింగము యొక్క మానముల ననుసరించి ఆలయాది మానములను నిర్ధారించుటయు.

ఇవి అన్నియు గమనించి శాస్త్రకారులు అనేక విధములైన మానములను వివరించి యున్నారు. శిల్పరత్నమనే శిల్పగ్రంథమందు, అజితాగమమనే ఆగమ గ్రంథమందు తొమ్మిది విధములైన మానములను చెప్పియున్నారు. 1 గర్భగృహమాన, 2 ద్వార మాన, 3 స్తంభమాన 4 అధిష్ఠామాన, 5 కిష్కుమాన, 6 తాలమాన, 7 మానాంగుల, 8 మాత్రాంగుల, 9 యజమాన మానము అని.

విటిలో కిష్కుమాన, మాత్రాంగుల, యజమాన మాన ఇవి మూడు ఒకే ప్రకారమైన మానములు అనగా ఆలయ మూర్తులు అన్నియు క్రొత్తగా నిర్మాణము చేయు కాలములో గమనించవలసిన మానములు.

గర్భగృహమాన, ద్వారమాన, స్తంభమాన, అదిష్ఠాన మానములు నాలుగు రెండవ ప్రకారమునకు చేరినది. అనగా మూర్తిలేని ఒక ఆలయముండి దానిలో మూర్తిని క్రొత్తగా నిర్మించు సమయములో గమనించ వలసిన మానములు.

తాల మానము మూడవ ప్రకారమునకు సంబంధించి లింగము యొక్క మానము ననుసరించి ఆలయాది మానమును నిర్ధారించుటకు అనుసరించ వలసినది.

ఈ పైన చెప్పిన 8 మానములు కాక మానాంగులమని తొమ్మిదవ మానము చెప్పబడియున్నది. ఇది శాస్త్రకారులయొక్క నియుత మానము మొదటి ప్రకార మానము 1 కిష్కుమాన [హస్తమానము] అనగా యజమానియొక్క చేత మానము. 2 మాత్రాంగుల మనుట యజమానికి కుడి హస్త మధ్యమ వేళ్ళుయొక్క వెడల్పు ఒక అంగుళమని పరిగణించుటము 3 యజమాన మాన మనుట యజమానుని ఎత్తు ప్రకారము మూర్తి లింగము ఆలయాదులను నిర్మించుట.

రెండవ ప్రకారము మానములో గర్భ గృహమానము ద్వారమాన. స్తంభమాన అదిష్ఠానమానములు ఇవి ఆలయముయొక్క నాలుగు భాగములును అనుసరించి దానికి అనుగుణముగా మూర్తి అథవాలింగముయొక్క మానమును నిర్ధారించుట,

మూడవ ప్రకారము తాలమానమనునది లింగము ఎంతఎత్తు ఉన్నప్పటికిని దానిని 124 భాగములు చేసినయెడల ఒక భాగమగు కొలతను 1 అంగుళమని పరిగణించుట దీనికి దేహ లబ్ధాంగులమని పేరు,

చివర మానాంగులమనుట' గోధుమయొక్క వెడల్పును యవమని చెప్పబడు చున్నది. 8 యవములకు (ముగ్గములని చెప్పవచ్చును) 1 అంగుళమని పరిగణించుట,

ఈ రీతిగా అనేక విధమైన మానములను చెప్పియున్నారు అగస్త్య నకలాధి కారము ఆను గ్రంథములలో పాదమాన, మూలబేరమాన అని ఇంక రెండుమానములు పాదమానము మొదటిప్రకారమునకు అనగా యజమానుని పాదముయొక్క కొలత ప్రధానమైయుండి దానినుంచి అన్ని కొలతలను చేయుట మూలబేర మానము మూడవ ప్రకారమునకు చేరినది మూల విగ్రహముయొక్క ఎత్తును అనుసరించి దానికి తగిన రీతిగా ఇతర మానములను నిర్మించుటము.

ఆయా ప్రకారములైన కొలతలలో ఏదైనా ఒక కొలతను అనుసరించి ఆలయాది నిర్మాణములను చేయవలెను. ఈ మానముల ననుసరించి క్రొత్తగా కొలతలను నిర్దేశించు విధానములు శిల్పశాస్త్రమందు వివరించియున్నవి. సరియైన శిల్పితో ఆలోచించి శాస్త్ర సమ్మతమైన ఆలయముయొక్క నిర్మాణమును చేయవలెను. శాస్త్రవ్యతిరిక్తమై అథవా ఇష్టమువచ్చిన మానములతో మూర్తి, ఆలయాదులు నిర్మించిన యెడల అవేశాశ్వతమై పూచ్చితమగుటలేదు, కాక యజమానునకు, పూజకునకు. ప్రజలకు, రాజునకు, రాష్ట్రము నకు హానికలుగు అవకాశమున్నది అని శాస్త్రములలో చెప్పబడుచున్నది.

ఈ మానములను సూక్ష్మముగా ముందు వివరించుటయైనది. వివరములను మూలగ్రంథములలో చూడవచ్చును.

# గర్భమానేన లింగమానము

1 గర్భమానేన లింగమానము :

ప్రాసాదగర్భవిస్తారం సూత్రేణ సంమితం తథా !
గర్భవిస్తార పంచాంశ త్రియంశే నోత్తమాం విదుః !
గర్భంతు నవధాకృత్వా పంచ భాగంతు మధ్యమం !
అధమం గర్భమానా దర్ధం త్రివేదంతు ప్రమాణతః !
కనిష్ట జ్యేష్టయోర్మధ్యే గర్భేష్టాంశ కృతేనతి !
ప్రోక్తంతు నవధామానం తేషాం కార్యంయదృచ్ఛయా !
అథవాన్య ప్రకారేణ గర్భంతు నవధాపునః !
ఉత్తమం త్రీణిచోక్తాని మధ్యమం త్రీణిజ్యాదిశేత్ !
అధమం త్రీణిచోక్తాని నవభేద ము దాహృతం !

సుప్రభేధము 33

దీపార్ణవము 13 [36,37] అపరా 202 [10,12]

గర్భగృహ వెడల్పును అయిదు భాగములుచేసి దానిలో మూడు భాగముల ఎత్తు లింగమున్ను స్థాపించుట ఉత్తమమనియు, తొమ్మిది భాగములుచేసి దానిలో అయిదు భాగముల ఎత్తు లింగమున్ను స్థాపింపుట మధ్యమనియు, విస్తారముయొక్క సగమంత ఎత్తు లింగమును స్థాపింపుట కనిష్ఠమనియ చెప్పబడుచున్నది కనిష్ఠ మరియు జేష మానముల మధ్యమందు 8 భాగములు చేసినయెడల తొమ్మిది కొలతలు అగును. వీనిలో మూడు ఉత్తమము. మూడుమధ్యమము మూడు అధమ మానములగును.

సార్వదేశిక లింగాని కథయంతి గర్భమానతః !

దీపార్ణవము 13

సర్వతోభద్ర, సార్వదేశిక, లింగములను సాధారణముగా గర్భమానమందే నిర్మించు పద్ధతియున్నది.

1 ఉదా—ఇపుడు గర్భగృహముయొక్క వెడల్పు 90 అంగుళము యున్నది అని భావించిన యెడల దాని 3/5 అనగా 54 అంగుళఎత్తు లింగము ఉత్తమము. 5/9 భాగమనగా 50 అంగుళఎత్తు లింగము మధ్యమము కనిష్ఠము విస్తారార్ధ అనగా అర్ధ భాగము 45 అంగళఎత్తు లింగము అధమము. ఈ 45 అంగుళముచే 54 అంగుళము వరకు మధ్యఉన్న తొమ్మిది అంగుళములను ఎనిమిది భాగముగా చేసినయెడల ఒక్కొక్క భాగమునకు 1 1/8 అంగుళమగును. ఈ రీతిగా 45, 46 1/8, 47 2/8, 48 3/8, 49 4/8, 50 5/8, 51 6/8, 52 7/8 54 అంగుళ రీతిగా 9 లింగ ములగును వీటిలో ఆఖరు మూడు ఉత్తమ మనియు. మధ్యమ మూడు మధ్యమ మనియు. మొదటి మూడు అధమ మనియు పిలువబడుచున్నది.

వీటిలో ఏదైన ఒక మానమందు లింగముయొక్క ఉత్సేధమునుధరించవచ్చును ఈ ఉత్సేధములో బ్రహ్మ విష్ణు రుద్ర భాగములు అంతర్గతమైయున్నవి అనుట జ్ఞాపక ముందు వుంచవలెను

2 ద్వార మానేన లింగమానము

శుద్దద్వారోదయం నందభాగం కృత్వావిశాలకం!
ఏకైకం లింగతుంగం కన్యస్యాదీని పూర్వవత్!
ప్రత్యేంకతు త్రిధామానం చాష్టాదశవ తుంగవరం!
మనసారే 52

ద్వారముయొక్క [గర్భగృహ ద్వారము] ఎత్తును తొమ్మిది భాగములుచేసి ఒక్కొక్క భాగమునకు సమానమైన తొమ్మిది లింగములను చేయవచ్చును. అనగా ద్వారముఎత్తు 54 అంగుళమున్నది అని భావించినయెడల 6, 12, 18, 24, 30, 36 42, 48, 54 అంగుళము ఈ రీతిగా తొమ్మిది మానములగును. వీటిలో మొదటి మూడు మానములు కనిష్ఠము మధ్యమ మూడు మానములు మాధ్యమము అఖరు మూడు మానములు ఉత్తమము.

అథవాద్వార విశాలమును [ద్వారముఎత్తు లో [అర్ధము] నగము ఉంటున్నది.] తొమ్మిది భాగములుగాచేసి ఒక్కొక్క భాగము యొక్క మానానుసారమై తొమ్మిది లింగములగును. ద్వారమానరీత్యా 18 లింగములను నిర్మించవచ్చును.

అదిష్ఠానసమశ్రేష్ఠ త్రిపాదం మధ్యమం భవేత్ !
తదర్ధం కన్యసంప్రోక్తం త్రివిధం లింగ మీరీతం !
అథవానవభాగంస్యా నవలింగ ముదాహృత్ !
కన్యస్యాదుత్తమాంతం స్యాత్ప్రత్యేకం పూర్వవత్ భవేత్

మానసారము 52

అధిష్ఠాన ఎత్తుకు సమమైన ఉత్సేధము కలిగిన లింగము ఉత్తమము అధిష్ఠానముయొక్క 3/4 భాగము ఎత్తు లింగము మధ్యమము అధిష్ఠానముయొక్క 1/2 భాగము ఎత్తు లింగము కనిష్ఠము.

రెండవ విధము:- అధిష్ఠాన ఎత్తును తొమ్మిది భాగముచేసి ఒక్కొక్క భాగముయొక్క మానములో లింగములను నిర్మించవచ్చును. వెనుక చెప్పినరీతిగానే మొదటి మూడు లింగములు కనిష్ఠము. మధ్యమ మూడు లింగములు మధ్యమము, ఆఖరు మూడు లింగములు ఉత్తమము

పాదోదయం నవాంశంతు నవధా లింగమానకం !
తదేవంచైక భాగేతు చతుర్భాగ విభాజితే !
ఏకైకం లింగ తుంగంస్యాత్ పీఠం లింగతుంగకం !
కన్యస్యా దుత్తమాం తంస్యాత్సర్వం ప్రాగుక్తవన్నయేత్ !

మానసారము 52

స్తంభమనగా గర్భగృహములోవున్న నిలిచియున్న స్తంభముయొక్క ఎత్తు 9 భాగములు చేసి ఒక్కొక్క భాగమానమునకు సమమైన ఎత్తువున్న తొమ్మిది లింగము లగును. మరియు ఈ ఒక్కొక్క లింగముయొక్క అంతరమును నాల్గు నాల్గు భాగములు చేసినయెడల 36 లింగములగును.

౫ ౬ హస్తమాన - అంగుల మానము

హస్తమాన అంగుల మానముల రీతిగా అగు లింగభేదములను ఇకముందు ఆయాప్రకారములో వివరించబడుచున్నది.

౭ యజమానేన లింగమానము

యజమానస్య మేఢ్రాంతం, నాభ్యంతం, హృదయాంతకం ।
స్తనాంతం, బాహుసీమాంతం, హన్వతం, నాసికాంతకం । ౭౧
నేత్రాంతం సమతుంగం స్యాత్ నవలింగోదయం భవేత్ ।
అధవా తుంగమానేతు నవభాగ విభాజితే ।
ఏకైకం లింగతుంగం స్యాత్ కన్యస్యాది త్రయంత్రయం ।
నవత్యంశ విధలింగం యజమాన వశా ద్విదుః । ౭౨
మానసారము 52

యజమాని దేహముయొక్క మధ్యభాగ. నాభి, హృదయ, స్తన, భుజము. గడ్డము, నాలిక. నేత్రము మరియు పూర్ణ ఎత్తు ఈ రీతిగా తొమ్మిది అంగములకు సమమైన ఉచ్ఛేధము కలిగిన లింగములు తొమ్మిది విధము. గాక యజమానుని పూర్ణ ఎత్తును తోమ్మిది భాగములు చేసి ఒక్కొక్క భాగమందు తొమ్మిది భాగములు విభాగించినయెడల 9X9 - 81 లింగమానములు పైన చెప్పిన అంగ సమమైన 9 లింగములు చేరి 90 విధ లింగములగును. ఇచ్చట చెప్పిన 81 లింగములలో చిన్నచిన్న కొలతయొక్క 27 లింగములు కనిష్ఠమనియు, మధ్యను కొలత 27 లింగములు మధ్యమనియు హెచ్చుకొలత ఉన్న 27 లింగములు ఉత్తమమనియు పిలువబడుచున్నది.

—: ౦ :—

# 13 దివ్యాది లింగ భేదములు

లింగములలో చలమే కాని. అచలమే కాని ఈ క్రింద కనిపించు రీతిగా అనేక విధములు కలవు.

దివ్యం స్వాయంభువం పూర్వం ఉత్తమోత్తమ మేవచ ।
దైవతం గాణవంప్రోక్తం మధ్యమోత్తమ మేవచ ।
ఆసురం సురలింగంచ ఆర్షం చైవాధమోత్తమం ।
మానుషం లింగమేవోక్తం మధ్యమం త్వధమం భవేత్ ।
భాణ లింగస్య నైవోక్తం లక్షణంతు వినర్ధయేత్ ।

సుప్రభేదము 33

బ్రహ్మ విష్ణ్వాదులచే పూజింపబడినది దివ్యలింగమనియు. తనంతట తానే ఉద్భవించిన లింగము స్వాయంభువ లింగమనియు. పురాతనమైన లింగము పూర్వ అథవా పురాణ లింగమనియు పిలువబడుచున్నవి. ఇవి ఉత్తమోత్తమ లింగములు. దేవతలచే పూజింపబడిన దైవత లింగములు గణాధిపతిచే అర్చింపబడిన గాణవ లింగములూ ఇవి మధ్యమోత్తమ లింగములు.

అసురులచే పూజితమైన అసుర లింగములు, సురలచేత పూజితమైన సుర లింగములూ, ఋషులచే పూజింపబడిన ఆర్షలింగములు, అధమోత్తమని పిలువబడుచున్నది.

మనుష్యులచే నిర్మితమై ప్రతిష్ఠింపబడి పూజింపబడు లింగములు మానుష లింగములు ఇవి మధ్యమాధమ లింగములని పిలువబడుచున్నవి. భాణలింగ మనునది పూర్వముమలో బాణాసురుని సంహారము చేయుటకు మహేశ్వరుడు విడిచిపెట్టిన అగ్ని

బాణము జ్వలించుచు వచ్చి బాణాసురునికి వరలబ్దమై త్రిపురములను మూడు తునకలుగా కత్తిరించినది. ఆ మూడు తునకలు విన్నాభిన్నమై తునకలుతునకలుగా మూడుచోట్ల పడినవి. ఒక భాగము శ్రీశైల క్షేత్రమందును, ఇంకొక భాగము అమర కంఠక క్షేత్ర మందును ఇంకొక భాగము నర్మదా నదీ తీరములోను పడి తునకలై పోయినవి. అవట ఒక్కొక్క స్థలమందు కోటి కోటి లింగము లయినవి అని అపరాజిత పృచ్ఛా అనే శిల్ప గ్రంధములో 205 సూత్రము [1–26] అధ్యాయములో చెప్పబడినది ఈ బాణ లింగమునకు అకారము లక్షణములు లేవు. ఈ పై చెప్పిన క్షేత్రములలో దొరకు ఈ శిలలను చల లింగములుగా పెట్టి పూజించుట కనబడుతున్నది. వీటియొక్క వర్ణము, ప్రమాణము, ఆకారము ఇలాగా ఉండవలయునను నియమము లేదు.

స్వాయంభువాది లింగములలో మానుష లింగములను విడిచిపెట్టి మిగతా లింగ ములు వెనుక దేవతలు సురలు మొదలయినవారిచే పూజింపబడి అనూచానమై [పరం పరగా] నడచి వచ్చుటచే వాటి విషయమైయు, అకార, మాన, లక్షణాదులున్ను పరిగ ణించనక్కరలేదు ఇపుడు వున్న దివ్యక్షేత్రములలో కనపడు లింగముల మూలకధలను అచ్చటచ్చటకు చేరిన స్థల పురాణమూలకంగా నిర్ధారించి తెలియవలసినది.

ఈ పుస్తకములో పూర్వమే తెలియపరచిన ద్రవ్య భేద, మాన భేదములు ముందు చెప్పబడు లింగ భేదములు, శిరోవర్తనము బ్రహ్మసూత్ర, పీఠము మొదలయిన లక్షణ మన్నియు కేవల మానుష లింగమునకు మాత్రమే అన్వయించుచున్నది. ముందు వివరించు విషయమందు ఆగమ శాస్త్రయుక్తికును శిల్ప శాస్త్రయుక్తికును అల్ప స్వల్ప వ్యత్యాసములు కనబడుతున్నవి. అట్టి ప్రసంగములలో ఆగమశాస్త్ర వచనములను అనుస రించటము యుక్తమని కనబడుతున్నది. ఏలనగా శిల్పశాస్త్రము రచనా కౌశల్యమును మాత్రమే చెప్పుతున్నది. కాని ఆగమశాస్త్రము రచనా, నిర్మాణములు ముగించినతరువాత చేయవలసిన ప్రతిష్ఠా ఉత్సవ పూజాదులను వివరించుచున్నది. ఈ విధానములు 28 ఆగమములలో ఏదైన ఒక ఆగమము ననుసరించి నడయవలసి యుండుట చేత వ్యత్యాసము కనబడిన స్థలములలో అగమోక్త విధి వాక్యములను అనుసరించి నడచుట సమంజసము.

ఈ పుస్తకము వ్రాయుటకు అజితాగమ గ్రంధమున్ను ప్రధానముగా ఆరంభించి ప్రసంగవశాత్తు కారణాగమ, సుప్రభేద, కామికాగమ వాక్యములనూ ఉదహరించి సాధ్యమైన స్థలమంతు సమన్వయపరచు ప్రయత్నమును చేసియున్నాను.

# 14 లింగ ఆకార దేవతాంశము

సర్వార్థ సాధనం లింగం బ్రహ్మ విష్ణు శివాత్మకం ।
అధోమధ్యోర్ధ్వ భాగంతు బ్రహ్మ విష్ణు శివాత్మకం ।
[మత్సపురాణ, మయమత 33, కాశ్యప శిల్పా 49,
సుప్రభేద 33]

లింగ ఉత్సేధమందు మూడు భాగములున్నవి. అధోభాగము బ్రహ్మాంశమనియు, మధ్యభాగము విష్ణ్వంశమనియు, ఉర్ధ్వభాగము రుద్రాంశమనియు పిలువబడుచున్నది.

చతురస్రం భవేత్ బ్రహ్మం అష్టాస్రం వైష్ణవం భవేత్ ।
వృత్తం శైవమితి ప్రోక్తం ఏవంస్యాత్ త్రిభాగికం ।
సుప్రభేదము 33, దీపార్ణవము 13 [19]

అజ హరహరి భాగం వేదవ స్వస్ర వృత్తకం
అజితాగమము 4

బ్రహ్మభాగము చతురస్రముగాను, విష్ణుభాగము అష్టాస్రముగాను రుద్ర భాగము వృత్తభాగముగాను వుంటున్నది.

| దేవతాంశము | — | సంజ్ఞా | — | ఆకారము | — | స్థానము |
|---|---|---|---|---|---|---|
| రుద్ర | – | పురుష | – | వృత్త | – | ఉర్ధ్వ |
| విష్ణు | – | స్త్రీ | – | అష్టాస్ర | – | మధ్య |
| బ్రహ్మ | – | నపుంసకము | – | చతురస్ర | – | అధోభాగ |

లింగము ఎత్తులో మూడు భాగములు ఉన్నవనియు, వాటి ఆకారము ఈ రీతిగా ఉండవలయుననియు, వాటి సంజ్ఞ స్థానములు ఇవ్విధములు అని పైన చెప్పబడినది. ఈ భాగముల కొలత వ్యత్యాసముచే ముందు చెప్పబడు సర్వసమాధి లింగ భేదములు నిర్ణయింపబడును.

ఇక లింగము వెడల్పును ఎత్తుకు అనుగుణమై వర్ణాశ్రమ భేదములకు అనుసారముగాను నిర్ణయించవలెను. వాటిని ఈముందు ఆయా ప్రకరణములో వివరించబడును.

సమఖండం వర్ధమానం శైవాధిక్యం త్రిభాగికం ।
వర్ణానాం బ్రహ్మణాదీనాం క్రమేణ పరి కల్పయేత్ ।

కామికాగమము 1-62 [28]
శిల్పరత్నము 2 [75] అజితాగమము –
పూర్వకారణము 9 [107]

సర్వసమ, వర్ధమాన. శివాధిక, త్త్రైరాసిక, లింగములు క్రమముగా నాలుగు వర్ణములవారికిని చెప్పబడినవి. ఇదే అర్థము కలిగిన వాక్యములు శిల్పరత్న. కాశ్యపశిల్ప. మయమత, మానసార, మొదలయిన శిల్పగ్రంధములలోను అజితాగమ. సుప్రభేద, కారణాగమ మొదలయిన అగమ గ్రంధములలోను వ్రాసియున్నవి. మొదట వివరించిన ప్రకారముగా ఈ సర్వసమాధి భేదములు లింగము ఎత్తుయొక్క వ్యత్యాసముచే ఏర్పడుచున్నవి.

ఇక వెడల్పు వ్యత్యాసముచే ఉత్తమోత్తమ. ఉత్తమ, మధ్యమ, మరియు అధమమని నాలుగు భేదములు చెప్పబడి అవి కూడా క్రమముగా చాతుర్వర్ణ్యముల వారికి అన్వయించునని వివరించుచున్నారు.

ఇవికాక లింగ శిరోభాగమును వర్తులమై చేయు పక్రియ అనగా శిరోవర్తనమును నిర్మించునపుడు త్రపుషాకార, ఛత్రాకార, అర్ధచంద్రాకార, కుక్కుటాండాకారమనే నాలుగు విధములను చెప్పి ఇవికూడా క్రమముగా విప్రాది చాతుర్వర్ణ్యములవారికి అన్వయించునని చెప్పబడినది.

ఇపుడు ఈ భేదములకును విప్రాది చాతుర్వర్ణ్యములకును సంబంధము కల్పించి యున్నదానిని వివరించుచున్నాము.

| | బ్రాహ్మణ | క్షత్రియ | వైశ్య | శూద్ర |
|---|---|---|---|---|
| ఉత్సేధక్రమము | సర్వసమ | వర్ధమానము | శివాధికము | స్వస్తికము |
| విష్కంభక్రమము | ఉత్తమోత్తము | ఉత్తమము | మధ్యమము | అధమము |
| శిరోవర్తనము | త్రపుషము | ఛత్రాకారము | అర్ధచంద్రాకారము | కుక్కుటాండము |

ఈ రీతిగా ఆయా వర్ణములవారికి యుక్తమైన లింగములు అన్వయించున్నవి.

యుక్తలక్షణమైన లింగములను పూజించుటకు ఈ చాతుర్వర్ణ్యము వారికి అధికారమా? అథవా నిర్మించుటకు అధికారమా? అని ఇచట ఆలోచింపవలసి యున్నది శాస్త్రముల ఉక్తికి ఈ రెండు విధముగాను అర్థము చేయవచ్చును.

వెనుక మానములను వివరించునపుడు దేహమాన, యజమాన, మాత్రాంగుళమానమని ఉంటున్నది. ఆలయ నిర్మాణము చేయు అధికారి యొక్క దేహమునకు అనుసారముగా ఉండవలెనని చెప్పబడినది. దానిచే ఇచ్చటను కూడ ఈ నాలుగు వర్ణములవారు ఆలయము నిర్మించినయెడల ఆయా లక్షణములు కలిగిన లింగములను నిర్మించవలయునని అర్థము చేయుట యుక్తము. కాక నాలుగు వర్ణములవారు పూజకు అర్హులు అని అన్వయించుచున్నది, అని అర్థము చేసిన యెడల

వర్ధమాన శివాధిక్యే సర్వ జాత్యర్హకే మతే
కామికాగమ

చతుర్ణామపి వర్ణానాం వర్ధమాన శివాధికే
అజితాగమము

వర్ధమాన శివాధిక్యమందు అన్ని వర్ణములవారికిని అర్హత యున్నది అనగా వెడల్పు విషయములలోను, శిరోవర్తనములలోను, ఈ విధమైనవి కల్పములు చెప్పబడి

నందున ఇతర వర్ణములవారికి ఈ లింగముల వెడల్పు శిరోవర్తనములు ఏ రీతిగా ఉండవలెననే విషయమందు చిక్కు సమస్య ఏర్పడుచున్నది. దానిచే ఈ వర్ణ వ్యవస్థయు కేవలము అధికారులకు మాత్రమే చెప్పబడినది అని గ్రహించుట యుక్తము.

ఆగమ మరియు శిల్ప గ్రంధములు రచించిన కాలములో చాతుర్వర్ణ్యము సువ్యస్థితమై ఆచరించబడుచుండినది ఒక వర్గమువారు ఇంకొక వర్గములవారి ఆచరణను అతిక్రమించి చేయుటలేదు. తమతమ వర్ణమునకు విహితము అయిన కర్మములను ఆచరించి ముక్తి పొందుచుండిరి. అయినను ధార్మిక క్రియలను లోక క్షేమార్థమై చేయుచుండిరి. ఆ రీతిగా అందరు ఆలయ తటాకాది నిర్మాణములను చేయుచుండిరి. పూజ, భగవద్ధ్యాన, తపస్సు మొదలయిన కర్మములు బ్రాహ్మణులకు విహితమైయుండి వారి యోగ క్షేమమును ఇతర వర్ణములవారు చూచుచుండిరి. ఈ పూజా మొదలయిన కార్యములకు ఇతర వర్గములవారు రాకుండిరి. తమతమ వర్ణోచిత కర్మములలో నిరతులైయుండి అత్యున్నతిని బడయుచుండిరి. దానిచేత అన్ని ఆలయములలోను బ్రాహ్మణులే పూజకు అర్హులనుట నిర్వివాదమైన విషయము. ఇతర వర్గములవారు ధార్మిక ప్రవృత్తిచే ఈ నిర్మాణాదులను చేయుచుండిరి గనుక ఈ లింగభేదములలో యుక్తమైన చాతుర్వర్ణ్యము అధికారులయొక్క విషయములో అనగా ప్రతిష్ఠాదులను చేయు యజమానుల విషయములో చెప్పబడినదే కాని పూజార్థుల విషయమై కాదు అని దృఢముగా నమ్మవలెను

ఎచ్చటెచ్చట ఇకముందు ఈ చాతుర్వర్ణ్య శబ్ద ప్రయోగము వాడబడుతున్నదో అచ్చటచ్చట యజమానుని గురించి చెప్పబడినదని గమనించవలసినది. ఈ రీతిగా మనము సవినయముగా విజ్ఞాపించుచున్నాము.

—: o :—

# 15 లింగ ప్రభేదములు

సమలింగం వర్ధమానం శైవా ధిక్యంచ స్వస్తికం ।
సార్వదేశిక లింగంచ త్రైరాశిక సహస్రకా । ౨౯
ధారాలింగంచ శైవేష్యం ముఖలింగ ముదాహృతం ।
లింగంచ దశభేదం స్యాంన్మానుషే తత్ప్రకీర్తితం । ౩౦
లింగార్ణవ - దీపార్ణవము 13

సమలింగ, వర్ధమాన, శివాధిక, స్వస్తిక, సార్వదేశిక, త్రైరాశిక, సహస్రలింగ, ధారాలింగ, శైవేష్య ?, ముఖలింగము అని 10 భేదములు ఉన్నవి.

సమలింగం వర్ధమానం శైవాదిక్యంచ స్వస్తికం ।
సర్వతో భద్రలింగంచ సార్వదేశిక మేవచ
ధారలింగం ముఖలింగం లింగమష్ట విధం భవేత్
కాశ్యప శిల్పము 49

పైన చెప్పినదికాక ఈ శ్లోకమందు సర్వతో భద్రలింగము చెప్పబడి యున్నది. శైవేష్య లింగముయొక్క లక్షణము ఎచ్చటను చెప్పబడుటలేదు. గనుక ఇకముందు క్రమముగా ఈ పదివిధ లింగభేదములు వివరించబడుతున్నవి.

వీటిలో మొదటి నాల్గు లింగములు చతురస్రమైన బ్రహ్మభాగము, అష్టాస్రమైన విష్ణుభాగము, వృత్తమైన రుద్ర భాగములచే కూడియున్నవి. ఒక్కొక్క భాగముయొక్క ఉత్సేధ [ఎత్తు] వ్యత్యాసముచే ఈ నాలుగువిధ వ్యత్యాసములు ఏర్పడుమన్నవి. వెడల్పు క్రిందనుంచి పైనవరకు సమానము వీటిని అంశత్రయ విశిష్టలింగమని పిలవబడును.

(౫) సర్వతో భద్ర లింగము అధ్యంతవృత్తమైయు, (౬) సార్వదేశిక లింగము అధ్యంత వృత్తమైయుండి దానిలో బ్రహ్మ విష్ణు రుద్ర భాగములను వ్యత్యాసమైన కొలత ప్రకారము గుర్తించి బ్రహ్మ భాగమంత భూమిలోను విష్ణుభాగము పీఠములోను రుద్ర భాగమును పీఠముపైన కనిపించు రీతిగా ప్రతిష్ఠింపబడును (౭) ధారాలింగము రుద్ర భాగమందు పట్టికలను కల్పించుటచేతను, (౮) సహస్రలింగము ఆ పట్టికలో చిన్నచిన్న లింగాకారములను కల్పించుటచేతను సహస్రలింగమని పిలువబడుచున్నది (౯) త్రైరాసిక లింగము సర్వతో భద్ర మరియు సార్వదేశిక లింగములలో విష్కంభ వ్యత్యాసముండదు ఈ రెండును చేర్చి అనగా ఆధ్యత వృత్తము మరియు విష్కంభములో వ్యత్యాసము చేసి విశేష కల్పనతో త్రైరాసిక లింగమగు రీతిని చెప్పుదురు. (౧౦) ముఖలింగము అనేది రుద్రభాగమందు ఏక, త్రిముఖ. చతుర్ముఖాది క్రమములో ముఖములను మాత్రమే కల్పించి చూపించుట యగును.

౧ సర్వసమ ౨ వర్ధమాన ౩ శివాధిక ౪ స్వస్తికము

దేవతాంశ మాన లక్షణాది ———

ఇపుడు పైన తెలిపిన దేవతాంశత్రయ విశిష్ట లింగములందు సర్వసమ, వర్ధమాన, శివాధిక, స్వస్తిక లింగముల సామాన్య లక్షణమును మొదట వివరించి అనంతరము ప్రత్యేక ప్రత్యేకమై ఒకటొకటిని వర్ణించుచున్నాము.

౧ అజ హరిహరభాగం వేదవస్వస్ర వృత్తం ।
త్రివిధమపి సమంన్యాత్ ఉన్నతే స్యాద్యలింగే ।

౨ బ్రహ్మభాగాధి కోభాగ విష్ణుభాగో విశేషతః ।
త ర్దధ్వాం రుద్ర భాగస్తు.... .... .... .... ....

౩ సమభాగాః .... .... .... .... .... రుద్రభాగో విశేషతః
శివాదిక్యంతు .... .... .... .... .... .... .... .... ।

౧ సర్వసమ లింగములో బ్రహ్మ విష్ణు రుద్రాంశముల ఉత్సేధము సమమై యుంటున్నది.

౨ వర్ధమాన లింగములో బ్రహ్మభాగము కంటె ఒక అంశము హెచ్చుగ విష్ణు భాగము, విష్ణుభాగముకంటె ఒక అంశము హెచ్చుగ రుద్రభాగము యుంటున్నవి.

౩ శివాధిక లింగనులో బ్రహ్మ విష్ణు భాగములు సమానమైయు, రుద్రభాగము ఒక అంశము హెచ్చుగాను ఉంటున్నది.

౪ స్వస్తిక లింగములో బ్రహ్మభాగము కంటె ఒక అంశము హెచ్చుగ విష్ణు భాగము, విష్ణుభాగమునకు సమానముగా రుద్రభాగము యుంటున్నది ఈ అంశములు ఎంతెంత ఉండవలెననుట శాస్త్రములో ఈ క్రింద కనపరచిన రీతిగా చెప్పబడుతున్నది.

అజ హరహరి భాగం వేదవస్వ్రన వృత్తం ।
త్రివిధమపి సమం స్యాత్ ఉన్నతే నాద్యలింగే ।
త్రిగుణిత వసుభాగే తత్రయం వర్ధమానం ।
మునివసు నవభాగం బ్రహ్మ విష్ణ్వీశ్వరాణాం ।
ఉచ్ఛ్రయేకృత దశాంశకే భవేత్ వహ్నివాయు నభవేద భాగికం ।
యత్రపద్మజ హరీశ్వరాత్మకం లింగమాత్రమిహ తచ్ఛివాధికం । ౮౫
ఆత్మాయామే రుద్రభాగే గుణాంశో వైరించిస్స్యాత్ వైష్ణవోవేదభాగః ।
శైవస్తద్వస్త్వస్తికే స్మింస్తురీయే లింగే ప్రోక్తోహ్యేవమేవ క్రమేణ । ౮౬
అజితాగమ 4
దీపార్ణవము 13 [3–5) శిల్పరత్నము [2] మానసారము 52 [56]
స్రపభేదము 33 [86-87]
కాశ్యప శిల్పము 49 [125]

ఈ శ్లోకముల ప్రకారము ఈ క్రింద పట్టిలో మానములు ఇవ్వబడినవి.

| దేవతాంశము | బ్రాహ్మణ సర్వసమ | క్షత్రియ వర్ధమాన | వైశ్య శివాధిక | శూద్ర స్వస్తిక |
|---|---|---|---|---|
| రుద్రభాగ వృత్తము | 1 | 9 | 4 | 4 |
| విష్ణుభాగ అష్టాస్రము | 1 | 8 | 3 | 4 |
| బ్రహ్మభాగ చతురస్రము | 1 | 7 | 3 | 3 |
| మొత్తం అంశములు | 3 | 24 | 10 | 11 |

(౧) సర్వసమ లింగము :– వెనుక పట్టీలో చెప్పబడినరీతిగా ఏదైన ఒక మానమును అనగా యజమాన మానమో, గర్భగృహ మానమో, మానాంగులాది మానమో కాని ఒకమానము ననుసరించి లింగముయొక్క మొత్త ఉత్సేధమును నిర్ధారించవలెను. ఆ వుత్సేధమును సమముగా మూడు భాగములుగా చేసి క్రింద బ్రహ్మభాగమును చతురస్రముగాను, మధ్య విష్ణుభాగమును అష్టాస్రముగాను, ఊర్ధ్వ రుద్ర భాగమును వృత్తముగాను నిర్మించవలయును. ఇది సర్వసమ లింగము.

(౨) వర్ధమాన లింగము :– [అజితాగమ 4] వెనుక చెప్పిన రీతిగా లింగముయొక్క మొత్తం ఎత్తును 24 భాగములుగా విభాగించి బ్రహ్మభాగమును 7 అంశములుగాను, విష్ణు భాగమును 8 అంశములుగాను, రుద్ర భాగమును 9 అంశములుగాను కల్పించవలసినది.

(౩) శివాధిక లింగము :– పట్టిలో కనపరచిన రీతిగా మొత్తమెత్తును 10 భాగములుగా చేసి బ్రహ్మభాగమును 3 అంశములుగాను, విష్ణుభాగము 3 అంశములుగాను, రుద్రభాగము 4 అంశములుగాను కల్పించవలసినది.

(४) స్వస్తిక లింగము :- పట్టిలో కనపరచిన రీతిగా మొత్తమెత్తును 11 భాగములుగా విభాగించి బ్రహ్మభాగము 3 అంశములుగాను, విష్ణుభాగము 4 అంశములుగాను, రుద్రభాగము 4 అంశములుగాను కల్పించవలయును.

శిల్ప రత్నమందు, సుప్రభేదాగమమందును, స్వస్తికలింగ విషయముగా ఏమియు చెప్పబడలేదు.

| వికల్పమానము | ౧ వర్ధమానము | ౨ శివాధికము |
|---|---|---|

ఇదివరకు సర్వసమ, వర్ధమాన శివాధిక, స్వస్తిక లింగములకు సిద్ధాంతమైన మానమును వివరించబడినది ఇపుడు వాటిలో విశేష కల్పనముగా వికల్పమానమును తెలియపరచుచున్నారు.

"చతుర్ణామపి వర్ణానాం వర్ధమానం శివాధికే"

అని చెప్పబడియున్నది కనుక వర్ధమాన శివాధిక లింగములలో విశేష ప్రకారముగా నాల్గు కొలతలు కనబడుచున్నవి ఆ నాలుగు కొలతలలో నిర్మించవచ్చునని చెప్పబడు గ్రంథముల శ్లోకములను ఇచట వివరించి యున్నాము. ఈ నాలుగు మానములు నాలుగు వర్ణములవారికిని అన్వయించును.

౧ వర్ధమానము - కాశ్యప శిల్పము 49 [126]

భానుద్వ్యంశే తథాయామే సప్తాంశం చతురస్రకం
అష్టాంశం చాష్టకోణంచ నవాంశం వృత్తము చ్యతే
[24 భాగములో 7-8-9]

షట్సప్త వసుభాగంవా 21 భాగములో 6-7-8
పంచషట్ సప్తమేవవా 18 భాగములో 5-6-7

చతుఃపంచ షడంశంవా 15 భాగములో 4-5-6
వర్ధమానం చతుర్విధం ఈ రీతిగా వర్ధమాన లింగము నాల్గు విధములు

మయమతము 33 [76-77]

వేదభూతరస భాగకై రథో 15 భాగములో 4-5-6
భూతషణ్ముని పద్దై రథపదం 18 భాగములో 5-6-7
షట్‌సప్తవసు భాగకైస్తతః 21 భాగములో 6-7-8
సప్తనాగ నవభాగైః పునః 24 భాగములో 7-8-9
వర్ధమాన ముదితం చతుర్విధం బ్రహ్మ విష్ణు శివ భాగతః క్రమాత్

శిల్ప రత్నము 2 [92. 93]

సంకృత్యం సేతు లింగోచ్చే సప్తాష్ట నవభిః క్రమాత్
అంశైశ్‌బ్రహ్మ హరీశాన భాగాన్యః వర్ధమానకే
[24 భాగములో 7-8-9]
లింగాయామే ప్రకృత్యంసే షట్ సప్తాష్టాంశ కల్పితాః
[21 భాగములో 6-7-8]
పంచషట్ సప్త భాగైర్వా 18 భాగములలో 5-6-7
చతుష్పంచ షడంశకైః 15 భాగములలో 4-5-6
వర్ధమానం భవే ల్లింగం శ్రేష్ట మధ్యాదమాః క్రమాత్

మొదటిది శ్రేష్టమనియు, రెండవది మధ్యమనియు, మూడవది నాల్గవది కనిష్ట మని చెప్పబడినది

(౨) శివాధికము :- ఇపుడు శివాదికలింగమునకు వికల్పమై చెప్పబడు శ్లోకములు ఈ రీతిగా యున్నవి.

వేదవేద శరాంశంవా 13 భాగములో 4-4-5
పంచపంచ షడంశకం 16 భాగములో 5-5-6

షట్షట్ సప్తాంశకై ర్వాత 19 భాగములో 6–6–7
శై వాధిక్యం చతుర్విధం ఈ రీతిగా నాల్గు ప్రకారములు.

మయమతము 33 [78–79]

| | |
|---|---|
| స ప్తస ప్త వసుభాగకైః స్తథ | 22 భాగములో 7–7–8 |
| పంచపంచ షడంశకై రపి | 16 భాగములో 5–5–6 |
| వేదవేదశర బాగ కై స్తతః | 13 భాగములో 4–4–5 |
| ఛంధభంధ విగభాగకైః పునః | 10 భాగములో 3–3–4 |

ఈ రీతిగా నాల్గు ప్రకారములు.

పూర్వకారణ ఆగమము (9)

| | |
|---|---|
| స ప్తసప్తాష్ట భాగంతు | 22 భాగములో 7–7–8 |
| పంచపంచ షడంశం | 16 భాగములో 5–5–6 |
| వేదవేద శరాంశంతు | 13 భాగములో 4–4–5 |
| గుణానల యుగాంశకం | 10 భాగములో 3–3–4 |

ఏవం శివాధికం ప్రో క్తం ద్విజాతీనాం క్రమాద్గృహే

ఉదా :– వీటిలోను యజమాన మానము రీతిగా చాతుర్వర్ణ్యముల వారికిని ఒకే ఎత్తు కలిగిన [21.8 అంగుళము] లింగమున్నది అని భావించినయెడల ఈ మానముల వ్యత్యాసము రీతిగా అగు మానములను ఈ క్రింద ఇవ్వబడినవి.

| | విప్రులకు | | క్షత్రియులకు | వై శ్యలకు | శూద్రులకు |
|---|---|---|---|---|---|
| | 7–7–8 | 6–6–7 | 5–5–6 | 4–4–5 | 3–3–4 |
| రుద్ర భాగము | 7.8 | 8.0 | 8 2 | 8 4 | 8.7 |
| విష్ణు భాగము | 7.0 | 6.9 | 6.8 | 6.7 | 6.5½ |
| బ్రహ్మ భాగము | 7.0 | 6.9 | 6.8 | 6 7 | 6 5½ |
| మొ త్తము | 21.8 | 21.8 | 21.8 | 21.8 | 21.8 |

ఈ రీతిగా శివాధిక లింగముయొక్క మానములు చెప్పబడినవి.

| | వర్ధమాన లింగము | | | | శివాధిక్య లింగము | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | బ్రాహ్మణ | క్షత్రియ | వైశ్య | శూద్ర | బ్రాహ్మణ | క్షత్రియ | వైశ్య | శూద్ర |
| రుద్రభాగము | 6 | 7 | 8 | 9 | 7 8 | 6 | 5 | 4 |
| విష్ణుభాగము | 5 | 6 | 7 | 8 | 6 7 | 5 | 4 | 3 |
| బ్రహ్మభాగము | 4 | 5 | 6 | 7 | 7 6 | 5 | 4 | 3 |
| మొత్తము | 15 | 18 | 21 | 24 | 19 | 16 | 13 | 10 |
| శిరోవర్తనము | 8-2½ | 32-5 | 32-7 | 32-9 | 32-19 (22) | 32-20 | 32-2 | 3-22 |

ఉదా :– వర్ధమాన లింగము నాల్గు వర్ణ అధికారులకును యజమాన మానము ననుసరించి ఒకే కొలత ఎత్తు కలిగిన లింగములను నిర్మించుమన్నాము అని భావించిన యెడల అవుడు 25.2 అంగుళము ఎత్తు కలిగిన లింగము నిర్మించిన యెడల

| | బ్రాహ్మణులకు | క్షత్రియులకు | వైశ్యులకు | శూద్రులకు |
|---|---|---|---|---|
| | 4-5·6 అంగుళము | 5-6-7 | 6-7-8 | 7-8-9 |
| రుద్ర | 9.45 | 9.60 | 9.8 | 10.1 |
| విష్ణు | 8.40 | 8.40 | 8.4 | 8 4 |
| బ్రహ్మ | 7.35 | 7.20 | 7.0 | 6.7 |
| | 25.20 | 25·20 | 25·2 | 25 2 |

ఈ రీతిగా బ్రహ్మ రుద్రాంశములు మాత్రమే వ్యత్యానమగుట చూడవచ్చును.

శివాధిక లింగములోను కూడ

| | విప్రులకు | | క్షత్రియులకు | వైశ్యులకు | శూద్రులకు |
|---|---|---|---|---|---|
| | 7-7-8 | or 6-6-7 | 5-5-6 | 4-4-5 | 3-3-4 |
| రుద్ర | 7·8 | 8 0 | 8.2 | 8.4 | 8·7 |
| విష్ణు | 7·0 | 6 9 | 6.8 | 6.7 | 6.5½ |
| బ్రహ్మ | 7·0 | 6.9 | 6 8 | 6·7 | 6 5½ |
| | 21.8 | 21·8 | 21.8 | 21·8 | 21 8 |

ముందు శిరోవర్తన విచారములో విశేష కల్పనము చెప్పబడి యున్నది. దాని ననుసరించి పైన చెప్పబడిన విశేష కల్పనామానముచే కూడిన వర్ధమాన శివాధికపట్టిలో శిరోవర్తన మానమును తెలియపరచియున్నది. విష్కంభములో వర్ధమాన శివాధిక్య మునకు సిద్ధాంతమానమునే అనుసరించవలెను.

దీపార్లవ గ్రంథమందు [13-33] ఈ నాల్గుకొలతలు దీపార్ణవములోను, పూర్వ కారణాగమములో చెప్పబడి యున్నవి. ఈ రీతిగా అయిదు గ్రంథములలో ఒకే అభి ప్రాయముచే నాలుగు ప్రకార లింగములు చెప్పబడియున్నవి. దీనిచేత వర్ధమాన, శివాధిక లింగములను నాలుగు కొలతలలో చేయవచ్చునని తెలియబడును. పూర్వ కారణాగమ ఒక గ్రంథములో మాత్రమే ఈ నాలుగు భేదములు విప్రాది నాలుగు వర్ణములవారికని చెప్పబడి యున్నది. అనగా వర్ధమానములో 4-5-6 కొలతయు బ్రాహ్మణులకు 5-6-7 మానము క్షత్రియులకు 6-7-8 మానము వైశ్యులకు 7-8-9 మానము శూద్రులకు శ్రేష్టమని చెప్పబడియున్నది. అదేరీతిలో శివాధికమందు 3-3-4 శూద్రులకు 4-4-5 వైశ్యులకును 5-5-6 క్షత్రియులకును, 6-6-7 [7-7-8] బ్రాహ్మణులకు అని చెప్పబడియున్నది. ఈ రీతిగా చాతుర్వర్ణ్యములవారికి ఈ నాల్గు విధమానములు అని ఇతర గ్రంథములలో చెప్పక ఆగమ గ్రంథమందుమాత్రమే "చతుర్ణామపివర్ణానాం వర్ధమానం శివాధికే" అజితాగమ 4 కామికాగమ 62 [268] అని చెప్పబడుటచేత ఈ రీతి నాలుగు కొలత వ్యత్యాసములకు కారణమై యుంటున్నది. మొదట వర్ధమానము క్షత్రియులకు మాత్రమే అనియు, శివాధిక్యము వైశ్యులకు మాత్రమే అనియు నిర్ణయమై యుండినది ఇపుడు ఈ వికల్పము ఉంటున్నదని శాస్త్రకారులు చెప్పుటచేత మనము అంగీకరించుట సమంజసమైయున్నది.

స్వస్తికలింగము [వికల్పమానము] :– ఇది శివాధిక లింగముయొక్క మానము లను తలక్రింద కొలతమానమై యున్న లింగము. అనగా బ్రహ్మ విష్ణు అంశములు సమముగా వుండి రుద్రభాగము ఒక అంశము తక్కువగా యున్నదై వుంటున్నది. [11 భాగములలో 44-3] అజితాగమ ౪ రీతిగా మొదట చెప్పబడిన రీతిగా బ్రహ్మ విష్ణు భాగములు నాల్గునాల్గు అంశములు రుద్రభాగము ఒక అంశము తక్కువగాను అనగా మూడు అంశములుగాను ఉంటున్నది. సుప్రభేదాగమమందు, శిల్పరత్న గ్రంథ

మందు స్వస్తిక లింగము చెప్పబడి యుండుటలేదు. కాశ్యప శిల్పములో 49, [131] రౌరవ ఆగమము 28. [12] దీపార్ణవము 13 [35] ఈ గ్రంథముల రీతిగా—

లింగాయామే నవాంశేతః చతురస్రం ద్విభాగకం ।
వస్వస్రంతు గుణాంశేన వేదాంశం వృత్తముచ్యతే ।

లింగ వుత్సేధమును తొమ్మిది భాగములుగా విభజించి దానిలో 2, 3, 4 భాగములు వుండవలెను. దీని లక్షణము వర్ధమాన లింగరీతిగా అయినది. కాని ఒక్కొక్క భాగ వుత్సేధము వర్ధమానమునకు స్వల్పపై వ్యత్యాసమై యుంటున్నది. వెనుక చెప్పిన 25.2 అంగుళము కలిగిన లింగములో ఈ స్వస్తికమానము ఈ రీతిగా వుంటున్నది· బ్రహ్మభాగము 5 6 అంగుళను విష్ణభాగము 8.4 అంగుళము రుద్రభాగము 11.2 అంగుళము అగును.

మయమతములోను [33] —

యుక్తాయామో స్వస్తికే నాగబంధే
మూలేద్వ్యంశం మధ్యభాగే గుణాంశం । పూజాభాగే
చాతురంశం క్రమేణ చోక్తం శూద్రో నర్వకామప్రదం తత్

అని తొమ్మిది భాగమందు రెండు మూడు నాలుగు భాగము లుండవలెనని చెప్పి యున్నది. ఇది శూద్రులకు ప్రశస్తము.

మానసారము 52 [58] లో ఇంకొక ప్రత్యేకమైన కొలతలను చెప్పుచున్నారు.

స్వస్తికస్య దశ షట్ శివోన్నతం
షోడశాంత విధి వైష్ణవం తథా
భద్రభాగ విధి వత్ సమాచరేత్
సంప దర్ధనివ శూద్రయోగ్యకం

రుద్రాంశము 16 భాగములు, విష్ణ బ్రహ్మాంశములు ఎనిమిది ఎనిమిది భాగములు ఉండవలసినది. ఇది శూద్రులకు యోగ్యము.

ఈ రీతిగా కాశ్యప, మయమత, మానసార, దీపార్ణవ, రౌరవము, ఇత్యాది గ్రంథములలోను స్వస్తిక లింగములో వికల్పమానము చెప్పబడియున్నది. శూద్రులకు శ్రేష్ఠమనియు చెప్పబడి యున్నది గనుక ఈ మానమందు లింగమును నిర్మించవచ్చును కాని ఈ లింగములో చాతుర్వర్ణ్య వికల్పమానము చెప్పబడుటలేదు.

| | కామిక 62 [30] దిపార్ణము 13 [35] మయమతము 33 [78–89] కాశ్యపశిల్పము 49 [131] | మానసారము 52 [58] |
|---|---|---|
| రుద్రభాగము | 4 | 16 |
| విష్ణుభాగము | 3 | 8 |
| బ్రహ్మభాగము | 2 | 8 |
| మొత్తం భాగములు | 9 | 32 |

ఈ రీతిగా మూడు దేవతాంశముల ఉత్సేధము [ఎత్తు] యొక్క వ్యత్యాసము చేత నాలుగు విధమైన లింగములు చెప్పబడినవి. అజితాగమమందు

ప్రోక్తే క్రమ వివక్షాయాం చత్వార్యగ్ర జన్మనాం
భూపానాం వర్ధమానంతు లింగత్రయ ముదాహృతం
లింగ ద్వయమితి ప్రోక్తం వణిజస్తు శివాధికం
అంత్యమే వహి శూద్రస్య స్వస్తికం లింగ ముచ్యతే

సర్వసమము బ్రాహ్మణులకును, వర్ధమానము క్షత్రియులకును, శివాధికము వైశ్యులకును, స్వస్తికము శూద్రులకును ప్రశస్తమని క్రమముగా చెప్పబడుటయే కాక బ్రాహ్మణులకు నాల్గు లింగములోలను, క్షత్రియులకు వర్ధమానాది మూడు లింగములలోను,

వైశ్యలకు శివాధికము రెండు లింగములలోను. శూద్రులకు స్వస్తిక లింగము మాత్రమే అధికారమని చెప్పబడినది. ఇంతమాత్రమే కాక వర్ధమాన శివాధిక్యమందు నాలుగు వర్ణములవారకును అధికారము ఉన్నదని చెప్పబడినది. మొత్తమందు సర్వసమ లింగమునకు బ్రాహ్మణులు మాత్రమే అధికారులనియు మిగతా మూడు లింగములోను నాల్గు వర్ణములవారికును అధికారమున్నది అని తెలియబడినది. కాని వర్ధమాన, శివాదికములలో నాల్గునాల్గు వైకల్పిక మానములు చెప్పబడియుండుటచేత భిన్నభిన్న వర్ణములు కలవారు ఆయా లింగములను నిర్మించునపుడు వారివారికి చెప్పబడిన మానములోనే నిర్మించవలసినది అని చెప్పబడినట్లైనది. స్వస్తికలింగమందు ఈ వికల్పములు లేవు. ఒక్కొక్క గ్రంధమందు ఒక్కొక్కవిధమైనకల్పన చెప్పియుండినను $\left\{\frac{2\text{-}3\text{-}4}{9}, \frac{4\text{-}4\text{-}3}{11}, \frac{8\text{-}8\text{-}16}{32}\right\}$ ఆయా గ్రంధము ననుసరించువారు ఆయా కొలతలో స్వస్తిక లింగమును నిర్మిచవలెను. దీనిని ఏ వర్ణమువారు అయినను నిర్మించవచ్చును.

ఇంతవరకు భాగత్రయయుక్త లింగములయిన మొదటి నాలుగు లింగముల ఉత్సేధ మానములను వివరించబడినది. ఇవి విష్కంభ [వెడల్పు] మానము చెప్పబడుతున్నది.

—: o :—

# 16 లింగ విష్కంభ మానములు

లింగాయామం గృహీత్వాథ తదర్ధం చాష్టధా భజేత్ ।
తద్ భాగైః పంచభిః కుర్యా ద్విష్కంభం చోత్తమోత్తమం । ౨౯
త్రినప్తాంశే తదాయామే షట్పంచ చతురంశకైః ।
విష్కంభంతు భవే చ్ఛ్రేష్ఠం మధ్యం హీనమనుక్రమాత్ ।
అథవా పంచ విశాంశే నాగ ద్వీప రసైరపి ।
భాగైః పూర్వవ దేవోక్తో విష్కంభో లింగ నంస్థితః ।
ఏవం చతుర్ణాం లింగానాం విష్కంభః పరికీర్తితం ।
చాతుర్విధ్య మతస్తేషాం క్రమేణ పరివర్త్యతే । ౩౨

అజితాగమే క్రియ ౪

లింగముయొక్క ఎత్తులో అర్ధమును [సగమును] 8 భాగములు చేసి [లింగము యొక్క ఉత్సేదమును 16 భాగము చేసి] దానిలో 5 భాగమంత వెడల్పు పెట్టడము ఉత్తమోత్తమము. ఉత్సేదమును ౬౦ బాగముచేసి 6 అంశములు వెడల్పు పెట్టడము ఉత్తమము అనియు, 5 అంశములు పెట్టడము మధ్యమము అనియు. 4 అంశములు పెట్టడము అధమమనియు చెప్పబడుచున్నది. [5/16 వెడల్పు ఉత్తమోత్తమము. 6/21 ఉత్తమము 5/21 మధ్యమము 4/21 అధమము] అదికాక ఇంకొక కొలతయు చెప్పబడియున్నది. 5/16 ఉత్తమోత్తమము 8/25 ఉత్తమము 7/25 మధ్యమము 6/25 అధమము. ఈ రీతిగా ఈ నాల్గు కొలతలు విప్రాదులకు ఏర్పటిన నర్వనమాది నాల్గువిధ లింగములకు క్రమముగా విష్కంభ మానములని తెలియుడమైనది.

ఉదాహరణము :— 25 2 అంగుళము ఎత్తు వున్న నాలుగు విధ లింగములకు విష్కంభము ఈ రీతిగా ఉంటున్నది: నర్వనమమునకు 7.88 అంగుళము క్షత్రియ

లకు వర్ధమాన లింగములో 7.2 అంగుళము వైశ్యులకు శివాదిక లింగమునకు 60 అంగుళము, శూద్రులకు స్వస్తిక లింగములో 48 అంగుళము

| విప్రాది వర్ణ్యము | | ఉత్సేధమియొక్క | | | |
|---|---|---|---|---|---|
| బ్రాహ్మణ | ఉత్తమోత్తమ | 16లో 5 భాగము | 16-5 | 24-8 | సమలింగము ఉత్తమోత్తమ |
| క్షత్రియ | ఉత్తమ | 21లో 6 ,, | 25-8 | 24-7 5/8 | వర్ధమానము శ్రేష్ఠము |
| వైశ్య | మధ్యమ | 21లో 5 ,, | 25-7 | 24-5 5/8 | శివాధిక్యము మధ్యమము |
| శూద్ర | కనిష్ట | 21లో 4 ,, | 25-6 | 24-5 | స్వస్తికము కనిష్ఠము |

శిల్పరత్నము — రెండవ అధ్యాయము

మార్తాండ ద్వయ భాగ భక్త మమలం లింగం విధాయాంశకైః
అష్టాభిర్ యవ పంచ యుక్త మునిషు। సార్ధం యవైః వరితబిహిః ।
భూతైః పంచభిరేవ వర్ణ విహితైః విప్రాదితో విశ్రుతైః ।
కుర్యాత్సర్వ సమం సమాంశ విహితం వృద్ధ్యుత్తరే సాదికే ।

లింగముయొక్క ఎత్తును 24 భాగములుగా విభజించి 8 భాగముల వెడల్పు పెట్టడము బ్రాహ్మణులకు, 7 5/8 భాగము వెడల్పు పెట్టడము క్షత్రియులకును. 5 5/8 భాగము వెడల్పు పెట్టడము వైశ్యులకును, 5 భాగము వెడల్పు పెట్టడము శూద్రులకును ప్రశస్తమని చెప్పబడియున్నది. 25 2 ఎత్తు ఉన్న లింగములో సర్వసమ లింగముయొక్క వెడల్పు 8.4 అంగుళము, వర్ధమాన లింగమునకు వెడల్పు 8 అంగు

ళము. శివాధిక లింగమునకు వెడల్పు 5 95 అంగుళము. స్వస్తిక లింగమునకు వెడల్పు 5.25 అంగుళము అగును.

పూర్వ కారణాగమములో ఈ నాలుగు విధములు చెప్పబడలేదు. బహు సులభముగా ఒకేమాటులో కిష్కంభ మానముయొక్క నిర్ణయము చెప్పబడియున్నది.

యత్తు లింగస్యచాయామం నాహం చ తత్సమ ముచ్యతే ।
జేష్టొత్తమంతు లింగస్య రుద్ర భాగస్య నాహకం ।

లింగములో వృత్తముగా నున్న రుద్రభాగముయొక్క చుట్టుకొలతయు, లింగముయొక్క ఉత్సేధమంత యుండవలయును. అనగా అజితాగమములో తెలిపిన రీతిగా 5/16 భాగముండవలయును. ఏలననగా 16 అంగుళము ఎత్తు ఉన్న లింగముయొక్క 5 అంశము వెడల్పు పెట్టిన మాత్రమే వృత్తముయొక్క పరిధియు 16 అగును. ఈ రీతిగా విష్కంభ మానములు చెప్పబడినది.

—; o :—

# 17 శిరోవర్తనము

ఇదివరకు లింగముల ఉత్సేధ మానముల అనుసారముగా నాలుగు ప్రకారములు. వాటియొక్క విష్కంభమానములను [వెడల్పు] వివరించుటమైనది. ఇపుడు శిరోవర్తనము చెప్పబడుచున్నది.

శిరోవర్తనమనగా లింగముయొక్క పైభాగమును అణిచిపెట్టక గుండు చేయవలెను. దీనిలో ఈ గుండు చేయుటలో [గోలు] నాలుగు విధములున్నవి. దాని వివరము ఈ క్రింద చెప్పబడి యున్నది.

చతుర్విధంతు తత్ప్రోక్తం తద్విధం శృణుసాంప్రతం ।
కుక్కుటాండ సమంచైవ ఛత్రాకారం తథైవచ । ౪౦
ఖండేందు సదృశాకారం, త్రపుషాకార మేవచ ।

* * * * * *

విప్రాణాం త్రపుషాకారం ఛత్రాకారంతు భూభృతాం । ౪౪
ఖండేందు వత్తు వైశ్యానాం శూద్రాణాం కుక్కుటాండవత్
॥అజితాగమము॥ ౪

లింగముయొక్క నిర్మాణములో అణచినదై యున్న తలభాగము [శిరోభాగము] ఉన్నది కదా. పూజాభాగము వృత్తాకారమై యుంటున్నది. దానియొక్క పైభాగము [శిరోభాగము] ఒక పళ్ళెము రీతిగా ఉంటున్నది. దాని చుట్టు వున్న అంచును కొన్ని నిర్దిష్ట కొలత ప్రకారము తీసివేసి అచట గుండు చేయుటములో నాల్గు విధములగును. ౧. త్రపుషాకారము [దోసకాయ పైరూపము] ౨. ఛత్రాకారము [తాటీ ఆకు గొడుగు] ౩. అర్ధ చంద్రాకారము ౪. కుక్కుటాండకారము [కోడిగ్రుడ్డు ఆకారము] ఈ రీతిగా

నాలుగు ప్రకారములగును. దీనిని నాలుగు వర్ణములవారికిను క్రమముగా చెప్పబడినది. ఇదే అజితాగమములో వెనుక సర్వసమాది నాల్గు లింగములు నాల్గు వర్ణములవారికి ప్రశస్తమని చెప్పియున్నది. గనుక ఇచటను ఈ నాల్గు వర్ణములవారికిను నాల్గువిధ శిరోవర్తనమని చెప్పబడియుండుటచేత ఆ నాల్గువిధ లింగములకు ఈ నాల్గువిధ శిరోవర్తనమును నిర్మించుటమనేది సామాన్య నియమము. అనగా బ్రాహ్మణులకు సర్వసమ లింగమందు త్రపుషాకార శిరోవర్తనమును, క్షత్రియులకు చెప్పబడిన వర్ధమాన లింగమందు ఛత్రాకార శిరోవర్తనమును, వైశ్యులకు చెప్పబడిన శివాధిక లింగమందు అర్ధచంద్ర శిరోవర్తనమును, శూద్రులకు చెప్పబడిన స్వస్తిక లింగమందు కుక్కుటాండ శిరోవర్తనము నిర్మించవలెనని చెప్పినట్లయినది.

ఇదే విషయములో —

కుర్వీత త్రపుషీ ఫలాగ్ర సదృశం ఛత్రోపమం మస్తకం ।
బాలేంద్వాకృతి కుక్కుటాండ సదృశం విప్రాది వర్ణక్రమాత్ । ౧౧౨
భేదా సర్వసమాంశక ప్రభరిత యో నాహ ప్రభేదాన్వితాః
తేష్వేతత్ క్రమతః స్యురే తదనులోమాంగీ కృతశ్చేష్యతే ౧౧౩
॥శిల్పరత్నము॥ ౨

ఈ విషయములో ఈ గ్రంథమందు స్పష్టముగా నాల్గువిధ శిరోవర్తనమును విప్రాది నాల్గు వర్ణములవారికిని, సర్వసమాధి నాల్గు లింగములకు క్రమముగా అన్వయించుమన్నది. అని వివరించబడినది. ఇది సామాన్య నియమము. ఇది ఇక దీనిలో విశేష నియమములు చెప్పబడుచున్నది. విప్రులకు సర్వసమాది నాల్గు లింగములందు, క్షత్రియులకు వర్ధమానాది మూడు లింగములందు. వైశ్యులకు శివాధికాది రెండు లింగములందు, శూద్రులకు స్వస్తిక లింగమందు అధికారమున్నదని వెనుక చెప్పబడిన రీతిగా అజితాగమమందు ఇచటను —

"సర్వం విప్రస్య నిర్దిష్టం ఛత్రాకారత్రయం నృపే ।
విశాం ఖండేందు సదృశ ద్వయమేవం ప్రకీర్తితం । ४८
శూద్రాణాం మేకమేవోక్తం కుక్కుటాండ నిభం హరే" । అని చెప్పబడి

యున్నది. పరస్పరము సమంజసమైన వాక్యములై యుంటున్నవి. ఇంకొక విశేషము చెప్పబడియున్నది —

ఛత్రాకారంతు సర్వేషాం భవేల్లింగ శిరేనృణాం ।

ఎచట సందేహ ముంటున్నదో, అధవా విరోధోక్తులు వుంటున్నవో ఎచట శిరోవర్తనమును స్పష్టముగా చెప్పబడలేదో అచ్చటచ్చట ఛత్రాకార శిరోవర్తనము చేయవచ్చునని విశేష నియమము.

కాశ్యప శిల్ప 49వ అధ్యాయమందు ఈ రీతిగా చెప్పబడియున్నది. ఈ నాల్గు విధ శిరోవర్తనములలో ఒక్కొక్కటి నాల్గు విధములు మానవ్యత్యాసముచే అగును అని చెప్పి నాల్గువిధ ఛత్రాకారమును బ్రాహ్మణ క్షత్రియులకు ప్రశస్తమనియు. కుక్కుటాండ శిరోవర్తనము వర్తమాన లింగమునకు చేయవలసినదనియు, ఇది క్షత్రియులకు ప్రశస్తమనియు. త్రపుషాకార శిరోవర్తనము శివాధిక లింగములో నిర్మింపబడినది. వైశ్యులకు ప్రశస్తమనియు, అర్ధచంద్రాకార శిరోవర్తనము స్వస్తిక లింగమునకు నిర్మింపబడి, శూద్రులకు ప్రశస్తమని చెప్పబడి యున్నది. [శ్లోకము 150–165]

సర్వసమాధి లింగముల చాతుర్వర్ణ్య విభాగము సరిసరిగా నున్నది. శిరోవర్తనమును చాతుర్వర్ణ్యమునకు అన్వయించి యుండటము అజితాగమ, శిల్పరత్న గ్రంధముల వాక్యములకు విరోధముగా కనబడుచున్నది. కాని దీనిలోను "సర్వేషా మపి లింగానాం ఛత్రాకాంతు ప్రశస్తకం" అని చెప్పబడుటచేత వెనుక వివరించిన రీతిగా విరోధోక్తులు చూచినవుడు ఛత్రాకార శిరోవర్తనమును అన్ని స్థలమందు చేయుట సమ్మతము.

ఇక వీటి మానములు చెప్పబడుచున్నవి

వేదాంశేతు శిరస్తారే నేత్రభాగేన వర్తితం ।
కుక్కుటాండోపమం తస్మిన్ వసుభాగ విభాజితే ।
వర్తితం భాగయుగ్మేన ఛత్రాకారం భవేనృప । ౪౨
లింగతారేగ్ని భాగేతు వక్షభాగ వివర్ధితం ।

అర్ధచంద్ర నిభం విద్యాత్ తస్మిన్ షడ్భాగభాజితే ।
సార్ధేనైవ ద్విభాగేన వర్తితం త్రపుషాకృతి ।
అజితాగమ ४

లింగముయొక్క తార అనగా [వెడల్పు] త్రిజ్యమును నాలుగు భాగముగా విభాగించి దానిలో రెండు భాగములను వర్తనము చేయుటము [చెక్కటము] కుక్కుటాండ వర్తనము అనియు, అదే వెడల్పును ఎనిమిది భాగములుగా విభాగించి రెండు భాగము వర్తనము చేయుటము ఛత్రాకారమనియు, అదే వెడల్పును మూడు భాగములుగా విభాగించి రెండు భాగము వర్తనము చేయుటము అర్ధచంద్రాకారము అనియు, అదే వెడల్పు ఆరు భాగములుగా విభజించి రెండున్నర భాగమును వర్తనము చేయుటము త్రపుషాకారమనియు చెప్పబడుచున్నది.

ఈ రీతిగా శిరోవర్తనము కోరికై లింగ శిరస్సులో తీసివేయు [ఛేదించి తీసివేయవలసిన] మానములు చెప్పబడుచున్నవి అనగా వీటియొక్క ఎంత లోతువరకు చుట్టు తీయవలసిన దనుట చెప్పబడి యుండుటలేదు. దీనిచేత అంచునుంచి క్రోవలభాగములో ఎంతవరకు కొలతను తీసివేయటమో అంతే కొలతయొక్క లోతులను వేయవలసినదని భావించుట ఉత్తమము. కాని ఈరీతి ఛేదించివేయటములో నేరుగా తీయకూడదు. దానిని ధనురాకారమై చేయవలెను. [వంపుగా చేయవలెను]

ఇక ఇదేరీతిగా త్రపుషాది నాలుగు విధ శిరోవర్తనముల మానములను వివిధ గ్రంథములో కొద్దికొద్ది వ్యత్యాసములై చెప్పబడియుండుట ఈ ముందు ఒక పట్టీలో ఈయడమైనది ఈ వ్యత్యాసములు ఉంచినను అవి అన్నియు శాస్త్రోక్తమైనది గనుక ఏ రీతిగా నిర్మించినను దోషముండదు. ఈ కొలతల ప్రకారము శిరోవర్తనములను నిర్మించునపుడు త్రపుషాకారము యొక్క కొలతలో దోసకాయ ఆకారము, ఛత్రాకారమందు తాటి ఆకు గొడుగు ఆకారము, అర్ధచంద్రాకారమందు చంద్రుని ఆకారము, కుక్కుటాండమందు కోడిగ్రుడ్డు ఆకారము కల్పించకను ఉండవచ్చును. అయాకొలతలో నిర్మించియున్న దానికి ఆయా పేరులు చెప్పబడియున్నది. ఆయా రూపమే ఉండవలెనని నియమము లేదు.

కామికాగమ, దీపార్ణవము, రూపమండనము. అపరాజిత పృచ్ఛా ఇత్యాది కొన్ని గ్రంధములలో ఈ నాలుగు విధ శిరోవర్తనములు కాక బుద్బుదాకార [నీటిపైన బుడగ] శిరోవర్తనమును చెప్పబడి దానికి మానమును చెప్పియున్నారు. కాని దీనికి ఏ విధమైన లింగమునకు, ఏ వర్ణమునకు అనే వివరములు చెప్పబడలేదు. ఈ బుద్బుదాకార మానమును గమనించిన యెడల త్రపుషాకార మానమునకు దగ్గరగా ఉన్నరీతిలో కన్పించు చున్నది కనుక సర్వసమ లింగమునకు అన్వయించుటము యుక్తముగా కన్పించు చున్నది.

| శిరోవర్తనము పేరు | అజితాగమ ౪ (౪౦-౪౪) | సుప్రభేదము ౭౭ (౧౨౭ ౧౨౨) | కామికాగమము ౬౨ (౫౫-౫౬) | కిరణాగమము ౨౧ (౨౮-౨౪) | రౌరవాగమము క్రియా ౨౮ ( ) | ఈశాన శివగురు పద్ధతి ౭౭ (౮౦-౮౨) | కారణాగమము ౯ (౧౨౮-౧౭౭) | దీపార్ణవము ౧౭ (౪౫-౪౬) | రూపమండనము ౪ (౬౮-౭౦) | అపరాజిత పృచ్ఛా ౨౦౨ (౭౭-౭౬) | హయశిపాంచ్ రాత్ర ఆదికాండ ౭౧ | శిల్పరత్నము ౨ (౧౨౦-౧౨౨) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. త్రపుషాకారము | 6 2⅛ | 6 2½ | 6 2½ | 6 2½ | | 6 2½ | 6 2½ | 6 4 | 6 2½ | 6 2½ | | 6 2¼ |
| 2. ఛత్రాకారము | 8 2 | 6 1 | 8 1½ | 8 1½ | | | 8 1½ | 8 2½ | 8 2½ | 8 2½ | 8 1½ | |
| 3. అర్ధ చంద్రాకారము | 3 2 | 3 2 | 3 1 | 3 1 | 3 2 | 3 1 | 3 2 | 3 1 | 3 1 | 3 1 | | 3 1 |
| 4. కుక్కుటాండాకారము | 4 2 | 2 1 | 2 1 | 4 2 | 6 | 3 2 | 1 | 2 1 | 2 1 | 4 2 | | 6 3 |
| 5. బుద్బుదాకారము | | | 8 3½ | | | 8 3½ | | 8 3½ | 8 3½ | 8 3½ | | 8 3½ |

అర్ధ చంద్రాకారము 3–2 ఉత్తమము

శిరోవర్తన ప్రకారాంతము

విస్తారం శివలింగ మూర్ధ్ని వసునందాదిత్య రుద్రాంశకం ।
కృత్వాత్రక్రమతో విరోధ్య పరితోద్వైత ద్విలోకాంశకం । ౧౧౨
కృత్వా త్యష్టి తిథి ప్రకృత్యధి కృతివ్యాతాంశయుక్తం క్రమాత్ ।
పూజాభాగ మహోక్త భాగముపరిష్టాభేదయే ద్వర్ణిషు । ౧౧౪

శిల్పరత్న ౨

లింగముయొక్క శిరస్సు వెడల్పులో 8, 9, 12, 11 భాగములుగా విభజించవలెను. దానిలో క్రమముగా రెండు ఒకటి, మూడు భాగములను చుట్టుతీసివేయవలెను. లింగముయొక్క పూజాంశమెత్తును 15, 17, 21, 19 భాగములుగా విభజించి పైన ఒక భాగమును తీసివేయవలెను ఇది క్రమముగా నాలుగు వర్ణములవారకును అన్వయింపను. దీనియొక్క వివరము—

(1) లింగశిరోభాగమును 8 భాగములుగా విభజించి దానిలో రెండు భాగమును తీసివేయ వలయును. దీనిలోతు పూజాంశము యొక్క 1/18 భాగము. ఇది బ్రాహ్మణులకు, (2) లింగశిరస్సును 9 భాగముగా విభాగించి ఒక భాగమును తీసివేయవలయును. దీనిలోతుకూడా పూజాంశము యొక్క 1/15 భాగము. ఇది క్షత్రియులకు లింగశిరస్సును 12 భాగములుగా విభజించి రెండు భాగములను తీసివేయవలయును. దీనిలోతు పూజాంశముయొక్క 1/12 భాగము. ఇది వైశ్యులకు లింగశిరస్సును 11 భాగములుగా విభాగించి మూడు భాగములను తీసివేయవలెను దీనియొక్క లోతు కొలత పూజాంశముయొక్క 1/19 భాగము. ఇది శూద్రులకు ప్రశస్తము ఇదికాక ఇంకొక విధము చెప్పబడియున్నది.

తన్మస్తకే నవభాగ తయా విభిన్నే ।
భాగంవిచ్ఛేద్య పరితః శివభాగద్వైర్ఘ్యం ।
ద్వాత్రింశదంశకతాయా పరికల్ప్యభాగాన్ ।
ఏకైకతోద్వి జముఖేషు విశోదయేద్వా । ౧౧౫

శివలింగ శిరస్సు వెడల్పును 9 భాగములు చేయవలెను. దానిలో ఒక భాగమును చుట్టు తీసివేయవలెను. దీనియొక్క తోతు పూజాంశముయొక్క ఎత్తును 32 భాగముగా విభజించి విప్రాది నాలుగు వర్గముల వారకును క్రమముగా 1,2,3.4 భాగములను తీసివేయవలయును.

కొన్ని గ్రంధములలో శిరోవర్తన ప్రకారాంతరములో ఒక్కొక్క ప్రకారమును, కొన్ని మాన భేదములను చెప్పియున్నారు. దాని ప్రకారము ఈ క్రింది పట్టీలో ఇవ్వబడియున్నది.

ప్రకారాంతర శిరోవర్తనము

| శిరోవర్తనముల పేరు | | | | శిల్పరత్నము ౨ (౧౧౦-౧౨౨) | | | | కాశ్యపశిల్పము ౪౯ (౧౫౮-) | మయమతము ౨౨ (౯౨-౧౦౦) |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | ఇంకొక విధము | | ఇంకొక విధము | | | |
| త్రపుషాకారము | 6 | 2½ | విప్ర | 8-2 | 17₁ | 9-1 | 32-1 | 32-10<br>32-11<br>32-12<br>32-13 | |
| ఛత్రాకారము | 16<br>16<br>16<br>16 | 10<br>1—1 యవ<br>1—2 ,,<br>1—3 ,, | క్షత్రియ | 9-1 | 15-1 | 9-1 | 32-2 | 8-½<br>32-5<br>32-7<br>32-9 | 16-1<br>16-2<br>16-3<br>16-4 |

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అర్ధచంద్రము | 3 | 1 | వైశ్య | 12-2 | 21-1 | 9-1 | 32-3 | 32-19<br>32-20<br>32-21<br>32-22 | 3-1 |
| కుక్కుటాకారము | 6 | 3 | శూద్ర | 11-3 | 19-1 | 9-1 | 32-4 | 32-14<br>32-15<br>32-16<br>32-17 | 2-1 |
| బుద్బుదాకారము | 8 | 3½ | | | | | | | 8-3½ |

ఈ ప్రకారాంతర మానములకంటె మొదటి చెప్పబడిన పట్టిరీతిగా శిరోవర్తనమును నిర్మించుట ఉత్తమము. ఈ శిరోవర్తన మానముల నతిక్రమించక, అలంకారమును విడువకుండా శిరోవర్తనమును చేయుట బుద్ధిమంతుడు, శాస్త్రజ్ఞుడు పరంపరాగతుడు అయినను శిల్పియు, శ్రద్ధావంతుడైన అధికారియును శాస్త్రవిహితమైన విధినిషేధములను తెలిసియున్న ఆచార్యులను అవలంబించియున్నది.

ఉత్సేధ క్రమమందు (perpendicator) క్రిందనుండి బ్రహ్మ, విష్ణు, రుద్ర భాగములని మూడు భాగములను కూడియున్న సర్వసమ, వర్ధమాన, శివాధిక స్వస్తిక మనే నాలుగు విధ లింగములు క్రమముగా ఈ నాల్గు రీతిగావున్న లింగములకును ఉత్తమోత్తమ, ఉత్తమ, మధ్యమ, కనిష్ఠమనే నాల్గువిధ విష్కంభమును, త్రిపుష, ఛత్ర - అర్ధచంద్ర కుక్కుటాండమనే నాల్గువిధ శిరోవర్తనములు, అదేరీతిగా ఈనాల్గు లింగములు నాల్గు వర్ణములవారకును చెప్పబడినవి. దీనిచేత విప్రులకు సర్వసమ లింగము దానికి ఉత్తమోత్తమ విష్కంభము, [వెడల్పు] త్రిపుష శిరోవర్తనము విహితముగా వుంటున్నది. క్షత్రియులకు వర్ధమానలింగము దానికి ఉత్తమ విష్కంభము, ఛత్రాకార శిరోవర్తనము విహితము. వైశ్యులకు శివాధికలింగము దానికి మధ్యమ విష్కంభము, అర్ధచంద్ర శిరోవర్తనము విహితము. శూద్రులకు స్వస్తిక, లింగము దానికి కనిష్ఠమాన విష్కంభము, కుక్కుటాండ శిరోవర్తనము విహితమై యున్నది.

| వర్ణము | ఉత్సేదమాన ప్రకారము | విష్కంభమాన | శిరోవర్తన ప్రకారము |
|---|---|---|---|
| విప్ర | సర్వసమ | ఉత్తమోత్తమ | త్రపుషాకార |
| క్షత్రియ | వర్ధమాన | ఉత్తమ | ఛత్రాకార |
| వైశ్య | శివాధిక | మధ్యమ | అర్ధచంద్ర |
| శూద్ర | స్వస్తిక | కనిష్ఠ | కుక్కుటాండాకార |

ఇది అనేక గ్రంధములలో చెప్పబడి నిర్ణయించిన పట్టిక. నిర్వివాదమైన సామాన్య నిర్ణయము. దీనిలో ఒక్కొక్క విషయములందు చెప్పబడుచున్నవి.

అజితాగమ, కిరాణగమములు రీతిగా క్షత్రియులకు చెప్పబడిన వర్ధమాన లింగములోను, వైశ్యులకు చెప్పబడిన శివాధిక్యలింగములోను, చాతుర్వర్ణుల వారకును అధికారిముంటున్నదని చెప్పబడినది. కొన్ని గ్రంధముల రీతిగా ఈ రెందు విధ లింగములోను ఉత్సేధమానమందు అనగా బ్రహ్మ, విష్ణు, రుద్ర భాగముల ఉత్సేధ మానమందు కొన్ని వ్యతానములను చెప్పబడి వాటిని చాతుర్వర్ణముల వారికిని అన్వయించియున్నారు. ఇదిగాక బ్రాహ్మణులకు నాల్గువిధ లింగములోను, క్షత్రియులకు వర్ధమాన మొదటిగా మూడు లింగములోను, వైశ్యులకు శివాధిక మొదలుగా రెండు లింగములోను, శూద్రులకు స్వస్తిక లింగములోను అధికార ముంటున్నదని చెప్ప బడినది. దీని చేత సర్వసమ లింగములో మాత్రమే బ్రాహ్మణు లొక్కరికే అధికారము. వర్ధమానములో బ్రహ్మాది భాగముల మానవ్యత్యానము చేత నాల్గువర్గముల వారకును అంతయే శివాధికములో బ్రహ్మాది మానముల మానవ్యత్యానము చేత నాల్గు వర్గముల వారికిని, స్వస్తిక లింగములో చెప్పబడిన ఒకే మానములో అది వున్నట్లు ఉండగా నాలు వర్ణముల వారికిని అధికార ముంటున్నదని చెప్పబడినట్లైనది మొదటి నాల్గు వర్ణముల వారికిని నాలువిధ లింగములును చెప్పబడినంతరము పునః ఈ వికల్పములు అన్నిటిని ఎందుకు చెప్పవలెను. ఈ ఒక్కొక్క లింగములకు ఒక్కొక్క ఫలమున్నది.

ఆయా ఫలాపేక్షతో అధికారులు ఏ లింగములైనను నిర్మించవచ్చును. ఈ సందర్భములో మాన వ్యత్యానముచే ఆయా లింగమును నిర్మించవచ్చుననే అభిప్రాయముతో ఇన్ని భేదములు చెప్పబడినవి అని భావించుట ఉత్తమము.

ఇక రెండవ విష్కంభమాన విషయమందు ఏ విధమైన సమస్యలు ఉండవు పైన చెప్పబడిన నాలుగు లింగములకు క్రమముగా నాల్గు కొలత వెడల్పులు చెప్పబడినది. అధికోలు ఎవరేకాని ఉత్సేధమాన వ్యత్యానము ఎలాగు వుండినను విష్కంభము మాత్రము ఆయా లింగములకు చెప్పబడిన మానములోనే ఉండవలెను. సర్వసమ లింగమునకు ఉత్తమోత్తమ విష్కంభమానము. వర్ధమాన లింగమునకు మధ్యమ విష్కంభమానము, స్వస్తిక లింగమునకు కనిష్ఠ విష్కంభమానము సర్వత్ర విహితమై యుంటున్నది. దీనిలో ఎవరు ఏ విధముగాను వ్యత్యానం చేయుటకు అధికారము లేదు.

ఇక మూడవ మరియు చివరిదైన శిరోవర్తన విషయమందు త్రిపుషాకార, ఛత్రాకార, అర్ధచంద్రాకార, కుక్కుటాండాకారమనే నాల్గువిధ శిరోవర్తనములను అనేక గ్రంధకారులు వివరించి, నాల్గు వర్ణములవారికిని అదేరీతిగా సర్వసమాది నాల్గు లింగములకును అన్వయించియున్నారు. ఇది సర్వసామాన్య నియమమే. పునఃకొన్ని విశేష నయమములను కొన్ని గ్రంథములందు మనము చూడవచ్చును. దీనికి ఏర్పడిన మానములలో కొన్ని వ్యత్యానములు గ్రంధాంతరములలో కనిపించినను మరియు ఆ కొలతలో వ్యత్యానముచేత పేరుకు తగిన ఆకారములు రాకపోయినను కూడా చెప్పబడిన కొలతల ప్రకారము శిరోవర్తనమును నిర్మించుట అవశ్యకము. ఈ కొలతల వ్యత్యానమును పట్టీలో చెప్పబడియున్నది.

ఇక కొన్ని గ్రంధముల ప్రకారము "ఛత్రాకారంతు సర్వేషాం భవేల్లింగ శిరోనృణాం" అనే వాక్యము కనబడుతున్నది దీనిచేత ఏవర్ణములయిన వారును ఉత్సేధ విష్కంభముల వ్యత్యానమందు వారివారికి విహితమయిన మానములతో ఏ లింగమైనను నిర్మించినను, పైన చెప్పబడిన ఆకారములు లేక ఛత్రాకార శిరోవర్తనము చేయవచ్చునని అర్ధమగును.

మరియు కొన్ని గ్రంధముల ప్రకారము [శిల్పరత్నమయమతము] ఈ ఛత్రాకార శిరోవర్తనమందు నాల్గువిధ మానమునను చెప్పబడి సర్వసమ, వర్ధమాన, శివాధిక లింగములకు ఆ మానముల రీతిగా ఛత్రాకార శిరోవర్తనములను నిర్మించవలెననియు దీనిలో పరస్పర సాంకర్య చేయకూడదనియు చెప్పబడియున్నారు. దీని రీతిగా సర్వసమ లింగమునకు 1/16 మరియు 2/16 మానమునందు వర్తనము [ఇది బ్రాహ్మణులకు మాత్రమే చెప్పబడిన లింగము] వర్ధమానమందు 4/16 వర్తనము [వెనుక చెప్పబడిన ప్రకారము ఉచ్ఛేదమాన వ్యత్యానముచే ఏ వర్ణములయినవారును ఈ వర్ధమాన లింగ మును నిర్మించినను శిరోవర్తనము మాత్రము ఈ 4/16 మానములోనే ఉండవలెను] శివాధిక లింగమందు 3/16 మాన వర్తనము [దీనిలోను చతుర్వర్ణ్యములవారు నిర్మించి నను శిరోవర్తనము ఈ మానమందే ఉండవలెను] ఉండవలెనని అభిప్రాయపడుచున్నారు ఛత్రాకార శిరోవర్తనమును ఏ లింగమునకైనను నిర్మించవచ్చునని నియమానుసారముగ శిరోవర్తనమును నిర్మించినయెడల ఇవుడు తెలిపిన ఛత్రాకార శిరోవర్తన మానము ననుసరించవలెను. ఈ వాక్యములో స్వస్తిక లింగమునకు [శూద్ర విహితమైన] ఛత్రా కారమును నిర్మించవలసిన మానము చెప్పబడలేదు. వర్ధమాన శివాధిక్యమందు శూద్రులకు అధికారమునిచ్చి ఉత్సేధమాన వ్యత్యానములో వారికును ఈ రెండు లింగములు విహితమై యున్నందునను ఈ రెండు లింగముల ఛత్రాకార వర్తనమానము చెప్పబడి యుండుటచేత వారినిగూడ విడిచిపెట్టకుండ ఉండుటమైనది.

ఇదికాక కాశ్యపశిల్పము అనే గ్రంధమందు త్రపుషాది నాల్గు విధమైన శిరోవర్త నములో నాల్గునాల్గు ప్రభేదముల మానములను చెప్పియున్నారు వర్ధమాన శివాధిక్య లింగములలో నాల్గు వర్ణములవారికి నాల్గు మాన వ్యత్యానములను వెనుక చెప్పబడి యుండుటచేత ఈ రెండు లింగములకు కాశ్యప శిల్పోక్త నాల్గు వ్యత్యానములను క్రమముగా నాల్గు వర్ణములవారికి అన్వయించుట సమంజసముగా వుండును. అదేరీతిలో స్వస్తిక లింగమునకు చెప్పబడిన నాల్గు మాన వ్యత్యానములను ఆ లింగమందు నాల్గు వర్ణములవారికిని అధికారమున్నది. కనుక ఆ నాల్గు మానములను క్రమముగా అన్వయించ వచ్చును. కాని త్రపుషాకారమందు మాత్రమే అవి కేవల విప్రులకు విహితమై సర్వసమ లింగముగా వుండుటచేత దీని నాల్గు మాన వ్యత్యానములను నాల్గు వర్ణములవారికి అన్వ

యించుట సాధ్యము కాదు. దానిచేత సర్వసమలింగమందు సౌకర్యానుసారముగ నాల్గు విధమానములున్న విప్రులు శిరోవర్తన చేయుటకు అవకాశము ఉన్నది అని భావించ వచ్చును.

బుద్బుద స్మధుశాః పంచైవోద్దిష్టా వర్తనా శిరః ।

దీప్తాగమ 13

ఈ నాల్గు శిరోవర్తనము కాక కొన్ని గ్రంధకారులు బుద్బుద సమద్రుశ శిరోవర్తనమును [నీటిబుడగ మోస్తరుగా చెప్పియున్నారు. కాని ఈ రీతిగా ఉన్న శిరోవర్తనమును ఏ లింగమునకు. ఏ వర్ణములవారు నిర్మించవచ్చును అని చెప్పబడి యుండుట లేదు. దీనిచేత ఈ శిరోవర్తనమును చెప్పబడిన మానములో అన్ని లింగములకు నిర్మించవచ్చునని మనము తెలిసికొనుటమైనది

ఆఖరుగా ఒకటి రెండు గ్రంధములందు పైన చెప్పిన బహు సమ్మతమైన వాక్యములకు విరుద్ధముగా కుక్కుటాండ శిరోవర్తనమున్ను వర్ధమాన లింగమునకు. అర్ధచంద్రాకారమును శివాధిక్య లింగమునకు, సర్వసమమందు ఛత్రాకార లింగమును నిర్మించవలెనని చెప్పబడి యున్నది ఈ సందర్భమందు మన అభిప్రాయము ఈ రీతిగా వుంటున్నది.

వెనుక మనము తెలిపిన రీతిగా ఈ పేరుతో పున్న అకారము వచ్చుచున్నదో లేదో మనకు ప్రధానము కాదు. అయా వర్తనముయొక్క మానము ననుసరించి శిరోవర్తనము నిర్మించుట ఉత్తమము. ఈ రీతిగా నిర్మించుటచేత వచ్చు అకారమే ముఖ్యము. దానికి ఆ సంజ్ఞను ఇచ్చి మనము వ్యవహరించవచ్చును.

ఇంత చెప్పి వివిధ గ్రంధమందు చెప్పబడిన వ్యత్యాసములను సాధ్యమైన వరకు సమన్వయము చేయుట ప్రయత్నము చేసి ఈ ప్రకరణమును పూర్తిచేసియున్నాము.

అగమ మరియు శిల్పశాస్త్ర ప్రవీణులు కలసి గ్రంధముల అవలోకనముచే పరస్పర సముంజసముతో ఈ విధములచే లింగములను నిర్మించి సాంకర్యములకు

అవకాశమివ్వక లోకకళ్యాణము కొరకై ఆలయమూర్తి నిర్మాణాదులను నిర్మించవలెనని వినయపూర్వకముగా విజ్ఞాపించుచున్నాము.

కామికాగమ [1-62] దీపార్ణవము 13[49-50] శిరోవర్తనములను చెప్పు సమయమున వెనుక చెప్పిన త్రిపుషాది నాల్గు వర్తనములు కాక పుండరీక, విశాల, శ్రీవత్స, శత్రుమర్దన అనే నాల్గు విధవర్తనములకు మానములను తెలిపి వాటికి ఫలములను ఈ రీతిగా చెప్పియున్నారు.

శిరోవర్తన మేతేషాం వక్ష్యే తత్ బహూధామతం ।
పుండరీక విశాలాకక్ష్యం శ్రీవత్సం శత్రుమర్దనం । ౫
అష్టాంశకేచతుర్భక్తే భాగభాగ వివర్ధనాత్ ।
భవంతి పుండరీకాది భేద బిన్నఫలాస్తమే ।
పుండరీకాద్యశప్రాప్తిః విశాలాద్విపులాంశ్రయం ।
ప్రాప్నోతి సర్వాం శ్రీవత్సాత్ విజయం శత్రుమర్దనాత్ । ౫౪

లింగశిరస్సు వెడల్పును (Radius) 8 భాగములుగా విభాగించి దానిలో నాల్గు భాగమందు ఒక భాగవర్తనము చేసిన యెడల ఆ లింగమునకు పుండరీక లింగమనిను రెండు భాగవర్తనము చేసిన యెడల విశాల లింగమనిను, మూడు భాగవర్తనము చేసిన యెడల శ్రీవత్స లింగమనియు, నాల్గు భాగవర్తనము చేసిన యెడల శ్రీవత్స లింగమనియు, నాలు భాగవర్తనము చేసిన యెడల శత్రుమర్దన లింగమని పిలువబడు చున్నది.

పుండరీక లింగముచే యశఃప్రాప్తియు, విశాలలింగముచే శ్రీప్రాప్తియు, శత్రుమర్దన లింగముచే విజయప్రాప్తమగును.

ఈ నాల్గు విధములు కామికాగమమందు విశేష విధిగా చెప్పబడి యున్నది.

# 18 సర్వతోభద్ర లింగము

మూలాదగ్రం సువృత్తంతు లింగోత్తుంగత్రిభాగకే ।
స్థలేవేషం తదేకాంశం వ్యోమాంశం యోని బంధితం ।
పూజాభాగం తదేకాంశం సర్వతో భద్రమే వచ ।

కాశ్యపశిల్పము 49 [132]
మానసారము 52 [56] మయమతే 33 [74]

ఇదివరకు చెప్పిన లింగములలో మూడు భాగములు అనగా [ఉత్సేధక్రమములో] బ్రహ్మ, విష్ణు, రుద్రాంశములు ఉండి ఒక్కొక్కటి ఒక్కొక్క ఆకారమందు [చతురశ్ర, అష్టాశ్ర, వృత్తము] ఉన్నదని చూచినాము. ఇపుడు సర్వతోభద్ర లింగములో ఈ రీతిగా చతురశ్రాది ఆకారములు లేవు. క్రిందనుంచి పైవరకు పూర్ణవృత్తమై ఉంటున్నది. దానిలోనే సమమైన మూడు భాగములును నిర్మించి పైన చెప్పిన రీతిగా బ్రహ్మ భాగమైన ఒక భాగమున్ను భూమిలోను, ఇంకొక విష్ణు భాగమును పూజాంశమై పెట్టవలెను. ఉత్సేదమాన క్రమముతో ఇది సర్వసమ లింగము రీతిగా ఉంటున్నది.

శిల్పరత్నములో సర్వసమ లింగమునకే సర్వతో భద్ర లింగమని చెప్పబడుట ఇదే కారణమై యుండును.

అజితాగమములో సర్వతో భద్ర నామ నిర్దేశనము లేదు.

ఇది సర్వసమ లింగ మానము రీతిగానే ఉంటున్నది. దీని విష్కంభము మరియు శిరోవర్తనములు సర్వసమ లింగమునకు చెప్పబడిన మానములోనే ఉండవలెననుట భావ్యము.

# 19 సార్వదేశిక లింగము

సార్వదేశిక లింగంతు వృత్తాకార మశేషతః । ౧౨౨
భూతవేద గుణాశం వా లింగో చ్ఛ్రేతువిభాజితే ।
అధోభాగంతు పంచాంశం వేదాశం మధ్యమంతుతత్ ।
పీఠంతు వేశయే దంశం శేషం పూజాంశ ముచ్యతే ।
సార్వదేశికలింగంతు ఏవమేవ ప్రకల్పయేత్ । ౧౩౪

కాశ్యపశిల్పము 49

సర్వతో భద్ర లింగ రీతిగానే మూలమునుండి అగ్రము వరకు వృత్తాకారమై యుండి బ్రహ్మ విష్ణు రుద్ర భాగముల ఉత్సేధమునందు హెచ్చుతగ్గులు ఉండటము సార్వదేశిక లింగమని చెప్పబడుచున్నది. బ్రహ్మ భాగము [భూమిలో ఉండటము] అయిదు అంశములు, పీఠములో ఉన్న విష్ణు భాగము నాలుగు అంశము, పూజా భాగము మూడు అంశములు ఉంటున్నది. విష్కంభము వ్యత్యాసము ఉండదు.

స్వాయామర్థార్ధ విస్తారం స్వస్తికం వా శివాధికం ।
వర్ధమానంచ తల్లింగం నామ్నాసుర గణైర్చితం ।
తత్సార్వ దేశికం జ్ఞేయం సర్వవర్ణహితావహం ।

సర్వసమాది నాలుగు లింగములలోను ఉత్సేధ మాన వ్యత్యాసమై యున్న సార్వదేశిక లింగమును నిర్మించవచ్చును. అనగా పూర్ణవృత్తమైయున్న లింగములో వర్ధమానాది లింగములకు చెప్పబడిన బ్రహ్మాది భాగముల ఉత్సేధ మానమును భూమి లోను, విష్ణుభాగమును పీఠములోను, రుద్రభాగమును పూజాంశమైయు పెట్టవచ్చును. వెడల్పులో [వ్యాసము] మాత్రము వ్యత్యాసమై యుంటున్నది. ఎట్లనగా సర్వసమం చేసినపుడు పైనచెప్పిన రీతిగా ఉత్సేధములో బ్రహ్మభాగము అయిదు అంశములు

విష్ణు భాగము నాల్గు అంశములు, రుద్ర భాగము మూడు అంశములు పెట్టవలెను దీని విష్కంభము సర్వసమ లింగమునకు ఉన్నరీతిగా అనగా ఉత్సేధము యొక్క 16లో అయిదు అంశము. అర్ధమానము శివాధిక. స్వస్తిక లింగములోను సార్వదేశిక [పూర్ణవృత్తము] చేసినపుడు ఆయా లింగముయొక్క ఎత్తునందు నాల్గులో ఒక అంశము వెడల్పు [వ్యానము] పెట్టవలయును. అపుడు ఆయా పేరున సార్వదేశిక లింగము లగును. సార్వదేశిక లింగములలో సర్వసమ లింగమందు విష్కంభ వ్యత్యాసముండదు. ఉత్సేధ క్రమములో వ్యత్యాసము ఇతర వర్ధమాన, శివాదిక, స్వస్తిక లింగమందు విష్కంభ మాత్రము వ్యత్యాసమై ఉత్సేధ క్రమములో వ్యత్యాసముండదు. ఈ క్రింద పట్టీలో కనపరచుచున్నది.

### సార్వ దేశిక లింగము ఆద్యంత వృత్తము

| దేవతా విభాగము | సర్వతోభద్ర సర్వ సమము అంశము | సర్వసమ | వర్ధ మాన | శివాధిక | స్వస్తిక |
|---|---|---|---|---|---|
| రుద్రభాగము | 1 | 3 | 9 | 4 | 4 |
| విష్ణుభాగము | 1 | 4 | 8 | 3 | 4 |
| బ్రహ్మభాగము | 1 | 5 | 7 | 3 | 3 |
| విష్కంభము ఉత్సేధనములో వెడల్పు | 5/16 | 16/5 | 1/4 \ | 1/4 | 1/4 |
| శిరోవర్తనము | త్రపుష | త్రపుష | ఛత్రాకార | అర్ధ చంద్ర | కక్కుటాండము |

# 20 త్రైరాశిక లింగము

నమలింగేత్రయం నందభాగం కృత్వావిచక్షణః ।
షడంశై వర్తుళంనాహం సప్తాంశై మధ్య నాహకం । ౧౨౬
వసుభాగ మధోనాహం యత్తత్త్రైరాశికం భవేత్ ।
సార్వ జాత్యర్థకం శస్తం త్రైరాశిక మిదం వరం ।

కాశ్యపశిల్పము 49

మయమతం 33 [4] కామికాగమం 62

నమలింగములో ఆద్యంత పూర్ణవృత్త లింగము సర్వతోభద్ర లింగమని చెప్పిన తరువాత పునః దానిలో ఉత్సేధ క్రమములో హెచ్చు తగ్గు వ్యత్యానముతో సార్వదేశిక లింగము అని చెప్పబడినది గదా! సర్వతో భద్ర మరియు సార్వదేశిక లింగములో విష్కంభ వ్యత్యానము వుండదు. ఈ రెండును చేర్చి అనగా అద్యంత వృత్తము మరియు విష్కంభములో వ్యత్యానమును చేసి విశేషణ కల్పనలో త్రైరాశిక లింగమగు రీతిను చెప్పుదురు.

లింగ ఉత్సేధమును తొమ్మిది భాగములుగా విభజించి దానిని ఆరవ భాగమంత రుద్ర భాగముయొక్క చుట్టుకొలతను, ఏడవ భాగమంత విష్ణు భాగముయొక్క చుట్టు కొలతను, ఎనిమిదవ భాగమంత బ్రహ్మభాగముయొక్క చుట్టుకొలతను, పెట్టడం త్రైరాశిక లింగమని పిలువబడుచున్నది.

ఇదివరకు చెప్పిన లింగములలో వెడల్పు కాని చుట్టుకొలత గాని క్రిందనుంచి పైవరకు ఒకే సమానముగా ఉండినదను చూచియున్నాము. ఈ త్రైరాశిక లింగములో రుద్రభాగము చుట్టుకొలతనుంచి ఒక అంశము అధికమై విష్ణుభాగము, విష్ణుభాగమునుంచి ఒక అంశము అధికముగా బ్రహ్మభాగము ఉండి ఈ లింగము క్రింద క్రిందకు స్థూలమై యుంటున్నది.

శిల్పరత్నములో ఈ త్రైరాశిక లింగము యొక్క కొలతలు కాశ్యపశిల్పమునకు వ్యతిరేకముగా అనగా బ్రహ్మ భాగ చుట్టుకొలతనుంచి ఒక అంశము అధికముగా విష్ణు భాగ చుట్టుకొలతను. దానినుంచి ఒక అంశము అధికముగా రుద్ర భాగవు చుట్టుకొలతను ఉండి పైనపైన పెద్దదియై యుంటున్నది.

లింగోత్సేధేతు నందాంశే షట్సప్తవసు భాగకై: ।
బ్రహ్మ విష్ణ్వీశ భాగానాం క్రమాన్నాహః ప్రకీర్తితాః ।
లింగత్రైరాశికంన్నామ భవేత్ సర్వసమేతుతత్ ।

శిల్పరత్నం 2

ఈ రెండు లింగములయొక్క శిరోవర్తనము సమలింగమునకు చెప్పిన త్రపుషాకారమును పెట్టవలెను. అథవా ఛత్రాకారమును పెట్టవచ్చును. ఈ రెండు లింగములును త్రైరాశిక లింగమని చెప్పవలసినదే కాని స్థూలాగ్ర లింగమని స్థూల మూలమని పిలువకూడదు.

కామికాగమమందు ఇంకొకటి విచిత్ర కరమైన లింగము చెప్పబడుచున్నది. కాని ఆ లింగము ఆర్ష లింగములో వివరించిన రీతిగా ఉంటున్నది. అనగా అచట స్థూల మధ్య పదమును ఉపయోగించియున్నారు.

కృత్వానందాంశ లింగోచ్ఛంబల బంధ గుణాంశకం ।
షట్ సప్తాష్టాంశ మానంతు వృత్త అష్టాస్రయుగాశ్రవే ।
త్రైరాశికమిదం శాస్త్రం .................. ।

కామికాగమము ౬౨

# 21 ఆర్ష లింగమం

సస్థూల మూల లింగం క్షయమధ్యంవై పిపీలికామధ్యం ।
లింగంతు శిరస్థూలం హ్యార్షలింగం చతుర్భేదం । ౮౫
మయమతే 33

ఆర్షలింగములు 1 స్థూలమూల, 2 క్షయమధ్య, 3 పిపీలికామధ్య, 4 శిరస్థూల అని నాలుగు విధములు.

వేదాశ్రౌ బ్రహ్మ విష్ణ్వంశౌ లింగేష్వార్షేషు సంమతౌ ।
శివాంశో వృత్తమేవ సౌవ్చిరసోవా నవ_ర్తనం । ౭
ఈశాన శివగురుః 2–38
మయమతే 33 [86]

బ్రహ్మ విష్ణ్వంశ భాగములు చతురశ్రమై యుండి శివాంశమైన పూజాభాగము వృత్తమై యుండవలెను. ఈ లింగములకు శిరోవర్తనము ఉండినను లేకపోయినను దోషమగుటలేదు.

ఈ లింగములలో అధికారి భేదమునుగాని వేరు విధమైన మాన వ్యత్యాసముగాని, లింగభేదముగాని చెప్పబడనందున ఇది సర్వసమ లింగమని అర్థమగును.

ఈశాన శివగురు పద్ధతి గ్రంథము 38వ అధ్యాయములో

అథలింగం స్థూలమూలం స్థూలమధ్యం కృశంతథా ।
ఆర్షం స్థూల శిరస్కంచ చతుర్ధేతి మయోదితం । ౧

1 స్థూలమూల, 2 స్థూలమధ్య, 3 మధ్యకృశం, 4 స్థూలశిరః అని నాలుగు విధములు. పైన చెప్పన విషయమునే పునఃశబ్దములతో చెప్పబడినది.

ఈ లింగమునకు ప్రత్యేకమై ఏ రీతిగాను మానము చెప్పబడలేదు. మానవిచారమై విమర్శించిన యెడల త్రైరాశికలో చెప్పబడిన మానమును వ్యత్యాసవరచినట్లయితే అది ఆ విధమైన మానములగును. కాని ఆ ఆరు విధ మానములున్ను ఆది, మధ్య, అంత్య ఈ మూడు స్థలములోనే సమన్వయము చేయవలసినదిగా ఉన్నది. బ్రహ్మ, విష్ణు' రుద్ర భాగములను అనుసరించి చెప్పబడినట్లయితే

| | స్థూలమూల | స్థూలాగ్ర | స్థూలమధ్య | | పిపీలికామధ్య | క్షయమధ్య |
|---|---|---|---|---|---|---|
| రుద్రభాగము | 6 | 8 | 6 | 7 | 7 | 8 |
| విష్ణుభాగము | 7 | 7 | 8 | 8 | 6 | 6 |
| బ్రహ్మభాగము | 8 | 6 | 7 | 6 | 8 | 7 |

ఈ రీతిగా మూడు విధములలో మాన భేదముచేత ఆరువిధ లింగములు అగును.

త్రైరాశిక లింగమునకు ఆర్షలింగమునకు భేదము ఏమనగా త్రైరాశిక లింగములో బ్రహ్మ విష్ణు భాగములు వృత్తమై యున్నవి. ఆర్షలింగములో బ్రహ్మ విష్ణు భాగములు చతురశ్రమై యున్నది. గాక త్రైరాశికములో వికల్పముగా మద్యే సూలము అయివుండి బ్రహ్మవిష్ణు భాగము చతురస్ర అష్టాస్రము కనబడుచున్నది. త్రైరాసికములో మానభేదము ఉండినను బ్రహ్మ విష్ణు భాగములు చతురస్రమైయే ఉంటున్నది.

నైవైతేషాం మూలం లింగానాం శోధయేత్ మతిమాన్ । ४०
అజ్ఞానా దపి మోహాత్ సంశోధ్య మూలమేవ దోషకరం ।

మయమతే 33

ఈశాన శివగురు 2 [38]

[8]

బుద్ధిమంతుడైనవాడు ఆర్ష మరియు స్వాయంభువ లింగముల విచారములలో దాని మూల కారణమును [దేనికి ఆ రీతిలో ఉన్నది అనే ప్రశ్నను] ప్రశ్నింపకూడదు. అజ్ఞానము చేతనో, మోహము చేతనో మూలకారణమును శోధించుట దోషమగును, అనగా మన జ్ఞానమునకు అది అతీతమై యున్నందున అర్థమగుటలేదు. ఈ త్రైరాశిక లింగము మరియు ఆర్ష లింగములు ఏ రీతిగా ఉన్నప్పటికిని బ్రహ్మ విష్ణు భాగములు కనబడుటలేదు. బ్రహ్మ భాగము భూమిలోను, విష్ణు భాగము పీఠములోను ఉంటున్నవి. కేవలము వృత్తాకారమైన రుద్ర పూజా భాగము మాత్రమే మన దృష్టికి గోచర మగుచున్నది.

———: o :———

# 22 ధా రా లిం గ ము

ధారాలింగమధోవక్ష్యేచ్ఛ్రూయతాంతు ప్రజాపతే ।
పదాదూర్ధ్వక పర్యంతం ధారాలింగం ప్రశస్తకం

పూర్వకారణ (9)

దీపార్ణవ 13 (39)

ధారాలింగంతు ధారాస్యాత్ సర్వప్రాణి హితావహం॥ 127

కాశ్యపశిల్పము [49]

ఏకాదిధారయా వృధాద్ద్యా శతధారా వసానకం ।
ధారాలింగం ప్రశస్తంస్యాత్ —————————— 33

కామికాగమ 62

పూజాభాగము వృత్తాకారముగా ఉండవలెనని ఇదివరకు తెలిసిఉన్నది కదా ! దానిలోను ధారాదులు అనగా మూలతోకూడిన పట్టికలు ఉన్నయెడల అది ధారా లింగము అని చెప్పబడుచున్నది. పూజాభాగములో 4, 8, 16, 32, 64 పట్టికలు వుండనచ్చును అని క్రింద వ్రాపిన పట్టికలో చూపబడినది. కాన ఒక పట్టికనుంచి వంద పట్టికల వరకు ధారాలింగమును రచించవచ్చునని కామికాగమ గ్రంధములో చెప్పబడినది. ఈ సందర్భములో బ్రహ్మ విష్ణు భాగములు ఏ రీతిగా ఉండవలసినది? పై శ్లోకము [పూర్వకారణము] ప్రకారముగా "పదాదూర్ధ్వక పర్యంతం" అనగా బ్రహ్మ విష్ణు రుద్ర భాగములలోను ఇష్టమొచ్చినంత పట్టికలు ఉండవచ్చుననియు, ఇది ప్రశస్తమనియు ముందు శ్లోకములో చెప్పబడినది.

అధోవేదాష్టకం కుర్యా త్తధూర్ద్వే త్వష్టధారయా ।
పూర్ద్వేషోడన ధారాశ్చ భోగాదీన్ లభతే సుఖం ।

దీపార్ణవము

అని చెప్పబడినది గాన బ్రహ్మ విష్ణు భాగములను చతురస్ర, అష్టాస్రముగాను రచించి పూజాభాగములో ఇష్టమువచ్చినంత ధారలను రచించవచ్చుననియు, అథవాలింగము యొక్క ఆద్యంతమును ధారతో నిర్మించవచ్చుననియు భావించవచ్చును. ఇదిగాక సుప్రభేద [33]ము, దీపార్ణవము [13] అధ్యాయనములలో ఐదు, ఏడు, తొమ్మిది, పన్నెండు, పదుహేరు, ఇరువది, ఇరువది నాలుగు, ఇరువది ఎనిమిది ధారలు పూజాభాగములో ఉండవలెనని చెప్పబడినది. విషు బ్రహ్మ భాగముల విచారమై చెప్పబడనందున అచట అష్టాస్ర చతురస్రము గానే ఉండవలెనని మనము భావించవలసినది. క్రింద పట్టికలో చూచిన యెడల బ్రహ్మ విష్ణు రుద్ర భాగములలో యున్న పట్టికలలోను వ్యత్యానము కనబడుచున్నది దానినంతా గమనించి ముందు చెప్పబడు ఫలాను సారముగా ఇష్టము అయినంత ధారలతో లింగమును నిర్మించవచ్చును.

| | పూర్వకారణ దీపార్ణవము ౧౩ (౪౦) | కాశ్యపశిల్పము ౪౯ (౧౩౮) | | | శిల్పరత్నము ౨ (౧౦౫-౧౦౩) | | | మయమతము | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| పూజాభాగము | ౧౬ | ౪ | ౮ | ౧౬ | ౧౬ | ౩౨ | ౬౪ | ౧౬ | ౩౨ | ౬౪ |
| విష్ణుభాగము | ౮ | ౪ | ౮ | ౮ | ౮ | ౮౬ | ౩౨ | ౮ | ౧౬ | ౩౨ |
| బ్రహ్మభాగము | ౪ | ౪ | ౪ | ౪ | ౪ | ౮ | ౧౬ | ౪ | ౮ | ౧౬ |

# అశ్ర[ధారా]లింగము యొక్క ఫలము

అజితాగమము 4 [48]-[52]
కిరణాగమము 111-21 [45-50]

సాధకుడు అనగా ఫలార్థియై లింగమును ప్రతిష్ఠించువాడు అశ్రయుక్తమైన ఈ ధారా లింగమును స్థాపించవలెననియు. ధారల సంఖ్య అనుగుణమై ఈ క్రింద చెప్పబడిన ఫలములను పొందవచ్చుననియు పై చెప్పిన రెండు ఆగమ గ్రంధములలో చెప్పబడియున్నది. ఈ పూజా భాగములో ఉన్న అశ్ర [ధారా] సంఖ్యములని భావించవలెను.

| అశ్రసంఖ్య (పలకలసంఖ్య) | అజితాగమరీత్యా ఫలము | కిరణాగమరీత్యా ఫలము |
|---|---|---|
| 1 | వైరినాశనము | శత్రువర్ధనము |
| 2 | పుత్రవర్ధనము | పుత్రవర్ధనము |
| 3 | వరద | వరద |
| 4 | — | చతుర్వర్గ ఫలప్రదము |
| 5 | ధనప్రద | మరణము |
| 6 | భోగధము | భోగదము |
| 7 | ద్వేషద | ద్వేషకృత్ |
| 8 | క్లేశద | కీర్తి వర్ధనము |
| 9 | ఉచ్చాటనము | ఉచ్చాటనము |
| 10 | — | మహావ్యాధికరము |
| 11 | వ్యాధిద | — |
| 12 | భయావహము | భయనాశనము |

| అశ్రసంఖ్య (పలకలసంఖ్య) | అజితాగమరీత్యా ఫలము | కిరణాగమరీత్యా ఫలము |
|---|---|---|
| 13 | శోషణము | శోషణము |
| 14 | — | — |
| 15 | ధన్య | ధన్య |
| 16 | సుఖావహము | సుఖావహము |

మంచి ఫలాపేక్షతో తత్తదుక్త సంఖ్యాశ్రములను లింగములో నిర్మించవలసినది. దుష్టకార్యములకై [మారణము, శోషణము, ఉచ్చాటకము] ఉపయోగించగూడదు.

ఏకానేకే బోక్తలింగే శివాంశే ।
కుర్యాద్ధారాం......... 61
మానసారే 52

ఏకలింగ మనగా బ్రహ్మ విష్ణు శివాత్మకమైన సర్వతోభద్ర లింగములలోను. బహులింగమనగా బ్రహ్మభాగము లేని లింగములో ధారాలింగమును నిర్మించవచ్చును. బహులింగములో పంచ మరియు నవ లింగములు ధారా లింగముగా ఉండవచ్చునని అర్థమగుచున్నది.

——: o :——

# 23 సహస్ర లింగము

సర్వతో భద్ర లింగేతు ధారాస్యుః పంచవింశతిః
సప్తపర్ణ దళాకారాః సమాన్సర్వా స్సమాంతరాః
ఏకైక స్యాంతు ధారాయాం చత్వారింశ త్ససంఖ్యయా
కుర్యాత్సమాని లింగాని స్యాత్త లింగ సహస్రకం ॥ 110

శిల్పరత్నము 2
దీపార్ణవము 13 [42-43]

సహస్ర లింగమును సర్వసమ లింగములోనే చేయవలసింది అని నియమము. పూజాభాగములో సప్తపర్ణ [ఏడు అరటి ఆకులు చేరిన] ఆకారములో సమాంతరమై 25 భాగములున్న అనగా పట్టీకలను నిర్మించి ఒక్కొక్క పట్టికలోను పైనుంచి క్రిందకు ఇరువది జత అనగా నలుబది చిన్నచిన్న ఆకారములు కలిగిన లింగములను నిర్మించిన యెడల [40×25 – 1000] సహస్రలింగము లగును. ఈ చిన్నచిన్న లింగముల ఆకారము కేవలము నిర్దేశనము మాత్రము.

ఏకానేకే ప్రోక్తలింగే శివాంశే కుర్యాధారాం షోడశాదిద్వయేన ।
వృద్యాధారాయ త్సహస్రావసానం ధారాలింగే చైవముక్తం హితంవై ॥

మానసారము 52
[61]

లింగముయొక్క పూజాభాగము ఎత్తును 6 భాగములుగా విభజించి క్రింద భాగములో 16 ధారలను పైనపైన ద్విగుణిత క్రమములో ధారలను కల్పించి ఆ ఒక్కొక్క ధారలోను ఒక్కొక్క లింగమును గుర్తించిన యెడల 16+32+64+128+256+512 =1008 లింగములు అగును.

సమఖండే శివాయామే రుద్రభాగ వినిర్మితే ।
ఏకాధికే నవత్యంశే విషమాంశ నివేశితం । ॥34॥
సైక సహస్ర లింగానాం...

కామికాగమ 62
[గ్రంథాంతరేచ]

సమలింగ పూజా భాగముయొక్క ఉత్సేధమును 11 భాగములుగా నిర్మించి, ప్రతి భాగములోను చుట్టూ 91 లింగములను గుర్తించిన యెడల 91 X 11 – 1001 లింగములు అగును.

---:o:---

# 24 శైవేష్ట్య లింగము

ఈ శైవేష్ట్య లింగము దీపార్ణవ గ్రంథములో చెప్పబడినది. ఇంక ఏ గ్రంథము లోను దీనియొక్క నామ నిర్దేశనము కనపడలేదు. కాని దీనియొక్క స్వరూప, మానాది వివరణము ఏ గ్రంథములోను కనబడుటలేదు.

---:o:---

# 25 ముఖ లింగము

.........ముఖలింగం విశేషతః ।
శివాంశాధిక లింగేతు ముఖలింగం ప్రకీర్తితం
పూజాంశంతు త్రిధాకృత్వా సార్ధభాగం ముఖం భవేత్ ।
దీపార్ణవము 3 [143-146]

శివాధిక్య లింగములో ముఖ లింగమును కల్పించవలెననియు, పూజా భాగమును మూడు భాగములుగా విభాగించి దానిలో ఒకటిన్నర భాగములో ముఖమును నిర్మించ వలసినది. మరియు ఈ రీతిగా మూడు భాగములలో పై భాగముయొక్క మధ్య నుంచి క్రిందనున్న అర్ధభాగములో గ్రీవా, భుజోప నిష్క్రాంతిః అనగా కంఠము మరియు భుజములు ఉన్నరీతిగా నిర్మించవలయును పూజాంశము యొక్క క్రిందనున్న 1/3 భాగము ఖాళీగా వృత్తాకారమై యుంటున్నది. భుజము, కంఠము, శిరస్సు ఈ మూడు ఆకారము మాత్రము కనబడుచున్నవి. ఈ లింగమునకు వ్యక్తావ్యక్తలింగమనియు పేరు

చతుర్ముఖంవా త్రిముఖం ఏకవక్త్రయుతం భవేత్ ।
దీపార్ణవము

ఈ ముఖ లింగములలో ఏకముఖము, త్రిముఖము, చతుర్ముఖమునను నిర్మించ వచ్చును.

ముఖలింగం త్రివక్త్రంవా ఏక వక్త్రం చతుర్ముఖం ।
సమ్ముఖం చైక వక్త్రం స్యాత్రివక్త్రే వృష్టతోనహి । 92
రూపమండనము [4]
పూర్వకారణము 9
కామికాగమము 62

ఏకవక్త్రలింగమనగా ముందువైపు కనబడునదియు [ఏకద్వారము ఉన్నప్పుడు] త్రివక్త్ర లింగమనగా ముందువైపు ఇరుప్రక్కల ద్వారమున్నయెడల అయా ద్వారాభిముఖముగాను, చతుద్వార మున్నయెడల చతుర్ముఖ లింగములను ఆయా ద్వారాభిముఖముగా నిర్మించవలసినది

న కుర్యా ద్విముఖం లింగం తచ్ఛస్త్ర మభిచారకే ।

ఈశాన శివగురు 3–40

ద్విముఖ లింగమును అభిచారిక కార్యములోను మరియు శత్రునాశన కార్యములోను ఉపయోగించవలసినది గనుక ఆలయములో నిర్మించగూడదు. ఈ రీతిగా నాలుగు ముఖములయొక్క లింగములను నిర్మించినచో అదే పంచముఖముగానగును. ఎట్లనగా

సద్యోజాతం తథా ఘోరం తత్పురుషం చతుర్థకం -
పంచమంచ తథేశానం యోగినామప్య గోచరం - 94

రూపమండనము 4

నాలుగు దిక్కులకు అభిముఖముగా నున్న ముఖములు క్రమముగా సద్యోజాత. వామదేవ. అఘోర. తత్పురుషములని నిర్దేశించి ఐదవ ఈశాన శిరస్సు ఊర్ధ్వభాగములో ఉన్నదని భావించవలెననియును, అదియోగ పురుషులకు అగోచరము అనియు చెప్పబడి యున్నందున దానిని ప్రత్యేకముగా కల్పించనక్కరలేదు.

ఏకవక్త్రం చతుర్వక్త్రం గ్రామాదిష్వేవ విన్యసేత్ ।
ద్వివక్త్రం పర్వతేరణ్యే పరరాష్ట్రాంతికే పిచ ।
పంచవక్త్రం ద్వివక్త్రం వాలింగం రాష్ట్రాంతరేగిరా ।

దీపార్ణవము 3

ఈశానగురు 3 [52, 53]

గ్రామములో ఏకముఖ లింగములను, చతుర్ముఖ లింగములను స్థాపించవచ్చును. ద్వివక్త్రము పంచవక్త్ర లింగములను పరరాష్ట్రముయొక్క హద్దులో స్థాపించవలయును.

వెనుక చెప్పబడిన రీతిగా ద్వివక్త్రము అభిచారికమయినందున రాజులు పర రాష్ట్ర శత్రువునుంచి రక్షణ కొరకై ద్వివక్త్రమూర్తిని రాష్ట్ర హద్దులో నిర్మించవలసినది యని యర్థము ఇచట పంచ వక్త్రమును ద్వివక్త్ర రీతిగానే రాష్ట్ర హద్దు ప్రదేశములలో స్థాపించవలెనని చెప్పబడినందున మొదటి చెప్పబడిన పంచ వక్త్రమునకు ఈ పంచ వక్త్రమునకు వ్యత్యాసము కలదు. దానిలో 5దవ ముఖమును ధ్యానగోచరమై పెట్టవలెనని చెప్పబడినందున ఇచ్చట 5దవ ముఖములను నిర్మించిన లింగమని అర్థకల్పన చేయుటకు అవకాశము కలదు.

హస్తాది పంచ హస్తాంతం ముఖలింగం ప్రకల్పయేత్ ।
అతః పరం న కుర్వీత మిశ్రలింగం శుభేచ్ఛయా । ౫౬

ఈశానగురు – 2 – 40
దీపార్ణవము 13 – 51

ఒక హస్తమునుంచి ఐదు హస్తములవరకు మాత్రమే ముఖలింగమును నిర్మించవలెను. దానికి పైగా నిర్మించగూడదు.

——: ० :——

# 26 బహు లింగ ప్రతిష్ఠా విధానము

ఇదివరకు వివరించిన లింగములన్నియు ఒక ఆలయ [గర్భ గృహము] ములో ఒక లింగమున్ను ప్రతిష్ఠించు విధానమును చెప్పబడినది. ఈ మొదట తెలియపరచిన రీతిగా

వేదాశ్రాభం బ్రహ్మభాగేచ మూలే
చాష్టాశ్రాభం మధ్యమే విష్ణుభాగే ॥
వృత్తాకారం చాగ్రకే త చ్ఛివాంశం ॥
కుర్యాత్సర్వం చైకలింగ క్రమేణతు ॥

మానసారము 52

క్రింద బ్రహ్మభాగము చతురశ్రమైయు మధ్య విష్ణుభాగము అష్టాశ్రమైయు పైన రుద్రభాగము వృత్తాకారమైయు వుంటుట ఏకలింగ విషయమందు సామాన్య లక్షణము కాని సర్వతోభద్ర, సార్వదేశిక, ధారాలింగములలో ఈ చతురశ్ర, అష్టాశ్ర, వృత్త క్రమములో వ్యత్యానము ఏర్పడినను బ్రహ్మ విష్ణు రుద్రభాగముల కల్పనము ఉంటున్నది దీనికి త్రికర్ణ లింగమనియు పేరు. ఇపుడు బహులింగ స్థాపన విషయమును పరిశీలించు చున్నాము.

బహులింగమనగా ఒకటికిని పెక్కు లింగములను ప్రతిష్టించబడునని తాత్పర్యము. కాని ఈ బహులింగములును ఐదు, అథవా తొమ్మిది అని రెండే విధముగా నిర్ణయించి యున్న విషయము అనేక గ్రంథములలో కనబడుచున్నది. దీనిలోని విశేషము ఏమనగా ఇది మూడు కర్ణములచే కూడినదై యుండదు.

బహుధా సర్వలింగేషు, త త్త్రికర్ణం నకారయేత్ । 36
ద్వికర్ణం బహులింగేతు త్రికర్ణం చైక లింగకే ।
బహు లింగోదయే సర్వే బ్రహ్మభాగం వినోదయం ॥

అనగా బహులింగములో బ్రహ్మభాగము ఉండదు. కేవలము విష్ణు రుద్ర భాగములే ఉంటున్నవి దీనికి ద్వికర్ణమని సంజ్ఞ. అనగా ఇష్టమైన ఉత్సేధము కలిగిన లింగములో బ్రహ్మభాగము మంతికొలత తీసివేయవలయును అని అర్థముకాదు లింగము యొక్క ఉత్సేధములో బ్రహ్మ దేవతాంశ కల్పనము ఉండక లింగ ఉత్సేధమును కేవలం రెండు భాగములుగా చేసి విష్ణుభాగమును పీఠములోను, రుద్రభాగమును పూజాంశముగాను రచించటము అని తాత్పర్యము. దీనిలో అనగా రెండే భాగములు ఉన్నప్పటికిన్ని సర్వసమాధి నాల్గువిధమానములో [కొలతలో] విష్ణు రుద్ర భాగములను కల్పించు విధానమును ఈ క్రింద పట్టీలో ఇవ్వబడినది గావున దీనియొక్క విష్కంభమును కూడ [అడ్డకొలత] ఈ ముందు చెప్పబడుచున్నది. మరియు శిరోవర్తనము సర్వసమాది లింగములకు ఉన్న రీతిలోనే నిర్మించవలెను. కాని విష్కంభ మానమును వివరించునపుడు కొన్ని వికల్పమానములు చెప్పబడును. అవుడు శిరోవర్తన మానములు సరిపొందక పోవచ్చును. ఆ సందర్భములో ఛత్రాకార శిరోవర్తనము నిర్మించునది శాస్త్రసమ్మతము.

ఇదికాక పంచ, మరియు నవ లింగముల ప్రతిష్ఠలో నిర్మింపబడు లింగములలో పరస్పర వ్యత్యాసము ఉండకూడదు సర్వసమాది మానములు, విష్కంభములు, శిరోవర్తనములు అన్నియు ఒకే సమముగా ఉండవలయును.

ఇక దీనియొక్క విష్ణు రుద్రాంశమాన కొలతలను సర్వసమాది లింగములలో ఏ రీతిగా నిర్మించబడునది చెప్పబడుచున్నది.

ద్విభాగం సమకర్ణం స్యాద్విష్ణు రుద్రాంశ తత్సమం ।
అథవా తుంగ నవమం వేదం నారాయణోదయం ।
పంచాంశం శివోదయం స్యాత్ వర్ధమాన మితి స్మృతం ।
అష్టాదశాంశకం తుంగే వైష్ణవం చాష్ట భాగికం ।
దశాంశం శివోదయం స్యాచ్ఛివాంశం లింగమీరితం ।
ఉత్సేధే దశ భాగేతు విష్ణుతుంగం షడంశకం ।
వేదాంశంతు శివాంశం స్యా త్స్వస్తికం బహులింగకం । 55

మానసారము 52

| భాగములు | సర్వసమ | వర్ధమాన | శివాధిక | స్వస్తిక |
|---|---|---|---|---|
| రుద్రభాగం | 1 | 5 | 10 | 4 |
| విష్ణుభాగం | 1 | 4 | 8 | 6 |
| మొత్తం | 2 | 9 | 18 | 10 |

ఆయా లింగముల ఉత్సేధమును పట్టీలో కనపరచిన మొత్తమంశముల సంఖ్యతో భాగము చేసి విష్ణు రుద్రాంశములను ఉత్తమక్రమములో విభాగించిన యెడల సర్వసమాధి భేదములు అగును.

ఇకముందు దీనియొక్క ఉత్సేధ మానమును నిర్ణయించియున్నారు. ఆ ప్రకారము నవలింగము కల్పనలో పదిహేను నుంచి పదిహేడు అంగుళముల వరకును, పంచలింగ కల్పనములో పదిహేను నుంచి పదునెనిమిది అంగుళముల వరకు ఏర్పడియున్నది.

బహుధా స్థాప్య లింగం వా నవలింగస్య సంఖ్యయా ।
పంచా దశాంశాంగులం మానం యన్మానం నవలింగకే ।
సప్త దశాంగులాం తంచ పంచదశాంగుల మారభేత్ ।
స్థాప యే త్పంచలింగేతు దధూర్ద్వే నతుకారయేత్ ।
తత్రిపాద కరాదూర్ధ్వం నాధికం సర్వతుంగకే ॥

మానసారము 52 [34, 35]

దీనియొక్క విష్కంభమానము ఈ రీతిగా ఉంటున్నది.

త్రిచతః పంచాంగులాంతం విస్రుతం బహులింగకే ।
అధవా తుంగమానేన త్రిచతుః పంచభాగికం ।
తత్తదేకాంశ విస్తారం బహులింగ విశాలకం । 38

మానసారము 52

వెనుక చెప్పబడిన ఉత్సేధమానములకు అనుసారముగా ఉత్సేధముయొక్క 1/3, 1/4, 1/5 భాగములంత వెడల్పును పెట్టవచ్చును. ఇది మూడు అంగుళములకు తక్కువగాను, ఐదు అంగుళములకు పైగాను ఉండకూడదు.

పంచలింగ స్థాపన విషయములో......
......పంచలింగ విధింశృణు ।
మధ్యే సదాశివం స్థాప్య పురుషం పూర్వత స్తథా ।
అఘోరం దక్షిణేస్థాప్య సద్యం పశ్చిమ త స్తథా । 129
ఉత్తరే వామదేవంచ అథకోణేషువా బుధః ।
కోణేషుచ మహాదిక్షు సంవీక్ష్య ధ సదాశివం । 130
పృథక్ పృథక్ విమానాని శేషకర్మంతు పూర్వవత్ ।
పంచలింగ విధిర్హ్యేషా —— సుప్రభేదాగమము 36
నవలింగ స్థాపన విషయములో ——
—— నవలింగ విధింశృణు । 131
తేషాం విమానం పురోక్తం అష్టదిక్షు విధీయతే ।
సదాశివం సమీక్ష్యైవ దిశాసు విదిశాసుచ ।

నవలింగ క్రమముగా మధ్యమందు సదాశివు నిన్ను, అష్టదిక్కులో అష్టవిద్యేశ్వరు లున్ను మధ్యలింగమునకు అభిముఖముగ స్థాపించవలయును. పంచలింగ విషయములో మధ్యమందు సదాశివు నిన్ను, పూర్వ దిక్కులో తత్పురుష నిన్ను దక్షిణ దిక్కులో అఘోర నిన్ను, పశ్చిమదిక్కులో సద్యోజాతనున్ను, ఉత్తరదిక్కులో వామదేవు నిన్ను స్థాపించవలెను. అథవా మధ్యములో సదాశివు నిన్ను మరియు తత్పురుషాది నాలుగు కోణ దిక్కులలో స్థాపించవచ్చును. చుట్టువున్న నాలుగు లింగములు మధ్యవున్న సదాశివ లింగమున్ను చూచునట్లుగా దానికి అభిముఖమై యుండవలయును. వృత్తాకారమైన లింగములో ముందుభాగము వెనుకభాగము అని తెలియుట విధానము ముందు లక్షణోద్ధార ప్రకరణమునందు తెలియును.

సహస్రలింగ స్థాపన విషయములో ——
—— సహస్రాణాం విధింశృణు ।

మధ్యే సదాశివం ప్రాగ్వ ద్విద్యేశానాం పృథక్ పృథక్ ।
చతుర్వింశచ్చ త్తలింగం విద్యేశానా వ్రతం బుధః
పాదాఖ్యస్య వదన్యేషా నామరూపాణి కీ ర్తితాః । 134
సుప్రభేదాగమము 36

నవలింగము ఉత్సేధ, విష్కంభ మానము

| | లింగ ఉత్సేధము | | ఉత్సేధముయొక్క మూడవభాగము | నాల్గవభాగము | ఐదవభాగము |
|---|---|---|---|---|---|
| | అం. | యవము | అం. యవ. | అం. యవ. | అం. యవ. |
| 1 | 15 | - | 5.0 | 3.6 | 3 0 |
| 2 | 15 | 2 | 5. 2/3 | 3.6 1/2 | 3.2 1/5 |
| 3 | 15 | 4 | 5.1 1/3 | 3.7 | 3. 4/5 |
| 4 | 15 | 6 | 5.2 | 3.7 1/2 | 3 1 1/5 |
| 5 | 16 | - | 5.2 2/3 | 4.0 | 3.1 3/5 |
| 6 | 16 | 2 | 5 3 1/3 | 4. 1/2 | 3.2 |
| 7 | 16 | 4 | 5.4 | 4.1 | 3.2 2/5 |
| 8 | 16 | 6 | 5.4 2/3 | 4.1 1/2 | 3.2 4/5 |
| 9 | 17 | - | 5.5 1/3 | 4.2 | 3.3 1/5 |

పంచలింగ ఉత్సేధ· విష్కంభము

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | 15 | - | 5.0 | 3.6 | 3.0 |
| 2 | 15 | 6 | 5.2 | 3.7 1/2 | 3.1 1/5 |
| 3 | 16 | 4 | 5.4 | 4.1 | 3.2 2/5 |
| 4 | 17 | 2 | 5.6 | 4.2 1/2 | 3,3 3/5 |
| 5 | 18 | - | 6.0 | 4.4 | 3.4 4/5 |

ఈ పైన వ్రాసిన పట్టీలో నవలింగ, పంచ లింగముల ఉత్సేధ (ఎత్తు) మరియు విష్కంభ (వెడల్పు) మానములు చెప్పబడి యున్నది. ఈ చెప్పబడిన మానములోనే పంచలింగ నవలింగములను నిర్మించవలసినది. నవలింగ మయినయెడల 17 అంగుళమునకు పైనను, పంచలింగమయిన యెడల 18 అంగుళము పైనను నిర్మించకూడదు. [8 యవము అంగు] [3/4 అంగుళము ఇంగ్లీషులో]

పంచలింగ, నవలింగ ప్రతిష్ఠాక్రమము

శైవాగమాను రీతిగా గర్భగృహమందు ఒక లింగమునకు పైన ఏ విగ్రహమును ప్రతిష్ఠించుటలేదు. పంచ మరియు నవలింగములు గర్భగృహము అవతల ప్రథమావరణ మందు నాల్గు దిక్కులోను, నవలింగమయిన యెడల ఎనిమిది దిక్కులోను. [కోణ దిక్కులో గూడ] మధ్యము ఉన్న ప్రధాన లింగమునకు అభిముఖముగా ప్రతిష్ఠించబడును. ఈ పంచ మరియు నవలింగ ప్రతిష్ఠా క్రమములో లింగమునకు బ్రహ్మభాగ ముండదు. కాక లింగము అద్యంత 18 అంగుళమునకు పెద్దదైయుండదు [18 అంగుళము – ఇంగ్లీషు 13½ అంగుళము] అపుడు పూజాభాగము సమలింగమునకు ఇంగ్లీషు 6 3/4 అంగుళము, వర్ధమానములో 7½ అంగుళము, శివాధిక్యములో 7½ అంగుళము స్వస్తికములో 5 2/5 అంగుళమునకు పెద్దదై యుండుటలేదు, అదే కనిష్ఠలింగమయిన యెడల 15 లింగములకు అద్యంత లింగములగును. దానిలో సర్వసమ వేసిన యెడల ఇంగ్లీషు కొలతప్రకారము 11 1/4 అంగుళము వుంటున్నది.

ఈ పంచ మరియు నవ లింగముల ప్రతిష్ఠాక్రమ మందు గర్భగృహ మరియు ఆలయముయొక్క నిర్మాణము ప్రత్యేకమై యుంటున్నది. అనగా గర్భగృహ మరియు ప్రథమావరణము అష్టాస్ర రూపములో నిర్మింపబడును. లేనియెడల పంచ మరియు నవ లింగములు మూల విగ్రహమునకు అభిముఖముగా ప్రతిషించుట సాధ్యమగుటలేదు. ఆ రీతిలో అష్టాస్రమై నిర్మితమైన ఆలయమందు పంచ మరియు నవలింగములను ప్రతిష్ఠించు నపుడు ఆగ్నేయాది కోణ దిక్కులో ఉన్న లింగములు మధ్యలింగమును వీక్షించుటచేత దిఙ్గ్మూఢమగును. అనగా కోణ దిక్కులో ఉన్న లింగములు దిగానుసారిగా వుండుట లేదుగనుక దోషమగును. శాస్త్రమందు విదిక్కును చూచి ఏ విగ్రహమును ప్రతిష్ఠించ

కూడదు అని చెప్పబడియున్నది కాని అంజనేయ విగ్రహమును మాత్రము అన్వయింపటలేదు. సిద్ధ పురుషులచేత ప్రతిష్ఠితమైన అథవా సిద్ధపురుషుడు సిద్ధిపొందిన ప్రదేశమందు పంచ మరియు నవలింగముల ప్రతిష్టకు ఈ దిగ్మూఢము అన్వయించుటలేదు ఏలననగా ద్విగానుసారిగ అనగా తూర్పుదిక్కు ననుసరించి సూర్యునికి అభిముఖముగా స్నానము చేయవలెనని నియమము. కాని నదీస్నానమందు నదీ ప్రవాహమునకు అభిముఖముగా స్నానము చేయవలెను. అపుడు దిక్కు విదిక్కు అని ఏ నియమము వుండుట లేదు. కాక నదీసంగమమందు సంగమమునకు అభిముఖముగా ఆలయమును ప్రతిష్ఠింప వలసినదని చెప్పబడినవుడు దిగ్మూఢదోష మగుటలేదు. ఈ రీతిగా పైన చెప్పిన పంచ మరియు నవలింగ ప్రతిష్ఠా విచారమందు సమాధానము పొందవలెను.

పూర్వ పశ్చిమ దిగ్మూఢం వాస్తుస్త్రీనాశం స్మృతం ।
దక్షిణోత్తర దిగ్మూఢం సర్వనాశకరం భవేత్ ।
సిద్ధాయతన తీర్ధేషు నదీనాం సంగమే షు చ ।
స్వయం భుభాణ లింగేషు త తద్దోషో నవిద్యతే ।

సజాతీయమైనవై ఖానస ఆగమమందు విగ్రహరూపములో ఇదేవిధముగా పంచ మరియు నవమూర్తులు ప్రతిష్టింపబడును, గర్భగృహమందు ఒక విగ్రహము, ప్రథమావర్ణమందు నాల్గు దిక్కులోను నాల్గుమూర్తులు ఆయా దిక్కును అనుసరించి ప్రతిష్టింపబడును. అంతియే నవమూర్తులను ప్రతిష్టింపబడును. కాక పంచ మరియు నవమూర్తులు ద్వితీయ, తృతీయ, తలమందును ప్రతిష్టించుటయు వున్నది అవుడు క్రింద గర్భగృహము బంధింపబడి ప్రథమావర్ణమందు ప్రతిష్టించబడును. పాంచ రాత్రాగమములో పంచ మరియు నవమూర్తులు గర్భగృహమందే ప్రతిష్ఠింపబడును. నాల్గు దిక్కులకు అభిముఖముగా నాల్గు విగ్రహములు, మధ్య ఒక విగ్రహము అథవా మధ్యమందున్న విగ్రహమును వీక్షించియు యుంటున్నది. మరియు ముఖలింగ రీతిగా మధ్యమూర్తికి నాల్గు పక్కలలోను చేరినరీతిగా పంచమూర్తి స్థాపన చేయుదురు. [పాద్మసంహిత, పౌష్కరసంహిత] ఈ ఆలయ స్వరూప నిర్మాణాదులను విగ్రహలక్షణాదులను ఇదే గ్రంథకర్తలచే వ్రాయబడిన భరతఖండ దేవాలయములు, మరియు ఆగమోక్తమూర్తులు అను గ్రంథమందు వివరముగా చూడవచ్చును.

——: o :——

# 27. అధ్య, అనాఢ్యాది లింగములు

సిద్ధాంత సారావళీ అను గ్రంధము చర్యాపాద 20వ అధ్యాయమందు అఢ్య, అనాఢ్య, సురేఢ్య మరియు సర్వసమ మనే నాల్గు విధ లింగములను వర్ణించి వాటి మాన ములను వివరించియున్నారు. ఈ మానములందు కొన్ని వ్యత్యాసములు కనబడినను బ్రహ్మాది భాగముల కొలతను చూచిన యెడల అఢ్యము స్వస్తిక రీతిలోను, అనాఢ్యము శివాధిక లింగ రీతిలోను, సురేఢ్య లింగము వర్ధమాన రీతిలోను, సర్వసమము సర్వసమ లింగముగానే యుంటున్నది గనుక వీటినే ఇంకొక పేరుతో పిలువబడినదని తోచు చున్నది. ఒక్కొక్క లింగము యొక్క వెడల్పును, శిరోవర్తనమును కూడ చెప్పి యున్నారు.

సార్ధాంశా (8 1/2) వసు (8) సార్ధసింధు (7 1/2)
చరణోనాగ(7 3/4) అద్రి (8) సాంఘ్ర్యష్టకే (8 1/4) ।
ఉధన్వా (7) మంగళ (8) నంద (9) దిక్ (8) ఫణి (8) నగైః (8)
త్రంశోన్నత్రిస్త్ర్యష్టకే (24) ।
ద్వైవ్యేజేత్ వికృతా [16] రసా [6] షా [5] జలధి [4]
త్ర్యంశా [3] న్వితేష్వంశకైః ।
అఢ్యానాఢ్య సురేఢ్య సర్వసమకే లింగే విదుర్విస్తృతిః ।

చంద్రార్ధ మాఢ్యేత్రపుషంత్వనాఢ్యే లింగే సురేఢ్యే చరణాయుధాంఢం,
ఛత్రం శిరః సర్వసమేతు కుర్యాత్ పృథక్ పృథక్ భిన్నశిరశ్చతుర్ధా ।
సిద్ధాంత సారావళీ

దీపార్ణవ గ్రంథ 13వ అధ్యాయమందు ఈ రీతిగా చెప్పబడియున్నది.

మృత్‌దారు లోహశైలానాం ద్వైర్ఘ్యే భక్తే జినాంశకైః ।
కార్యః షట్సప్తాష్ట నవాంశకైశ్చ విస్తరః ।
చతుర్విధోహి విష్కంభకర్తవ్యః శాస్త్రపారగైః ।
సుర గణార్చితా నాఢ్య అఢ్య సర్వసమో భవేత్ । ౨౪

ఈ రీతిగా చెప్పబడియుండుట ఇతర గ్రంథములకు కొద్దిగా వ్యత్యాస మగుట పట్టిలో చూడవచ్చును.

| | ఉత్సేధ మానము | | | | | దీపార్ణవము ౧౫ (౪౪-౪౮) | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | బ్రహ్మ | విష్ణు | రుద్ర | సమాన నామము | విష్కంభము ఉత్సేధము | శిరోవతనము | విష్కంభము | శిరోవర్తనము | శిరోవర్తన విభాగము |
| ఆఢ్యలింగము | 8½ | 8 | 7½ | స్వస్తికము | 16లో 6భాగ | అర్ధచంద్రము | 24-8 | అర్ధచక్రం | 3 భాగములో 1భా |
| అనాఢ్యలింగము | 7¾ | 8 | 8¼ | శివాధికము | 16- 6 | త్రపుషము | 24-7 | కుక్కుటాండ | 4-1<br>2-1 |
| సురేఢ్యలింగము | 7 | 8 | 9 | మధ్యమము | 16- 4 | కుక్కుటాండము | 24-6 | ఛత్రాకారము | 8-2½ |
| సమసమము | 8 | 8 | 8 | సమసమము | 16- 3 | ఛత్రాకారము | 24-9 | త్రపుషము | 6-4 |

సిద్ధాంత సారావళి గ్రంధము రీతిగా పైన చెప్పబడిన అఢ్యాది నాల్గు లింగమందును, నాల్గువిధ శిరోవర్తనమును వివరించి దానికి వివిధ నామములతో పిలవియున్నారు

ఆఢ్య లింగమందు అర్ద చంద్రాకారమును నాల్గు భాగము చేసిన యెడల
ఒకటవ భాగ శిరోవర్తనమునకు అమృత లింగమనియు,
రెండవ భాగ శిరోవర్తనమునకు పూర్ణ లింగమనియు,
మూడవ భాగ శిరోవర్తనమునకు బల లింగమనియు,
నాల్గువ భాగ శిరోవర్తనమునకు కుముద లింగమనియు పేరు.

అనాఢ్య లింగమందు త్రిపుషాకారమును నాల్గు భాగము చేసిన యెడల –
ఒకటవ భాగ శిరోవర్తనమునకు విజయ లింగమనియు
రెండవ భాగ శిరోవర్తనమునకు జయ అథవ విమాన లింగమనియు
మూడవ భాగ శిరోవర్తనమునకు విజ్ఞాన అథవా ? లింగమనియు
నాల్గువ భాగ శిరోవర్తనమునకు హిమ అథవామిత్ర లింగమనియు
పేరుతో పిలువబడుతున్నది.

సురేధ్యమందు కుక్కుటాండాకారమును నాల్గు భాగము చేసిన యెడల—

ఒకటవ భాగ శిరోవర్తనమునకు విమల లింగమనియు
రెండవ భాగ శిరోవర్తనమునకు విపుల లింగమనియు
మూడవ భాగ శిరోవర్తనమునకు వర్దమాన లింగమనియు
నాల్గువ భాగ శిరోవర్తనమునకు శ్రీవత్స లింగమనియు పేరు.

ఈ రీతిగా శిరోవర్తన భేదముచే లింగము యొక్క పేరు నిర్ణయించబడియుంటున్నది.

శిరోవర్తనమును నిర్మించునపుడు –
అర్ధేపదే త్రిభాగేన లక్షణం శుభదం నృణాం ।
శిరోవర్తనం బాహ్యేతు అథః పూర్ద్వం నకారయేత్ । ౩౦
దీపార్ణవము 13.

లింగము వెడల్పులో నగమును నాల్గు భాగముగా విభాగించి దానిలో 1 భాగము అథవ ½ భాగము అథవ 3 భాగముల వరకు శిరోవర్తనమును చేయవచ్చును దానికి పైన చేసిన శిరోవర్తనము సౌందర్య మగుటలేదు అని అర్థము.

ఆద్య అనాడ్యాది చతుర్లింగములో ఒక్కొక్కటిలోను నాల్గువిధ శిరోవర్తనమును తెలిపి వాటికి నామకరణము చేసియున్నారు. ఆ శిరోవర్తనము అతి సూక్ష్మమై యున్నదని తెలియవలసినది. ఉదాహరణము :– ఆద్య లింగములో అర్ధ చంద్రాకార శిరోవర్తనము లింగము వెడల్పులోను నగమును మూడు భాగములు చేసి దానిలో ఒక భాగము శిరోవర్తనము చేసిన యెడల దీనికి అర్ధ చంద్రాకారమనియు సంజ్ఞ ఈ ఒక భాగమును నాల్గు భాగము చేసిన యెడల మొదటి భాగ శిరోవర్తనమునకు అమృత లింగమనియు, రెండవ భాగ శిరోవర్తనమునకు పూర్ణ లింగమనియు, మూడవ భాగ శిరోవర్తనమునకు బల లింగమనియు, నాల్గువ భాగ శిరోవర్తనమునకు కుముద లింగ మనియు పిలువబడుచున్నది. ఇదే రీతిగా అన్ని లింగములకును శిరోవర్తనమును తెలియవలెను.

---

# 28. నాగర, ద్రావిడ, వేసర లింగములు

లింగోదయేతు వేదాంశే ఏకాంశం కన్యసత్తమమ్ ।
తుంగత్రంశే శివాంశంతు విస్తారం శ్రేష్ఠముచ్యతే ।
తయోర్మద్యేష్ట భాగేతు నవధా తారముచ్యతే ।
అథోదయే కలాంశేతు పంచాంశం శాంతికం భవేత్ ।
వేదాంశం పౌష్టికం ఖ్యాతం గుణాంశం జయదంభవేత్ ।
అభిచారే ద్విభాగం స్యాత్ వ్యాసమేవం చతుర్విధం ।
ఏవం త్రయోదశ వ్యాసం నాగరేతు విధీయతే ।
లింగోచ్చే ద్వినవాంశేతు రసభూత యుగాంశకం ।
గుణాంశం శాంతికాది: స్యాత్ ద్రావిడేచ చతుర్విధం ।
వేసరే లింగతుంగేతు వింశత్యంశ విభాజితే ।
అష్టవానప్త షట్ పంచభాగై వ్యాసం ప్రకల్పితం ।
శాన్తికం పౌష్టికం చైవ జయదంచ క్రమేణతు ।
వేసరం చతుర్భేదం— కాస్యప శిల్పము 49
శిల్ప రత్నము ||–2

నాగర, ద్రావిడ, వేసర లింగములకు లింగ ఉత్సేదములో నాల్గవ భాగము వెడల్పు ఉండిన యెడల అధమమని పిలువబడుతున్నది. ఉత్సేధము యొక్క మూడవ భాగము వెడిల్పు యుండిన యెడల ఉత్తమము. ఈ మధ్య ఉన్న మానమును 8 భాగములుగా విభాగించిన యెడల తొమ్మిది లింగములు అగును.

ఉదా :– లింగము యొక్క ఉత్సేధము 36 అంగుళమని భావించినచో అపుడు–

| | | | | | |
|---|---|---|---|---|---|
| | 1 | లింగముత్సేదము 36 అంగుళము | దాని | నాల్గువభాగము | 9 అంగుళము వెడల్పు అధమము |
| మద్యే | 2 | 36 | — | — | 9 3యవముపెడల్పు ,, |
| | 3 | 36 | — | — | 9 అం. 6 యవము ,, |

| | | | | |
|---|---|---|---|---|
| 4 | 36 | — | — | 10 అం. 1యవము ,, |
| 5 | 36 | — | — | 10 అం. 4యవము ,, |
| 6 | 36 | — | — | 10 అం. 7యవము ,, |
| 7 | 36 | — | — | 11 అం. 2యవము ,, |
| 8 | 36 | — | — | 11 అం 5యవము ,, |
| 9 | 36 | మూడవ భాగము | | 12 అంగుళముఉత్తమము |

ఈ రీతిగా 9 విధ లింగముల యొక్క వెడల్పు మానములు.

నాగర, ద్రావిడ, వేసర లింగముల ఉత్సేధ మరియు వెడల్పు మానము.

| | నాగర | | ద్రావిడ | | వేసరము | |
|---|---|---|---|---|---|---|
| | ఉత్సేధము | వెడల్పు | ఉత్సేధము | వెడల్పు | ఉత్సేధము | వెడల్పు |
| శాంతికము | 16 | 5 | 18 | 6 | 20 | 8 |
| పౌష్టికము | 16 | 4 | 18 | 5 | 20 | 7 |
| జయదము | 16 | 3 | 18 | 4 | 20 | 6 |
| అభిచారిక | 16 | 2 | 18 | 3 | 20 | 5 |

పైన వివరించిన నాగర, ద్రావిడ, వేసర లింగములు రాజ్యమందు శాంతి, సుఖము, రక్షణయు కావలసినపుడు ఆయా సందర్భము, సన్నివేశము, ఫలము ఇత్యాదుల ననుసరించి రాజుచే ప్రతిష్టింపబడునని తెలియవస్తున్నది. నిర్దిష్ట కాలము, ఫలము కార్యక్రమము అయిన అనంతరము ఈ లింగములు విసర్జింపబడునని భావించబడినది.

మయమత గ్రంథమందు మరియు కారణాగమమందు [43-47] ద్రావిడలింగము యొక్క ఉత్సేదమును 21 భాగముచేసి దానిలో శాంతిక 6 భాగము, పౌష్టిక 5భాగము జయధ 4 భాగము వెడల్పు యుండవలెనని చెప్పియున్నది. వేసర లింగమునకు లింగము యొక్క ఉత్సేదమును 25 భాగము చేసి శాంతిక 8 భాగము, పౌష్టిక 7 భాగము జయధ 6 భాగము వెడల్పు యుండవలెనని చెప్పబడియున్నది. పైన పట్టలో చెప్పబడిన దానికును ఇపుడు చెప్పిన దానికును అధిక వ్యత్యాసము ఉండుటలేదు.

---

# 29. లింగ లక్షణోద్ధారవము

లింగస్య ముఖ నిర్మాణం లక్షణోద్ధారముచ్యతే । ౧
కాశ్యప శిల్పము 52

లింగము యొక్క పూజా భాగము వృత్తాకారమై [గుండ్రముగా] ఉన్నది కదా. దానిలో ముందు వెనుక భాగము తెలియుటకు ముఖ భాగమందు కొన్ని రేఖాది విన్యాస ములను ఈ ముందు చెప్పబడు మాన మరియు క్రమములో నిర్మించుటకు లక్షణోద్దార మని పేరు. దీనినే బ్రహ్మసూత్రమనియు పిలువబడును.

భంక్త్వా త్రేధా శివాంశాయతి మువరితనం భాగముక్త్వ్యశిష్టం ।
కృత్వాష్ట్వాంశం నమాస్వాల్యబ విషవ శిరా సూత్రమత్రాష్టమాంశే । ౨
లింగాభం లక్ష్మ సాదారణ మతయవ రూపం మహేబేక్షణాభం ।
వ్రీహ్యాకారంబ ద్ధాంజలి నిభమపి విప్రాది క్లప్త్యావిచేద్వా । ౩
శిల్ప రత్నము 3

శివాంశ [పూజాంశము] ము యొక్క ఎత్తును మూడు బాగములుగా విబాగించి పైన ఒక బాగమును విడిచిపెట్టి క్రిందనున్న రెండు బాగములలో లక్షణోద్దారమును చేయవలెను. మరియు క్రిందనున్న రెండు అంశముల ఎత్తును ౮ బాగముగా సూత్రము చేత గుర్తించవలయును. కాషాయ మొదలయిన దాతువులచే తడిపిన దారము నుంచి ఈ రీతిగా గురుతును చేయుటకు "విషువ శిరాసూత్రము" అని పేరు. ఈ రీతిగా 8 భాగములను గుర్తించిన అనంతరము పైన ఉన్న భాగములో ఒక లింగము యొక్క చిహ్న గురుతును గుర్తింపవలయును. ఇది అన్ని వర్ణముల వారికిని సామాన్యము. ఇదికాక 1 యవాకార చిహ్నము 2 పెద్ద ఏనుగు కన్ను అకార చిహ్నము 3 వడ్లు అకార చిహ్నము 4 చేతులు జోడించిన అంజలి చిహ్నము. ఈ రీతి మొదలయిన నాల్గు చిహ్నము లను క్రమముగా నాల్గు వర్ణముల వారికిని విహితమై యున్నది

కాశ్యప శిల్పమందు లింగాకారము కమలపు మొగ ఆకారము బ్రాహ్మణ క్షత్రియు

లకు వృద్ధి ప్రదమనియు, అడ్డంగా పెట్టబడిన అథవా వేరువేరుగా పెట్టబడిన రెండు కత్తుల యొక్క గురుతు, ఏనుగుల కన్ను యొక్క ఆకారము. శంఖాకారము, ఛత్రా కారము ఇత్యాది చిహ్నములు క్షత్రియులకు వృద్ధి ప్రదమనియు అంజలి గుర్తు. గోవు యొక్క చెవి ఆకారము, ఉన్న గుర్తులు వైశ్యులకు వృద్ధి ప్రదమనియు త్రికోణాకారము శూలాకారము. వృత్తాకారము ఈ గురుతులు శూద్రులకు వృద్ధిప్రదమని చెప్పబడి యున్నది. [52 అధ్యాయము 32]

సామాన్యముగ అరటిపువ్వు, అశ్వత్థపత్రము వీటి గుర్తులును చేయవచ్చును. [ఈశాన శివగురు 378 పేజి]

ఈ రీతిగా నాల్గు వర్ణముల వారికిని లక్షణోద్ధారమందు నాల్గు విధములను చెప్ప బడియుండుటచేత మొదట చెప్పబడిన చాతుర్వర్ణములవారికి విహితమయిన సర్వసమాది లింగములలో ఈ నాల్గు విధములను క్రమముగా అన్వయించవచ్చును.

రేఖాం లక్షణ మూలతో మణిమయీం మూలాంశ యుగ్మాంతిమం ।
రేఖే లక్షణ పార్శ్వజే చ వరివిచ్ఛే ష్వంక మద్యావపి । ౮
ఊర్ద్వాగ్రై ఋతు మాత్రకై స్త్రిదశకోష్ఠాని ప్రకల్ప్యాథతే ।
తత్కర్ణ క్రమత: వరాగవని వంక్తంతే మిథోయోజయేత్ । ౯
శిల్ప రత్నము 3

పైన చెప్పబడిన రీతిగా లక్షణోద్ధార [గుర్తించుట]ము గుర్తించిన తరు వాత అనగా లింగము యొక్క పూజాంశమునుంచి క్రింద ¾ భాగమును 8 భాగముగా నిర్మించిన వాటిలో] పైన ఒక భాగమందు ఈ లక్షణోద్ధారమును చేసిన తరువాత ఆ లక్షణ క్రింద భాగము నుంచి అధోముఖముగ ఒక రేఖను గుర్తింపవలెను. ఇది పైన ఉన్న 8 భాగములలో క్రింద రెండు భాగములను విడచిపెట్టి దాని పైన నిలువ బడు రీతిగా వ్రాయవలెను దీనికి మణిరేఖ అని పేరు. అనంతరము పైన చెప్పిన లక్షణము యొక్క దాని రెండు పార్శ్వములోను రెండు రేఖలను అధోముఖముగా వ్రాయవలయును. మణి రేఖయు పైననుంచి ఆరు భాగములు ఉన్నదికదా ఈ పార్శ్వ సూత్రము 5½ అంశము మాత్రమే దిగి అచట నుంచి కుడివైపు ఉన్న రేఖయు కుడి

వైపును, ఎడమ వైపు రేఖయు ఎడమవైపు తిరిగి పున: పైకి వచ్చిన రీతిగా కల్పించి అవి ఆయా పార్శ్వముల నుంచి వెనుక భాగములో మధ్య భాగమందు రెండు చేరురీతిగా వ్రాయవలెను ఈ రెండు రేఖలకును ఋతు సూత్రమని పేరు. వెనుక భాగమందు పైన ఉన్న అంశ రేఖతో చేర్చవలెను.

కాస్యప శిల్పమందు ఈ మధ్య మణిరేఖను నాళ రేఖ మరియు. ప్రక్క ఉన్న ఋతు రేఖ గుర్తులను మణిరేఖ అనియు పిలువబడుతున్నది. ఈ రేఖలను కేవలము వ్రాయటమేకాక వాటిని చెక్కి వళ్ళము చేయవలెను. వీటి యొక్క వెడల్పు, లోతులు చెప్పబడియున్నవి.

ఈ కొలతలు మూడు విధముగ ఉత్తమ మధ్యమ అధమమనియు, వాటికి రీతిగా రేఖల వెడల్పుతో, లోతు వుండవలెను రెండు యవ [గోదుమ] వెడల్పు గలది అధమము. నాల్గు యవ వెడల్పుగలది ఉత్తమము. ఈ మధ్య నాల్గువ వంతు యవాదిక్య రీతిగా 9 మానములగును. 2, 2¼, 2½, 2¾, 3, 3¼, 3½, 3¾, 4 వీటిలో మొదటి మూడు అధమము మధ్యమ మూడు మధ్యమము, చివరి మూడు ఉత్తమము. ఇది మద్య రేఖయొక్క వెడల్పు మరియు లోతు మానములు. పార్శ్వ రేఖల కొలతయు మద్య రేఖ యొక్క నగము అంత ఉండవలెను. ఈ మూడు రేఖల క్రింద భాగములకు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు దేవతలు.

విస్తారోఽధ మలక్షణే ద్వియవ తత్పాద వృద్ధ్యోర్వతో
రేఖాతద్దళతో మితా మణియమే——————వరే ।
రేఖా దక్షిణ వామమధ్య రజితా బ్రహ్మచ్యుతా నంగజి ।
దైవత్య శ్చతురస్రకాది శివలింగాంశాశ్చ తద్దేవతాః ।

శిల్పరత్నము 3.

కాశ్యప శిల్పమందు ఈ యవ ప్రమాణమును ఈ రీతిగా చెప్పబడియున్నది.

రుద్రభాగో ద్వయంగ్రాహ్య శిరసావర్తనాన్వితం ।
నవేద వింశతం భాగం కృతై కాంశంతు విస్తృతం । ౨౨
అంగుళం వసుధాభజ్య ఏకాంశం యవముచ్యతే ।

కాశ్యప శిల్పము ౫౨

శిరోవర్తనతో కూడిన పూజాంశము యొక్క ఉత్సేధమును 124 భాగము చేసిన యెడల వచ్చు ఒక భాగమునకు ఒక అంగుళమనియు, ఈ అంగుళమును 8 భాగము చేసిన యెడల ఒక్కొక్క భాగము ఒక్కొక్క యవమనియు గ్రహించవలెను.

ఉత్తమోత్తమ లింగస్య సూత్రం పంచయవం తతం। ౨౪
సర్వేషామపి లింగానాం యవార్థప్రతిహ్రాసయేత్ ।
అథమాథమ లింగస్య సూత్ర తారం యవం భవేత్ । ౨౫
సూత్ర విస్తార మేవంస్యాత్ ఖాతం చైవతు తత్సమమ్ ।
కాశ్యవ శిల్పము 52.

పైన చెప్పబడిన కల్పిత యవ ప్రమాణములో అయిదు యవ విస్తారము కలిగిన సూత్రము ఉత్తమోత్తమమనియు, ఒక యవ విస్తారము కలిగినది అథమాథమమనియు ఈ మధ్య అర్థ అర్ద యవత్రానముచే తొమ్మిది విధమానములగును అనియు సూత్ర విస్తారమంత లోతు వుండవలననియు వివరించియున్నారు.

| | | |
|---|---|---|
| 5 | యవము | ఉత్తమము |
| 4½ | ,, | ఉత్తమమధ్యమము |
| 4 | ,, | ఉత్రమము |
| 3½ | ,, | మద్యమోత్తమము |
| 3 | ,, | మధ్యమ మధ్యమము |
| 2½ | ,, | మధ్యమ అధమము |
| 2 | ,, | అధమోత్తమము |
| 1½ | ,, | అధ్యమ మద్యమము |
| 1 | ,, | అధ్యమ అధమము |

ఈ రీతిగా తొమ్మిది మానములగును.

ఇక పార్శ్వ రేఖలు ఎన్ని అంశములు క్రిందకు దిగవలెను అనంతరము వెనుక భాగమందు పై ముఖముగా వెళ్ళి ఎచ్చట చేర్చవలెను అనే విషయమును కాశ్యవ శిల్పములో 8 విధములు చెప్పబడియున్నవి. 52-44-59 వీటిని శిల్పాచార్యుడు గమనించి యజమాని ఇచ్ఛానుసారముగాను మరియు సౌకర్యముల ననుసరించి కల్పించవలెను.

ఈశాన శివగురు దేవపద్ధతి క్రియాపాదము 38 అధ్యాయమందు లక్షణోద్ధారము యొక్క సంజ్ఞా గుర్తులను యీ రీతిగా చెప్పబడియున్నది

చత్రాభ మస్తకే లింగే సూత్రాగ్రం స్యాత్ గజాక్షవత్ । ౪౬
ఖండేందు మస్తకే లింగే సూత్రాగ్రం బుద్బుదో భవేత్ ।
లింగాగ్రే త్రపుషాచేత్ సూత్రాగ్రం కుక్కుటాండవత్ ।
కుక్కుంటాండ శిరోలింగే సూత్రాగ్రం ఛత్ర సన్నిభం ।
సామాన్యేనతు లింగానాం సూత్రాగ్ర మధకథ్యతే ।
కదళీ ముకుళాభవా సరోజి ముకుళాకృతి ।
అశ్వద్థ పత్ర సదృశం సామాన్యంహి యవోపమం ॥ ౪౯

చక్రాకార శిరోవర్తనము కలిగిన లింగములకు సూత్రాగ్రము [లక్షణోద్ధార చిహ్నము] ఏనుగుల కన్ను మాదిరిగాను, అర్థచంద్ర శిరోవర్తన కలిగిన లింగమునకు బుద్బుద సదృశ సూత్రాగ్రము, త్రపుష శిరోవర్తనము కలిగిన లింగమునకు కుక్కుటాండ సదృశ సూత్రాగ్రము, కుక్కుటాండ శిరోవర్తనము కలిగిన లింగమునకు ఛత్రాకార శిరోవర్తనము ఉండవలెనని సామాన్యముగ అరటిపువ్వు ఆకారము, పద్మ ముకుళ ఆకారము, అశ్వత్థపత్ర [రావిఆకు] ఆకారము, మరియు యవాకార సూత్రాగ్రములు అన్ని లింగములకును గుర్తింపవచ్చును, యీ రీతిగా లక్షణోద్ధారక్రమము అనగా బ్రహ్మ సూత్ర కల్పన లక్షణము చెప్పబడినది.

---

# 30. పాదశిల [బ్రహ్మశిల-కూర్మశిల]

బింబము అథవా లింగములను స్థాపించునపుడు భద్రత కోరి భూమిలో ఒక ఘనమైన శిలను పెట్టుదురు. ఇదే పాద శిలయని పిలవబడును. దేని విస్తారము లింగము యొక్క ఆద్యంత ఉత్సేధ మానమునకు సమమై యుండుట ఉత్తమము. పూజాంశమునకు ద్విగుణమై యుండుట అధమపక్షము. యీ రెండు మానముల మధ్యలో 8 భాగము విభాగించిన యెడల మొత్తము 9 విధ మానములగును.

ఉదా :– లింగము 3 అడుగు ఉత్సేదము వున్నదని భావించిన యెడల యీ పాదశిల వెడల్పు 3 అడుగు వుండుట ఉత్తమము పూజాంశము యొక్క ద్విగుణము [రెండు అడుగు] అంతవుండుట అధమము. యీ మధ్య 8 భాగములు చేసిన యెడల 1½ అంగుళ వృద్ధితో 2, 2-1½, 2-3. 2-4½, 2-6 2-7½, 2-9, 2-10½. మరియు 3 యీ రీతిగా తొమ్మిది మానములు మొదటి మూడు అధమము. మధ్యమ మూడు మధ్యమము. ఆఖరు మూడు ఉత్తమ మానములగును.

యీ రీతిగా ఆ పాదశిల యొక్క ఘనమునకు మానములు చెప్పబడియున్నవి. పాదశిల యొక్క వెడల్పులో సగ భాగమంత ఘనమై యుండుటము ఉత్తమము. నాల్గువవంత భాగము అధమము. యీ మధ్య అంతరమును 8 భాగముగా చేసిన యెడల తొమ్మిది మానములగును. పైన చెప్పిన లింగము యొక్క పాదశిల యొక్క వెడల్పు మూడు అడుగులయినచో 1½ అడుగు ఘనము పెట్టుటము వుత్తమము 1 3/4 ఘనము పెట్టుడము అధమము. వీటి అంతరములో 8 భాగము చేసిన యెడల 9, 10 1/8, 11 2/8, 12 3/8, 13 4/8, 14 5/8, 15 6/8, 16 7/8, 18 అంగుళము యీ రీతిగా ఘనము పెట్టవచ్చును. మొదటి మూడు కనిష్ఠము. మధ్యమ మూడు మధ్యమము, ఆఖరు మూడు వుత్తమ మానమని చెప్పబడును.

యత్ర బ్రహ్మ శిలాయాం తల్లింగమాదౌ నిధాయతు ।
క్రియతే పీఠికా యోగస్తాం ప్రతిష్ఠాం ప్రచక్షతే ।

ఈశానగురు 45.

అనంతరము ఈ పాదశిలలో 2 అంగుళముల లోతు ఖాతమును [పళ్ళెము] చేసి దానిలో దానికి సరిగ ఒక శిలను పెట్టవలెను. దీనికి బ్రహ్మ శిలయని పేరు. దీని ఘనము [లావు] ఎంత అయినా ఉండవచ్చును. ఈ శిలయొక్క మధ్యమందు లింగ బ్రహ్మ భాగ కొలతకు అనుగుణమై ఒక ఖాతమును [పళ్ళెము]ను చేయవలెను. ఈఖాత మందు చిన్నచిన్నదిగా తొమ్మిది పళ్ళెములను చేసి వాటిలో నవరత్నములు, ఔషది మూలికలు మొదలయిన వాటిని న్యాసముచేసి వాటిమీద లింగము యొక్క బ్రహ్మ భాగమును ఉంచవలయును. తరువాత అష్ట బంధనముచే బిగించవలెను. ఇపుడు ఆ శిలముమీద లింగము యొక్క బ్రహ్మ భాగము పూర్ణముగా కనిపించకుండ ఉండు రీతిగా రాళ్ళు అథవ ఇటుకలతో కట్టవలెను. దీనికి నంద్యావర్తనము అని పేరు. దీని పైన లింగము యొక్క విష్ణ్వంశ ఉత్సేధమంత ఎత్తు కలిగిన పీఠమును పెట్టవలెను. వాటిని అష్టబంధనముచే బిగించవలయును. ఈ రీతిగా పాదశిలా కల్పన ప్రకారము చెప్పబడినది.

కామికాగమము 65 [152.–555]

---

# 31. లింగ పీఠములు

ఇదివరకు లింగముల వివరములును వానిని ఆలయములలో ప్రతిష్ఠించబడు విషయములను మరియు దానికి కల్పించవలసిన పాదశిల, బ్రహ్మశిల నంద్యావర్తముల విషయముగా వివరించబడినది. ఇపుడు నంద్యావర్తమునకు పైన కల్పించబడు పీఠ విషయమై వివరించబడును.

ఉమాతు పీఠికాజ్ఞేయా లింగం శంకర ఉచ్యతే ।

అపరాజిత 207
దీపార్ణవము 14

లింగ పీఠము ఉమాస్వరూపమై యుంటున్నది. ఇది అత్యవశ్యకముగా మానముల ననుసరించి నిర్మింపబడు భాగము. మత్స్య పురాణమందు "యస్య దేవస్య యాపత్నీతాం పీఠే పరికల్పయేత్" అనగా ఏ మూర్తినికాని లింగమునుకాని మనము స్థాపించుదుమో దానికి నిర్మించు పీఠము ఆయా మూర్తియొక్క ఆయా లింగముయొక్క పత్ని స్వరూపముగా ఉంటున్నది ఇదిగాక కామికాగమమందు

ఆధార పీఠమూలేచ పూర్వస్యాం భాస్కర స్మృతః ।
ఆగ్నేయాం గుళికో యామ్యే చండో నైఋత్యకేవిదుః ।
వారుణ్యాంతు స్వభూజ్ఞేయః వాయవ్యే గణనాయకః ।
సౌమ్యేతు మఘవాజ్ఞేయః ఈశాన్యే వ్యాళనాయకం ।
సర్వదేవాత్మకం పీఠం భుక్తిముక్తి ఫలప్రదమ్ ।

పూర్వమందు భాస్కరుడు, ఆగ్నేయమందు గుళికుడు, దక్షిణమందు చండుడు, నైఋతియందు చంద్రుడు, పశ్చిమమందు స్వభూ, వాయువ్యమందు గణనాయకుడు, ఉత్తరమందు ఇంద్రుడు, ఈశాన్యమందు వ్యాళుడువుండి ఈ పీఠము సర్వదేవాత్మకమై భుక్తి ముక్తిప్రదమై యుంటున్నది.

గ్రంథాంతరములో

లింగస్యాధార పీఠస్త దేవతాశ్చ ప్రకీర్తితాః ।
భవశ్శివ శంకరశ్చ ఉగ్ర ఈశాన భైరవా ।
రుద్ర పశుపతి శ్చైతాః దేవతాః పీఠమూలకే ।

భవ, శివ, శంకర, ఉగ్ర, ఈశాన, భైరవ, రుద్ర, పశుపతి ఈ రీతిగా పీఠములలో 8 దేవతలు ఉంటున్నారని చెప్పబడియున్నది. ఈ పీఠమును

దేవస్య యోజనార్ధంతు పీఠికాస్తత్ర కీర్తితాః ।
శైలే నియోజయే చ్చైవం దారుజే దారుజం తథా ।
పార్థివే పార్థివా కార్యా లోహజే లోహజోత్తమా ।
రత్నజే దాతుజాశస్త రత్నజాతు విశేషతః ।

అపరా 207
మత్స్యపురాణము [222] కాశ్యపశిల్పము 58, [1-23]

లింగము కొరకై నిర్మించబడు పీఠము లింగము ఏ ద్రవ్యమందు చేయబడుతున్నదో అదే ద్రవ్యమందు ఉండవలెను. అనగా శైలజ లింగమునకు శిలామయ పీఠము దారుజ లింగమునకు కాష్టమయ పీఠము మృణ్మయ లింగమునకు మృణ్మయ పీఠము లోహజ లింగమునకు లోహజ పీఠము ప్రశస్తమైయుంటున్నది. కాని రత్నజ లింగమునకు రత్నజ పీఠము అయిన యెడల విశేష ఫలప్రదము.

శైలజే శిలయా పీఠసుధ యేష్టకయా పిచ ।
దారుజే దారుజం వాథ ఇష్టకామయ మేవవా ।
రత్నలోహజ లింగానాం న్వయోని లోహంజంతవా ।

[గ్రంథాంతరే]

శిలాలింగమునకు శిల, సుధ, [సున్నము] ఇటుకులతోను, దారులింగమునకు దారుఅథవా ఇటుకలతోను, రత్నజ లోహజ లింగములకు అయా ద్రవ్యములచేత అథవా లోహముచే పీఠములను నిర్మించవచ్చునని కొందరి మతము.

అఖండ శైలమిష్టంస్యాత్ తదభావే నఖండకం ।
ఖండా శ్చాం గావసా నేస్యాత్ ఊర్ధ్వఖండమ ఖండకం ।

చెప్పిన మానోత్సేధము కలిగిన ఒకే శిలలో పీఠమును నిర్మించుట శ్రేష్ఠము. ఆ రీతిగా ఒకే శిలలో కాని యెడల వేరువేరు శిలలో నిర్మించవచ్చును కాని అన్నిటికి పైనఉన్న శిల ఒకే శిలగా ఉండవలెను.

అజితాగమమందు 16 అధ్యాయములో

ద్వాభ్యాం త్రిభిచతుర్భిర్వా శిలాభిః పరికల్పయేత్ ।
ఊర్ధ్వ భాగే నకర్త్తవ్యం నంధిస్త్రత కథంచన । ౫౨

2, 3 అథవ 4 శిలలో పీఠమును నిర్మించవచ్చును అనగా పీఠము ఎత్తు విష్ణ భాగమునకు నమముగా ఒక అడుగు ఎత్తు వుంటున్నది అని భావించినచో దీని వెనుక చెప్పిన ప్రకారముగా బ్రహ్మ శిలపైన లింగమును స్థాపించి నంద్యావర్త్తమును రచించిన అనంతరము పీఠమును ఉంచవలెను. పైననుంచి లింగములో ప్రవేశించు రీతిగా విష్ణ భాగము యొక్క ఆకారమైన అష్టాస్ర రీతిగా ఒక రంధ్రమును ఈ పీఠములో చేయ వలెను. ఒక అడుగు ఘనము కలిగిన శిలతో ఆ రీతిగా రంధ్రము చేయుటము కష్ట ముగా వుండవచ్చును. గనుక ఆరు, ఆరు అంగుళము యొక్క రెండు పెద్ద రాయి అథవ నాల్గు నాల్గు అంగుళము కలిగిన 3 శిలలు. మూడు మూడు అంగుళము శిలిగిన 4 శిలలలో యీ పీఠమును నిర్మించవచ్చును. అపుడు దానిలోపల విష్ణ భాగము ప్రవేశించుటకు రంధ్రమును సులభముగా చేయవచ్చును. గాక నంద్యావర్త్తము వరకు స్థిరముగా నిర్మించబడిన లింగము పైనుంచి ఒక అడుగు ఎత్తు శిలను పెట్టు సమయమున లింగమునకు దెబ్బ తగలవచ్చును. అథవ అది కదలవచ్చును గనుక వేరువేరు మూడు నాల్గు శిలలో నిర్మించిన యెడల అపాయము లేక సులభముగా పెట్టవచ్చును. అనంత రము వీటిని అష్ట బంధనముచే భద్రపరచవలెను.

యీపైన పీఠము యొక్క అంగములు ఉంటున్నవి అవియు, ఖండ శిలలు అంగ ముల పైన వరకు ఉండి దానికి పైన శిలయు అఖండముగా వుండవలెననియు చెప్ప బడినది. అంగములనగా పీఠమందు అలంకారముగా చేయవలసిన రచనా కౌశలము. ఇది ఏడు విధములుగానున్నవి. ఉపాన, కంప, అధపద్మ, కుముద, కంఠ, ఊర్ధ్వపద్మ

ఘృతవారి అని. ఉపానముసగా క్రింద అఖండముగా ఒకశిలయు, ఘృతవారి అనగా పైన ఒక అఖండ శిలయు, దీనిచుట్టు ఒక ఖాతము వుండి గోముఖమైవు అభిషేకము యొక్క తీర్థము మరియు ఇతర ద్రవ ద్రవ్యములు పోయే రీతిగా నిర్మించవలెను. గోముఖము ఈ ఘృతవారి శిలలోనే యుండవలెను. ఇక మధ్యమ మందు ఉన్న కంఠము అనునది విస్తారములో చాలా చిన్నదిగా ఉండు భాగము మిగతా కంప, అథః పద్మ, ఊర్ధ్వపద్మ, కుముదములు అలంకారమునకు తగిన రీతిగా ఎంతైనా పెట్టవచ్చును. వీటి యొక్క మానము సంఖ్యాక్రమములను ఇష్టమువచ్చిన రీతిగా వేయకూడదు. వాటియొక్క మానములను విన్యాసక్రమములను వివరించి సుమారు 100 విధ పీఠ లక్షణములు శాస్త్రములో చెప్పబడినవి. యజమానుని ఇష్టము మరియు శిల్పియొక్క కౌశలము నను సరించి శాస్త్రోక్తమైన రీతితో పీఠములను చెప్పిన మానములందు నిర్మించవలెను.

ఈ క్రింద లింగముతో ఉన్న ఒక పీఠము యొక్క సామాన్య చిత్రము ఇవ్వ బడినది. (చూడుడు–చిత్రావళి)

ఇచ్చట గమనించవలసిన దేమనగా ఉపాన శిల మరియు పైనఉన్న ఘృతవారి శిలయు ఒకే విస్తారమై యుండవలెను వీటియొక్క విన్యాస ప్రకారములచే అగు అనేక పీఠములకు శాస్త్రములో నామములను చెప్పియున్నారు. వాటి పట్టిని ఈ ముందు ఇవ్వబడినది

ధామ్ని ప్రోక్తాన్య ప్రధిష్టానకాని ।
తాన్య ప్యస్మిన్ మండనీ యానియుక్త్వా ।

యథాబలం యథాశోభం యథాయుక్తి ప్రవేశనం ।
నిర్గమం సర్వ పీఠానాం అంగానాం పరికల్పయేత్ ।

[మయమతము 34]

ఆలయము యొక్క అధిష్టానమునకు చెప్పబడిన అలంకారము లన్నిను పీఠములో నిర్మించవచ్చును. శక్త్యనుసారమై శోభ కనుపించు రీతిగా యుక్తి పూర్వకముగా పీఠమందు అంగములను నిర్మించవలసినది.

# పీఠ భేదములు

చతురస్రంచ వస్వంస్రం షడస్రం ద్వాదశాస్రకం
ద్విరుష్టాస్రం సువృత్తంచ తేషాంమే వాయతాన్యపి । ౧౦
త్రికోణ మర్ధచంద్రంచ చతుర్దశ నిభానివై ।
[మయమతము 38]

చతురస్ర, అష్టాస్ర, షడస్ర, ద్వాదశాస్ర, షోడశాస్ర, వృత్తము ఈ రీతిగా ఆరు విధము వీటియొక్క అయతాకారములు అనగా అయత చతురస్ర, అయాతాష్టాస్ర, అయతవృత్తము ఇత్యాది 6 విధములు, త్రికోణము, అర్ధ చంద్రాకారము 14 విధము చెప్పబడినది.

సమాని యాని లింగస్య బాహుః పీఠంచ సంజ్ఞకం । ౧౧
అయతాన్యాన నానీతి నిష్కలానాం వదంతివై ।
త్రికోణ మర్ధచంద్రంచ నిల్కవేశర లేక్రమాత్ ।
[మయమతము 34]

ఈపదునాల్గు పీఠములందు అయతములు, త్రికోణము మరియు అర్ధచంద్రాకారము ఉన్నవి– విగ్రహములకు శ్రేష్ఠము. లింగములకు మాత్రము మొదట చెప్పిన 6 విధములలో సమముగా ఉన్నవి మాత్రము నిర్మించవలెనని గమనించవలెనని గమనింపవలెను.

పీఠం నిష్కళ లింగానాం విజ్ఞేయం సర్వతస్సమా । ౧౧
అయతంప్రతిమానాంస్యాత్ సకలే వార్ధ చంద్రకం ।
శిల్పరత్నము 27

# పీఠ విస్తారము

యన్మానం లింగస్యోత్సేధః తన్మానేన పీఠవిస్తరః । ౧
కామికాగమము 65

లింగవృత్త సమం పీఠం— — — కారణాగమము
లింగోదయ సమంపీఠం విస్తారేణోత్తమం భవేత్ । ౨
పూజాంశోచ్ఛసమం పీఠతారం కన్యస ముచ్యతే ।
తయోర్మధ్యే ష్టభాగేతు ఉత్తమాది త్రయంత్రయం । ౪

[శిల్ప రత్నము 27
కాశ్యపశిల్పము 50]

లింగము యొక్క ఆద్యంత ఉత్సేధ [ఎత్తు]మునకు సమముగా పీఠము యొక్క వెడల్పు ఉండవలెను. ఇది ఉత్తమము పూజాంశము యొక్క ఉత్సేదమంత వెడల్పు ఉన్న పీఠము కనిష్టమనియు. ఇవి రెండు మద్యములో ఉన్న మానమును 8 భాగముగా విభజించిన యెడల అగు 9 మానమందు మొదటి మూడు ఉత్తమము, మధ్యమ మూడు మధ్యమము, చివర మూడు కనిష్టము. సామాన్యముగా లింగ ఉత్సేదమునకు సమముగా పీఠ విస్తారమును పెట్టడము పద్ధతి. మరియు ఇది అనేక శాస్త్రములలో చెప్పబడిన బహుమత మానము.

లింగాయామాదికం పీఠవిస్తారం నేష్యతేద్విజాః । ౨
కామికాగమము 65

లింగము ఎత్తుకు పైన వెడల్పు ఉన్న పీఠము నిషిద్ధము కానికొన్ని స్థలములందు లింగ విస్తారముయొక్క అయిదు అంతలు కొలత విస్తారమును పీఠమునకు పెట్టవచ్చును అని వాక్యములు కనబడుచున్నవి. కాని పైన వాక్యము రీతిగా ఇది నిషిద్ధమని తెలిసియుండినను సౌందర్య కల్పన కోరికై ఈ మానమును ఉపయోగించవచ్చును.

# పీఠ ఉత్సేదము [ఎత్తు]

1 లింగవృత్త సమం పీఠం ఔన్నత్యేతు తదర్ధకం [కారణాగమ] ౨
2 విష్ణు భాగస్య చ్యోత్సేదం పీఠోత్సేదం విధీయతే ।
అథవా బ్రహ్మభాగస్య చాష్టాంశేన సమన్వితం । సుప్రభేదము ౪

3 పీఠవ్యాసం త్రిధాభజ్య ద్విభాగం చోత్తమోత్తమం ।
వ్యాసార్ధ మధమోత్సేదం తయోర్మధ్యేష్ట భాజితే । ౫
నవధాపీఠ తుంగంచ ఉత్తమాది త్రయంత్రయం ।

పీఠ విస్తారమందు ⅔ భాగము ఎత్తు వుండవలెను ఇది ఒక విధము విష్ణు భాగమునకు సమానమైన ఉత్సేధ ముండవలెను. అథవా బ్రహ్మ భాగముయొక్క ⅓ భాగమును అతిక్రమించినంత ఎత్తు వుండవచ్చును. ఇది ఇంకొక విధము. మరియు–

పీఠము యొక్క వెడల్పు ⅔ భాగమంత ఎత్తు వుత్తమోత్తమ మనియు వెడల్పు యొక్క సగము భాగమంత ఎత్తు అధమమనియు, ఇవి రెండుయొక్క మధ్యమందు 8 భాగములు చేసిన యెడల అగు 9 విధమానములో 3 ఉత్తమము, 3 మధ్యమము, 3 అధమ మానములగును ఇది ఇంకొక విధము.

ఈ అన్నివిధ మానములను పరిశీలించిన యెడల అలంకారముగా వుండుటకు కావలసిన ఎత్తును పెట్టడము ముఖ్యమనియు. ఒకవేళ వెనుక చెప్పిన నంద్యావర్తమనే కిట్టడము లేకపోయినను బ్రహ్మశిల పైననుంచి పీఠమును లింగముయొక్క పీఠమువరకు పీఠమును నిర్మించవచ్చునని అర్థమగును. సౌందర్యము, అలంకారము, సౌందర్యము, మరియు యజమానుని ఇష్టప్రకారము, శిల్పాచార్యుల కౌశలమును అనుసరించి ఈ ఎత్తును నిర్ధారించి పీఠమును నిర్మించవచ్చును.

జలమార్గము :– (గోముఖ, ప్రణాళి, నాళము) పీఠ పైన భాగమందు అభిషేక తీర్థాదులు అవతల పోవుటకు అనుకూలముగా ఒక నాళమును కల్పించవలెను. ఈ నాళము పీఠముయొక్క పైన భాగ ఘృతవారి శిలలోనే చేయుండవలెను. అనగా ఘృతవారి మరియు నాళము ఒకే శిలలో నిర్మించవలెను. ఈ విచారమై కొన్ని నియమములు చెప్పబడుతున్నవి

1 నకలానా మానాలంవా ననాల మథపీఠకం ।

[కామకాగమము 25]

2 సిమ్కశేతు ప్రణాళంస్యాత్ తన్మాన మథునోచ్యతే । ౭౭

[కామకాగమము 65]

3 పిండికాగోముఖో పేతాలింగా నాంతు విధీయతే ;
గోముఖేన వినాపీఠం సకలానాం విశేషతః ౨౧

[కాశ్యప శిల్పము 50]

మూర్తులకు కల్పించు పీఠము ఈ గోముఖ లేకపోయినను ఉండవచ్చును. కాని లింగములకు మాత్రము ఈ గోముఖము [నాళము] వుండియే ఉండవలయునని విధి ప్రమాణము.

# నాళము యొక్క వర్ణనము

విస్తారస్య త్రిభాగైకం నాళమూలస్య విస్తరం । ౪౮
తత్సమం తస్యదైర్ఘ్యం స్యాత్ క్రమేణ కృశతా భవేత్ ।
మూలాదగ్రస్య విస్తారం తత్రిభాగేన కల్పయేత్ । ౪౯
తన్మధ్యే జలమార్గస్యాత్ తద్విస్తార త్రిభాగతః ।

అజితాగమము 16

పీఠము యొక్క నాల్గు ప్రక్కలయున్న బాహువులు సమానముగా ఉన్నదికదా. పీఠ విస్తారము యొక్క మూడవవంతు భాగము కొలత అంత నాళిక యొక్క మూల వెడల్పు, అంతే పొడవు, వుండవలెను. అగ్రము యక్క భాగము చిన్నదిగా వుండ వలెను. అగ్రము యొక్క విస్తారము మూలము యొక్క మూడలో ఒక అంశము ఉండవలెను దీని మధ్యములో జలమార్గము వుండవలెను. జలమార్గము యొక్క లోతు ఘృతవారి యొక్క లోతుకు సమానమైయుండవలెను.

జలమార్గ నిర్మాణము :– ఇది గర్భ గృహమందు ఉంటున్నది. గర్భగృహము యొక్క గోడనుంచి అవతల వచ్చిన తరువాత ఈ నాళము యొక్క చివరలో సింహ, వ్యాళ, గజ, గోముఖము, ఇత్యాది ముఖముల అలంకారములను నిర్మించుచున్నారు. లింగపీఠ జలమార్గమందు ఈ ఆకార కల్పనములు అన్వయించుటలేదు.

# జల మార్గమును పెట్టుం దిక్కు

ప్రాక్ప్రత్యఙ్ముఖ లింగానాం పీఠముత్తర నాళకం ।
దక్షిణోదఙ్ముఖానాంతు పూర్వనాళం ప్రకల్పయేత్ ।

శిల్ప రత్నము 27

పూర్వాభిముఖము మరియు పశ్చిమాభిముఖ లింగములకు ఈ నాళము ఉత్తరాది ముఖముగాను, దక్షిణాభిముఖ మరియు ఉత్తరాభిముఖ లింగములకు పూర్వాభిముఖము గాను ఉండవలెను మొత్తమందు లింగముయొక్క ఎడమ పార్శ్వము అథవా దక్షిణ పార్శ్వములో నాళము ఉండవచ్చును. పూర్వము మరియు ఉత్తరాభిముఖముగనే వుండవలయును. దక్షిణము మరియు పశ్చిమ దిక్కులకు నాళము అభిముఖముగా ఉండకూడదు.

ఇష్ట దిక్ముఖ లింగస్య నాళంవామే ప్రకారయేత్ । ౫౧

ప్రాసాదమంజరి

ఈశాన శివగురు 39 [87]

ముఖ లింగము ఏ దిక్కునకు అభిముఖమై యుండినను ఆ లింగము యొక్క ఎడమ పార్శ్వమునందే నాళము వుండవలయును.

పీఠముల యొక్క నామములు [రచనా భేదము కూడినది]

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | భద్ర | 8 | యక్ష | 15 | శాంభవ |
| 2 | పద్మ | 9 | పూర్ణచంద్ర | 16 | విజయ |
| 3 | వేది | 10 | మండల | 17 | మహాంబుజ |
| 4 | పరిమండల | 11 | సంవత్కర | 18 | శ్రీకరము |
| 5 | స్తండిల | 12 | స్వాయంభువ | 19 | పీఠపద్మ |
| 6 | వజ్ర | 13 | స్వస్తిక | 20 | మహావజ్ర |
| 7 | వాపి | 14 | నందికావర్త | 21 | సౌమ్య |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 22 | శ్రీకామ్య | 27 | విష్ణు సంవేలన | 32 | సర్వాంగభద్ర |
| 23 | మేరుసుందర | 28 | పద్మభద్ర | 33 | రమ్య |
| 24 | వర్ధమాన | 29 | సమాంగభద్ర | 34 | చక్రము |
| 25 | సర్మసౌమ్య | 30 | రుద్రకాంత | 35 | శ్రీభద్ర |
| 26 | లక్ష్మీసుందర | 31 | సోమకాంత | 36 | శ్రీమరాల |

ఈ అన్ని పీఠముల విషయమై మాన అంశ విభాగము అన్నియు ఈ క్రింద వ్రాసిన గ్రంథములలో ఉంటున్నది.

| | | |
|---|---|---|
| 1 సుప్రభేదా గమము | 2 కిరణాగమము-3-23 | 3 కామికాగమము |
| 4 పూర్వకారణాగమము | 5 అజితాగమము-16 | 6 కాశ్యపశిల్పము-50 |
| 7 అవరాజిత-206 | 8 మత్సపురాణము-262 | 9 మానసారము-53 |
| 10 మయమతము-44 | 11 ఈశాన శివగురు-49 | 12 శిల్పరత్నము-27 |

ఈ పైన చెప్పిన పీఠములకు కొన్నిటికి నిర్దిష్ట అకారములున్నవి. మరికొన్ని పీఠములు ఫలములకు అనుసారమై నిర్మించబడుతున్నది.

| పీఠము | ఫలము |
|---|---|
| చతురస్రము | జయము |
| యోని అకారము | సంతతి |
| ధనురాకారము | శాంతి |
| త్రికోణ అకారము | శత్రునాశము |
| వృత్తాకారము | అభివృద్ధి |
| పంచాశ్రము | ఆరోగ్య మరియు సంతోషము |
| షట్కోణ మరియు అష్టకోణ | రోగనాశనము |

కాశ్యప శిల్పము 50 [44-46]

ఒక విశేషము చెప్పబడును.

"శివస్నానోదకం గూఢమార్గే చండముఖే క్షిపేత్" శివస్నానోదకము గూఢమార్గము ద్వారా అవతల ఉన్న చండదేవతా ముఖమందు పడవలెననే నియమము గర్భగృహము యొక్క అవతల అని తెలియవలెను.

జ్యాకార మర్ధచంద్రస్య ప్రకుర్యాత్ ద్వారసమ్ముఖం ।
పీఠస్యాన్య త్రికోణస్య ఋజ్వంశం ద్వారసమ్ముఖం । ౭౩

మయమతము 34

ఈశాన శివగురు 39 [83]

ఈ అర్ధచంద్ర పీఠమైన యెడల జ్యాభాగము ద్వారమునకు అభిముఖముగా వుండవలెను. త్రికోణ పీఠమైన యెడల ఋజుపట్టికా భాగము ద్వారమునకు అభిముఖముగా వుండవలెను.

---

# 32. నంది అథవా వృషభము

వాహనం యస్య దేవస్య తత్తస్యాగ్రే ప్రకల్పయేత్ ।

దీపార్ణవము 14
అపరా 115 [43]

మనము ఏ దేవుని ఆలయములో ప్రతిష్ఠించి పూజించుదుమో ఆదేవునియొక్క వాహనమును ఆ దేవుని ముందు ప్రతిష్ఠించుట శాస్త్ర సమ్మతము. ఆ రీతిగా శివాలయములో శివుని [లింగము] ముందు నంది [వృషభము] ను స్థాపించవలసినది. ఈ రీతిగా స్థాపించు వృషభము.

భుక్తిముక్తి ఫలప్రాప్త్యై శివసాయుజ్య హేతవే ।
పూజాపీఠ నమేస్థానే దర్శనం శృంగ మధ్యమే ।
వృషభం స్థాపయే ద్ధీమాన్ మంటపే చాంతరాళకే ।

వీరాగమము

వృషస్య వృషణం స్పృష్ట్వా చేశ్వర స్యావలోకనం ।
శృంగ మధ్యే శివం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే ।
ప్రధివ్యాం యాని తీర్థాని సాగరాంతాని యానివై ।
అండ మాశ్రిత్య తిష్ఠంతి దర్శనం శృంగ మధ్యతః ।

కారణాగమము

త్రివిధం స్థాపనం ప్రోక్తం శైలలోహ సుధామయం ।
లోహజం స్థానికే కార్యం శయనేహ విశేషతః ।
శిలా సుతా: ప్రకర్తవ్యం నర్వనంపత్కరం నృణాం ।

నంది శిల, లోహ, సుధా ద్రవ్యములచే నిర్మించవచ్చును. లోహము అయినచో నిలిచిన అథవా శయన రూపములయినా నిర్మించవచ్చును. శిల అయినచో శయన

రూపమునే నిర్మించవలసినది. లోహములో నిర్మించునది ఉత్తమము. శిలతో నిర్మించునది మధ్యమము. సుధలో నిర్మించునది కనిష్ఠము అని తెలియవలెను.

ప్రసాదా ద్వాహన స్థానే కరణీయా చతుష్కికా ।
ఏకద్విత్రి చతుః పంచరస సప్త పదాంతరే । 19

ప్రసాద మండనము 2
అపరా 115 [44] దీపార్ణవము 14

వృషభమును శివలింగము ఎదురుగా 1, 2, 3, 4, 5, 6, 7 పదముల దూరమందు స్థాపించవలెను. ఆ స్థలములో చతుస్తంభ మంటపమును నిర్మించవచ్చును. [పదమనగా గర్భగృహము యొక్క అవతల వెడల్పు కొలత]

వృషస్యోచ్ఛ్రయం విష్ణు భాగాంత దృష్టికః ।

అపరా 208
దీపార్ణవము 14 [52]

లింగదైర్ఘ్యే సమాయామే విష్ణ్వంశాంతో న్నతోవృషః

వాస్తుమంజరీ

వృషభము యొక్క పొడవు లింగము యొక్క అద్యంత ఉత్సేధము అంత ఉండవలెను కాక విష్ణు భాగ పీఠమునకు సమమైన ఎత్తు వుండవలెను.

...............స్వయంభు, ముఖ మృణ్మయే ।
శత సహస్ర లింగేషు వృషో న్యూనాధికో విదుః । 49

దీపార్ణవము 14

స్వయంభు, ముఖలింగము, మృణ్మయ నిర్మితమైన శత మరియు సహస్ర లింగమందు నిర్మించు వృషభము ఉత్సేధము అదవా ఎత్తులో విష్ణు భాగమైన పీఠమునకు సమమైయుండక హెచ్చుతగ్గులుండిన దోషమగుటలేదు

లింగాయామోనమో దైర్ఘ్యే ఉచ్ఛ్రాయ పీఠికా సమః ।
సప్త భాగాయతో వృషః పంచ భాగోన్నతో భవేత్ । 50

దీపార్ణవము 14

మొత్తము లింగము యెత్తుకు వృషభము యొక్క పొడవు ఉండి ఎత్తులో విష్ణు భాగమునకు సమమై యుండవలెను. అథవా వృషభము యొక్క పొడవు 7 భాగములలో 5 భాగముల ఎత్తు వుండవలెను

# 33. బాల లింగము

ఆద్యం ద్వితీయమేవంతు ద్వివిధం తరుణాలయం ।

సుప్రభేదము

భాల లింగము రెండు విధములు. ఆలయ నిర్మాణమునకు పూర్వమే ప్రతిష్ఠించుట మొదటిది, జీర్ణోద్ధారణ సమయమున మూలబింబము నుంచి కళాకర్షణము చేసి ఆ శక్తిని క్రొత్తగా చేసిన లింగమునందు ప్రవేశింపచేయుటము రెండవ విధము. అలయమే కాని బింబమే కాని జీర్ణోద్ధారమయిన అనంతరము పునఃమూల విగ్రహములో ఆకర్షణము చేసిన శక్తిని ప్రవేశింపచేసిన ఈ బాలబింబమును త్యజించవలెను.

బాలబింబం ప్రతిష్ఠాప్య పశ్చ్యేన్మూలం ప్రతిష్ఠాపయేత్ ।
బాలస్థానం వినాపూర్వం మూలస్థానం నకారయేత్ ।

సుప్రభేదము 46

ఆలయము మరియు మూల బింబము ప్రతిష్ఠించుటకు మొదటి అనగా ఆలయ నిర్మాణము చేయుట ఆలోచనమున్నప్పుడే విఘ్నాది నివృత్తికున్ను, దేశ క్షేమమునకున్ను, బాల లింగమున్ను ప్రతిష్ఠించి పూజించవలెను. ఆలయము నిర్మించి మూల విగ్రహ స్థాపన అగు సమయమున బాలలింగము యొక్క శక్తిని మూల విగ్రహముతో ఏకీభవించినానంతరము ఈ బాల బింబమును త్యజించవలెను. బాల బింబములో 12 సం॥ల వరకు శక్తి వుండవచ్చును. దానిలోపల ఆలయాదులు నిర్మించి ప్రతిష్ఠాదులు నడిపించవలెను.

ద్వితీయ బాల లింగమును............

పూజాభాగ సమాయామం త్రిపాదం వార్ధమేవవా। ౧॥
అయామ సదృశంనాహం లక్షణోద్ధారణం వినా ।
సతౌ విష్ణు విరించాంశౌ తచ్ఛిరౌ మూలలింగవత్ । ౨॥

సుప్రభేదము 26

పైన చెప్పిన రీతిగా జీర్ణోద్ధారణమునకై ఏర్పడించిన ఈ బాల లింగము మూల లింగము యొక్క పూజాంశ సమాయముగా కాని దానిలో ముప్పావు అథవా అర్ధభాగము గాని వుండవలయును. విష్కంభము [అష్టకొలత] లింగము యొక్క ఎత్తునకు తగిన రీతిగా ఉండవచ్చును. ఈ లింగమునకు లక్షణోద్ధారము చేయనక్కరలేదు. ఇదికాక బ్రహ్మ విష్ణు అంశము అనగా చతురస్ర అష్టాస్రరూపమైన భాగములను నిర్మించనక్కర లేదు. కేవలం రుద్రరూపము అనగా ఆద్యంత వృత్తరూపము మాత్రమే నిర్మించ వలయును. శిరోవర్తనము మూలలింగ రీతిగానే ఉండవచ్చును.

జీర్ణోద్ధారణ సమయమున కళాకర్షణ చేయునపుడు
తల్లింగ ముద్ధరే న్మంత్రీ వృషభేణ శివేనచ ।
సుప్రభేదము

లింగము యొక్క శక్తితో వృషభము శక్తిని ఆకర్షించవలసినది.

మొదట చెప్పిన బాలబింబము దేవాలయము కట్టుటకు మూలకారణము. దీనికి లోహ, శిల, దారు, మృణ్మయాదులలో నిర్మించవచ్చును. 12 అంగుళములలో నిర్మించిన బాల బింబము ఉత్తమము. 7 అంగుళము నుంచి 2 అంగుళముల వృద్ధ్యా 23 అంగుళముల వరకు తొమ్మిది విధమానములో బాల లింగమును నిర్మించవచ్చును. [అనగా 7, 9, 11, 13, 15, 17, 19, 21, 23 ఈ విధముగా చేసి సంఖ్యాగా నిర్మించవలెను] ఈ బాల లింగమునకు శిరోవర్తనము ఛత్రాకారమైయే ఉండవలసినది పీఠము చతురస్ర, పద్మాకార, వృత్త, షోడశాస్ర రూపములలో నిర్మించవచ్చును. బాల లింగమునకు రత్నన్యాసము చేయనక్కరలేదు. ఏలననగా బాలలింగము స్థిరమై ఉండుట లేదు గనుక లింగప్రతిష్ఠలో దృఢము కోరికయై పెట్టు శిల అనవసరము. భూమిపైనే రత్నన్యాసమును చేసి దానిపైన బాల లింగమును ప్రతిష్ఠించవచ్చును. ఈ బాల లింగమునకు బ్రహ్మసూత్రము అనగా లక్షణోద్ధారము లేకుండ నిర్మించవచ్చును.

ఆలయ ప్రతిష్ఠానంతరము విసర్జించునపుడు బాలలింగము దారువు అయినయెడల అగ్నిలోను, శిలాలింగమైన యెడల సముద్రములోను విసర్జించవలెను. ఏ కారణము చేతను ఈబాలలింగమును మూలలింగముతో చేర్చిపెట్టకూడదు. రౌరవక్రియ 27[43]
సుప్రభేదము 26

# 34. ప్రధాన లింగము - అంగ లింగము

ప్రధాన మంగ మిత్యేవం ద్వివిధం లింగముచ్యతే
మండపాః పరివారంవా గోపురాధయః......... ।
యస్య లింగస్య విద్యంతే తత్రప్రధాన మితిస్మృతం । ౨
యత్రప్రధానావిరోధేన పంచప్రాకార మధ్యమే ।
తదంగమితి విఖ్యాతం పరివారైః వినాకృతం ।
శుభాశా సంస్థితం భుక్త్యై ముక్త్యై సర్వాసు దిక్షువ ।
పశ్చిమోత్తర పూర్వాంశాః శుభాశా సంప్రకీర్తితా: ।
కుర్యాత్తేషాం విమానాద్యం మూలధామో సమానకం ।
తత్ర సంస్థాపయే ల్లింగ ప్రతిమాంబో భయాత్మకం । ౫
ప్రాకారత్రయ బాహ్యేతు యదిదేవా: ప్రకల్పితా: ।
పరివారాధికం తత్ర విరోధాయ నకల్పతే ।

## అంగలింగ ప్రమాణము

ఏకహస్తాది త్రిహస్తాంతం అంగలింగ ప్రమాణకం ।
తతఊర్ధ్వం నకర్తవ్యం ప్రాసాదమైవ కల్పయేత్ ।

❖❖❖ ❖❖❖ ❖❖❖

ఏవం య: కారయే దంగ లింగాదే: స్థాపనం నర: ।
అయుః శ్రీకీర్తి సౌభాగ్యారోగ్య భోగ బహుప్రజా:
సలబ్ధకామో దేహాంతే శివేన సహ మోదతే ।
ఏకాద్యైకైక వృద్ధ్యాతు రుద్ర సంఖ్యావ సానకం ।
అష్టోత్తర శతంవాథ తదర్థంవా తదష్టకం ।
శతం వార్ధం తదర్ధంవా శతోర్ధ్వమపి పుష్కలం ।
ఏవం య: కారయే కర్తాన ఏవాహం ససంశయః ।

కామికాగమము 72

# 35. ఉపయుక్త సంప్రదాయ విషయములు

పాఠకుల సౌకర్యము కోరి కొన్ని ఉపయుక్త సంప్రదాయ విషయములను ఇచట వివరించియున్నాము.

1 ఆలయ ద్రవ్యము ననుసరించి లింగస్థాపన చేయునపుడు దారు నిర్మిత ఆలయములో దారు నిర్మిత లింగమును, శిలానిర్మిత ఆలయములో శిలా నిర్మిత లింగమును స్థాపించవలెను.

2 గృహే లింగద్వయం నార్చ్యం గణేశత్రయమేవచ ।
శక్తిత్రయం తథాశంఖం మత్స్యాది దశకాంకితం ।
ద్వేచక్రే ద్వారకాయాస్తు సాలగ్రామ ద్వయం తథా ।
ద్వౌశంఖౌ నార్చయేత్ తద్వద్ సూర్యయుగ్మంత థైవచ ।
శేషంతు పూజనా న్న్యాన ముద్వేగం ప్రాప్నుయాత్ గృహే ।

రూప మండనము 2

3 శివలింగాగ్రే నకర్తవ్యా అర్చా రూపేణ దేవతా: ।
ప్రభానష్టా నభోగాయ యథా తారా దివాకరే ।
శివస్యాగ్రే శివం కుర్యాత్ బ్రహ్మం కాల బ్రహ్మణోగ్రతః ।
విష్ణో రగ్రే భవే ద్విష్ణు...............రహౌరవిః ।

ప్రాసాద మండనము

ప్రసిద్ధ రాజమార్గేణ ప్రాకారస్యాం తరే పిచ ।
స్థాపయే ధస్య దేవాంశ్చ తత్ర దోషో నవిద్యతే ।

ప్రాసాద మండనము

4 నోత్తరాభిముఖః కార్య నదేవాః దక్షిణాభి ముఖ: ।

అపరాజిత 134

శాస్త్రప్రమాణము మరియు కారణములేక ఏ దేవతా విగ్రహమును ఉత్తరాభిముఖముగాకాని దక్షిణాభిముఖముగా కాని ప్రతిష్టించకూడదు. నది రెండుగా చీలి భూమిని చుట్టి మధ్యలో లంకను చేసినపుడు లంకలోనున్న దేవాలయము పూర్వాభిముఖమేగాని అథవా దక్షిణ భాగ నదికి అభిముఖముగా దేవాలయమును ప్రతిష్టించవచ్చును.

5 పూర్వా పరస్య దేవానాం కుర్యాత్ నోదక్షణోత్తరం ।

విధియుక్తముగా పూర్వ పశ్చిమ దిక్కునకు అభిముఖముగా నున్న దేవతను ఉత్తరాభిముఖగానే కాని దక్షిధాభిముఖముగానే గాని ప్రతిష్టించకూడదు.

శైవాష్టకము :–

భస్మస్నానం త్రిపుండ్రంచ పంచాక్షరీ జప; ।
లింగార్చనం తన్నామ సోమవార వ్రతంతథా ।
శివయోగసారం శాస్త్రంచ యేతచ్ఛైవాష్టకం మునే ।

లింగపురాణే

వినాభస్మ త్రిపుండ్రేన వినారుద్రాక్షమాలయా ।
పూజతోపి మహాదేవో నస్యాత్ తస్యఫలప్రద: ।
తస్మాన్ మృదాపి కర్తవ్యం లలాటే వైత్రిపుండ్రకం ।

లింగపురాణే

ప్రదక్షణ విచారే :–

ఏకాచండ్యా రవౌసప్త త్రిస్రోదద్యాత్ వినాయకే ।
చతుస్రో వాసుదేవస్య శివస్యా ర్థప్రదక్షిణా ।

ప్రాసాద మండనము

## ఆయతన విచారే :-

చండికాగ్రే భవేన్మాతా యక్ష క్షేత్రాది భైరవ: ।
జ్ఞేయా తేషామభిముఖే యేయే షాంచహితైషిణ: ।

ఆయతన విచారమందు పంచలింగ నవ లింగములుకాక వేరువేరుగా విగ్రహ [మూర్తులను వేరువేరు స్థానమందు నిర్దిష్ట దిగానుసారిగా దృష్టి దోషములేక స్థాపించుట క్రమమున్నది. దానిలో పంచాయతన, సప్తాయతన, నవాయతన, ద్వాదశాయతన, అని భేదములు ఉన్నవి. విష్ణు, చండి, శివ, గౌరి, సూర్యుడు మొదలయిన మూర్తులలో ఆయతనమున్నవి.

ఇదికాక పంచమూర్తి ప్రతిష్ట, నవమూర్తి ప్రతిష్టా. భేదములున్నవి. ఈ పంచ నవమూర్తులు గర్భగృహ లోపలలోనే ప్రతిష్టితమై యుంటున్నది. దీనికి శ్రీరామ పంచాయతనము, శ్రీ కృష్ణ పంచాయతనము అని పేరు. ఈ విషయములన్నిని ఇదే గ్రంధకర్త వ్రాసియున్న భరతఖండ దేవాలయములు మరియు ఆగమోక్తమూర్తులు అనే గ్రంథమందు వివరముగా చూడవచ్చును.

---



దే వ తా ం శ ము లు [పేజీ 52]




అర్ష లింగములు అను అధ్యాయమున [పేజీ 90 నుండి] వివరింపబడిన శివలింగముల భేదములు - [1] స్థూలమూల లింగము [2] స్థూలాగ్ర లింగము [3][4] స్థూల మధ్య లింగము [5] పీలికా మధ్య లింగము [6] అక్షయ మధ్య లింగము.




లింగ ప్రభేదములు [పేజీ 56]




లింగ ప్రభేదములు [పేజీ 56] లో వివరింపబడినవి.























లింగ శిరోవర్తనము వివరములు [పేజీ 71]




అశ్రలింగము – [పేజీ 95]    సహస్ర లింగము – [పేజీ 97]




లింగ లక్షణోద్ధారము [పేజీ 115]

1. ముఖభాగము    2. వెనుక భాగము



లింగ పీఠము – వివరములు [పేజీ 122]



నాళము – [పేజీ 129]
















నిర్మాల్య ద్వారము




పంచలింగ ప్రతిష్ఠాకము  నవలింగ ప్రతిష్ఠాక్రమము
లేక  బహులింగ ప్రతిష్ఠాక్రమము
[పేజీ 105లో వివరింపబడినది]

విద్వాన్ అనూరి శ్రీనివాసయ్యంగారు మైసూరు రాజ్యములోని
మేల్కోటే సంస్థానమునకు చెందినవారు వీరి తండ్రిగారైన
అనందాళ్వార్‌స్వామి దగ్గర ఉభయవేదాంతము లభ్యసించి
విజ్ఞానతృష్ణతో శిల్ప ఆగమ, ఇతిహాస పురాణములపై
శ్రమించి ఎన్నో ఉద్గ్రంథరాజములను రచించిరి.
తిరుపతిలోని ఆగమకోశ నిర్మాణమునకును
హైదరాబాదులోని శిల్ప శాస్త్రానువాద కార్య
క్రమమునకును మిక్కలి చేయూత నిచ్చిరి
దేవాలయములు – పూజావిధానము –
మూర్తులు–శిల్పములు-అలంకారములు
మొదలగు ననేకవిషయములపై విద్వత్
పూర్ణములైన గ్రంథములు వెలయించిరి.
సంస్కృతము, తెలుగు, తమిళము
కన్నడము మొదలగు భాష
లలో పండితులు, ప్రస్తుత
గ్రంథము వారి శైవా
గమ పాండిత్యము
నకు దర్పణము
వంటిది.

Printed at Gayatri Printers 4-1-10/1, Tilak Road,
Hyderabad-1. Phone : 224313